---

కని - కళ్లారా ననుగని, నా కనుఁ
గుర్తించక ముందే, ఆ కళ్లల్లో నీరు
నింపి, పసినాడే నన్ను విడిపోయిన

తల్లికీ —

పెంచి - పెద్దచేసి, నా భవితవ్యపు
వెలుగులు చూడాలని ఆశించి, అంధ
కారంలో ఉండగానే తరలిపోయిన

తండ్రికీ —

అశ్రుమిళిత నయనాలతో, భారపూరిత
హృదయంతో ఉభయులకూ
ప్రేమానురాగ పురస్సరంగా

---

# అభివందనాలు

"దత్తత"కు "గీటురాయి"ని దయతో వ్రాసి అందజేసిన గురుతుల్యులు "ఆంధ్రవిశారద" శ్రీ తాపి ధర్మారావు నాయుడుగార్కి —

"దత్తత"ను తమ పత్రిక ద్వారా పాఠక లోకానికి అదిలో పరిచయంచేసిన "ఆంధ్రవారపత్రిక" సంపాదకులకూ —

"దత్తత" ప్రచురణ విషయంలో నేను దూరంగా ఉన్నా, భాధ్యతను స్వీకరించి శ్రద్ధగా ముద్రించిన "గీతాఆర్టు ప్రింటర్సు" వారికీ —

రచయిత

# గీటురాయి

వంటరుచి తింటంలో తెలుస్తుందంటారు. నలుగురు ఆప్యాయంగా తింటే, రుచిగా ఉందన్నమాట. పినిశెట్టివారి దత్తత ఆంధ్ర వార పత్రికలో సీరియల్‌గా (భాగాలుగా) పడుతూ ఉన్నప్పుడే పాఠకులు దానిని ఎంతో ఆదరంతో చదివారు; తరువాతి భాగం ఎంతట వస్తుందా అని ఎదురు చూచారు. ఇదే గ్రంథరుచికి గీటురాయి పరీక్ష.

అలాగ రుచించడానికి కారణాలు కావలసినన్ని ఉన్నాయి. సులభమైన మాటలతోనూ, చిన్నచిన్న వాక్యాలతోనూ రచన పరుగెత్తుతూంది. కథాగమనాన్ని అడ్డే ప్రకృతి వర్ణనలు లేవు. సన్నివేశాలన్నీ కంటికి కట్టినట్టూ, మనస్సుకంటినట్టూ ఉన్నాయి. ఆయా ఘట్టాలయందు పాత్రల హృదయాలలో కలిగిన భావాలూ, ఆ భావాల

పరిణామాలు, భూతద్దంలో చూచినట్లు ప్రస్ఫుటంగా కనబడుతుంటాయి.

ఇన్నిటికీ ముఖ్యం: సమయానుకూలంగా గ్రంథంలో రచయిత ప్రకటించిన ప్రపంచానుభవం. లోకంపోకడను పరిశీలించి, ఆ పరిశీలనా ఫలితాలను తేటమాటలతో చెప్పగల నేర్పు పినిశెట్టివారిలో కనబడుతుంది.

తలపై గొడుగులేని ఆడుదిగా అవస్థల పాలయిన కథానాయిక శాంత, న్యాయానికి అంకితుడయిన ఉపాధ్యాయుడు ధర్మయ్య, భిన్న పరిసరాలలో భిన్న ప్రవృత్తులుగా పెరిగిన సోదరులు - రవి రాములు; సంస్కృతి స్వాభిమానాల మధ్య చిక్కుకున్న జమీందారు గంగాధరం, అందరూ పాఠకు... చిరపరిచితులుగానే కనబడతారు; సా...నుభూతిని చూరగొంటారు.

సందుచేసుకొని రవి ద్వారా కార్మికవర్గ చైతన్యాన్ని ప్రకటించి, రచయిత అధి...

సంఖ్యాకుల ఆదరాభిమానాలను సంపాదించ గలిగాడని చెప్పక తప్పదు. గ్రంథం చివరను రవి రాముల సమ్మేళనము కల్పించి పినిశెట్టివారు దేశాభ్యుదయానికి ధనిక కార్మిక వర్గాల సమైక్యతే ముఖ్య సాధనమని సూచించారు.

పినిశెట్టివారిది నాటకాలకు అలవడిన చేయి; కాబట్టి యీ నవల చాలవరకు నాటక బాణీలోనే నడిచింది; కాబట్టి విసుగు కలిగించ కుండా పాఠకులను ముందుకు త్రోసుకుంటూ పోగలిగింది.

ఈనాటి అనువాద పరంపరలో ఇలాంటి స్వతంత్ర రచన చూడగలగడం ఆంధ్ర సారస్వతాభిమానులకు సంతోష కారణం కాక తప్పదు. పరిశీలన బుద్ధిగల రచయిత లకు మన సామాజిక జీవితంలో కథావస్తువు లకు కరువు కనబడకూడదు. పినిశెట్టివారి

లాంటి సమర్థులయిన యువకులు తమ శ్రద్ధను ఆంధ్ర జీవిత సమస్యలమీద కేంద్రీకరించినట్లయితే, త్వరలోనే ఆంధ్రులు గర్వించదగిన నవలలు వెలువడగలవనడానికి సందేహంలేదు. అనతి కాలంలోనే పినిశెట్టి వారి కలం మరికొన్ని చక్కని పదహారణాల ఆంధ్ర నవలలను, ఆంధ్ర పాఠకలోకానికి అందజేస్తుందని ఆశిస్తున్నాను.

మద్రాసు.
20-11-54

తాపీ ధర్మారావు.

# 1

వైద్యుడు రామయ్యచౌదరి ప్రతిభ ఒకనాడు కృష్ణాజిల్లా అంతటా ప్రకాశించింది. రానురాను ఆయన హస్తబలం తగ్గడంవల్లనో, ఆయుర్వేదం తీసికట్టై అల్లోపతి పైమెట్టుకు పోవడంవల్లనో, మరే కారణంగానో ఆదాయం పూర్తిగా తగ్గిపోయింది. ఇంతకూ యాభై ఏళ్ల ప్రాయంలోనే చౌదరి కాలం చేశాడు.

తమ్ముడు చంద్రయ్య చౌదరికి అన్నగారు పోవడం పూర్తిగా విచారకారణమే అయినా, బ్రతికి ఋణభారాన్ని పెంపుచేయకుండా ఆపుచేసినందుకు మాత్రం, స్వల్పంగా సంతోషించలేకుండా ఉండలేక పోయాడు.

రామయ్య చౌదరి భార్య శాంతమ్మకు భర్త పోయే నాటికి వస్తువాహనాలు ఏమీలేవు. కాని రాము, రవి అనే తన యిద్దరు మగబిడ్డలనూ అన్నింటికన్నా ఘనంగానే చూచుకుంటూంది.

తండ్రిపోయేనాటికి రవికి రెండేళ్ళు, రాముకి నాలుగో

శాంతమ్మ కోడలు సుభద్రకు, తన భర్త కమీషను వ్యాపారంలో వచ్చే కొద్ది మొత్తంలో, ఈ

కుటుంబాన్నికూడా పోషించడమనే భారం, బాధాకరం కాకుండా పోలేదు. అయితే చంద్రయ్య చౌదరి మాట కాదనలేక కాలాన్ని కష్టంగానే వెళ్లబుచ్చుతోంది.

కొందరు బాధనుగాని సంతోషాన్నిగాని, చాలాకాలం దాచుకోలేరేమో; ఒకవేళ గుప్తపరచగల గంభీర స్వభావు లున్నా, గుర్తించే వ్యక్తులఎదుట మాత్రం ఏదో రూపంలో ఆ భావం వెల్లడిగాకుండా పోదు.

సరిగ్గా చౌదరి కుటుంబంలో అదే జరిగింది. భర్త పోయిన అనంతరం ఆరుమాసాలు అనాయాసంగా గడిపిన శాంతమ్మ తోటికోడలు ప్రవర్తనద్వారా యిక ఎక్కువ కాలం ఆ యింట్లో ఉండగల అవకాశం లేదని నిర్ణయించుకో గలిగింది.

ఆరోజు బాకీదారు బంగారయ్య, చంద్రయ్య చౌదరిని కష్టంగా మాట్లాడి వెళ్లినతర్వాత, పరలోకంలో ఉన్న బావ గార్ని ఉద్దేశించి సుభద్ర "చచ్చికూడా సాధిస్తున్నావా మహానుభావా!" అంది.

పెరటిలో. బిడ్డలకు తిండి పెడుతున్న శాంతమ్మకు, ఈ మాటలు వినిపించాయి. అయితే బ్రతికుండగా తన భర్త తమ్ముడుపై కక్ష కట్టింది ఏమీ లేదని తెలుసు. కాని తోటి కోడలు నోటినుంచి వెలువడ్డ ఈ అసందర్భ అర్థరహిత పదా నికి, కారణం ఊహించడానికి ఎక్కువ కాలాన్ని వినియోగించ లేదు.

అంతటితో సుభద్ర ఊరుకున్నా, శాంతమ్మలో తలెత్తబోయే మనోవ్యథ మభ్యపడేదేమో; కాని మళ్ళీ సుభద్ర మాటలు వినిపించాయి! "ఈ పాడు సంసారాన్ని కూడా మా నెత్తిమీద పడేసి మరీ పోయాడు."

తను బ్రతికుండగా ఎంతో గౌరవంగా 'మీరు' అని ఉచ్చరించిన మరదలు, తనువుచాలించిన తర్వాత, నీచంగా మాట్లాడి, ఈలాంటి అభాండాలు వేయగలదనే ఊహ, ఏ కోశాన్నన్నా - చౌదరికీ కలిగుంటే; చచ్చి బ్రతికున్న భార్యను యింత బాధ పెట్టకుండా వాళ్ళకు ఏదో ఒకదారి చూపించి వెళ్ళేవాడేమో. కాని, తమ్ముడి కుటుంబం వేరు, తన సంసారం వేరు అని బ్రతికున్న రోజుల్లో భావించగల అవకాశం, ఏనాడూ కలగలేదు చౌదరికి, అదే ఊహిస్తోంది శాంతమ్మ.

ముద్దు పెట్టబోతూ చెమ్మగిల్లిన కళ్ళతో ఉన్నతల్లిని చూసిన రవి—"అమ్మా" అన్నాడు.

బిడ్డ హెచ్చరిక ద్వారా మేలుకున్నతల్లి రవినోట్లో ముద్దపెట్టింది.

ప్రక్కగా కూర్చొని స్వంతంగా అన్నం తింటూన్న రాము, తల్లికేసి ఆశ్చర్యంగా చూశాడు; "ఏడుస్తున్నా వేమ్మా"

పమిటచెంగుతో కళ్ళు తుడుచుకొని, ఖాళీ అయిన గిన్నెలు తీసుకొని లేచింది శాంతమ్మ.

కొట్టకుండా తిట్టకుండా యిష్టంలేని వ్యక్తులను ఇంట్లో నుంచి సులభంగా సాగనంపే విద్య పురుషులకన్నా స్త్రీలకే బాగా తెలుసు.

చావిడిలో డస్కు దగ్గిర కూర్చొని పద్దులు వ్రాసు కుంటున్నాడు, చంద్రయ్య చౌదరి. ఎడబిడ్డను చంకను వేసుకొని చిన్న బట్టలమూటతో, రాముతో, వచ్చి నిలబడిన ఒదినగార్ని చూసి, మొదట్లో ఆశ్చర్యపడ్డాడు.

"ఏం వొదినా?"

శాంతమ్మ మాట్లాడ లేకపోయింది.

"ఎక్కడికీ ప్రయాణం?" కంఠంలో శాస్త్ర ఆత్రం ధ్వనించింది.

"ఎక్కడకన్నా వెళతాను" రుద్ధధ్వనితో భారంగా వినిపించిందీ మాట చంద్రయ్యకు. మరీ ఆశ్చర్యంగా చూస్తూ లేచి నిలబడ్డాడు.

"ఎవరేమన్నారు?"

శాంతమ్మ వాడిన నవ్వు నవ్వింది.

"అనేవారు పోయారుగా బాబూ!" ఈ మాటతో ఆమె కళ్లల్లో నీళ్ళు పొడచూపాయి. కాని నిగ్రహించుకొంది. మళ్లీ "ఎవరూ ఏమీ అనలేదనీ ఒక్కడి రెక్కలమీద వచ్చే ఆదాయాన్ని అన్యాయంగా తింటూ కూర్చోడం బావుం టుందా?" అని ప్రశ్నార్థకంగా చూసింది.

చంద్రయ్య ఆలోచిస్తున్నాడు. ఈనాటికీ అతనికి కలుగని యీ ప్రశ్న ఒదినగారికి కలిగిందంటే, కారణం ఎవరై యుంటారు? ఇదే ఆలోచించాడు.

"ఇప్పుడేవస్తా."

శాంతమ్మ ఆశ్చర్యంగా చూసింది. చంద్రయ్యను వెనక్కి పిలుద్దామనుకుంది. కాని వెంటనే ఆలోచించింది. చంద్రయ్య వెళ్లినదానివల్ల చెడ్డ ఏమీరాదని ఆమెకు తెలుసు.

తిన్నగా లోపలకు వెళ్ళాడు చంద్రయ్య. నొసట నిశ్చింతగా కుంకుమ ధరిస్తూన్న సుభద్ర, భర్త అడుగులు చప్పుడు విని వెనక్కి తిరిగి చూసింది.

"వొదిన్ని ఏమన్నా అన్నావా?"

ఈ సూటైన ప్రశ్నకు మొదట్లో కాస్త స్తంభించింది. తరువాత ఈలా అడిగింది.

"నే నేమన్నా అన్నానని మీకు చెప్పిందా?"

"లేదు"

"మరి?" ప్రశ్నార్థకంగా చూసింది.

చంద్రయ్య వెంటనే సమాధానం యివ్వలేకపోయాడు. కాని మెల్లగా యిలా అడిగాడు.

"కారణం లేకుండా ఎందుకు ప్రయాణం చేస్తుంది?"

"ఆసంగతి నన్నడిగితే నేనేం సమాధానం చెప్పను."

మొహం చిట్లించుకొని, విసుడుగా వంట గదివైపు దారితీసింది. చంద్రయ్యక్కూడా అంతు పట్టలేదు. ఆలోచనగా వీధి గుమ్మంకేసి మెల్లగా నడుస్తున్నాడు.

"ఇదిగో!"

ఈ మాటవిని వెనక్కి తిరిగిచూశాడు చంద్రయ్య. సుభద్ర వంటగది గుమ్మంలో నిలబడి పిలిచింది.

"వొదినగారిమీద మీ కంతగా దయుంటే; వెళ్ల నివ్వకండి. ఈ దుబారా ఖర్చు చూస్తూ మాత్రం ఈ పాడు కొంపలో నే నెంతో కాలం ఉండలేనిమాట నిజం. నేనే కాదు, తనఖావాళ్ళక్రింద ఈయిల్లు కాస్తాపోయినతర్వాత, మీరు కూడా ఊరూరా బయలుదేరవలసిందే–"

"ఏమిటి నువ్వనేది" చంద్రయ్య కంఠం బిగ్గరగా ధ్వనించింది.

"ఆమాత్రం అర్థం తెలుసుంటే; మన బ్రతుకులెప్పుడో బాగుపడును."

చేయి ఒక్కసారి కోపంకొద్దీ ఎదుటకు ఊపి విరక్తితో కూడినభావాన్ని వికటంగా వెల్లడిచేసి, గదిలోకి వెళ్ళిపోయింది.

చంద్రయ్య స్తబ్ధుడై నిలబడిపోయాడు. భార్యమాటల వైఖరినిబట్టి కోపం వచ్చినా – కేవలం ఆమె మాటల్లో ఆమె స్వార్థచింతేగాకుండా తన శ్రేయస్సు కూడా ఉందని గుర్తించ గలిగాడు. అయితే అన్నగారు జ్ఞప్తికి రావడంతో, మలిన

మవబోతూన్న చంద్రయ్య నిష్కపటమానసం కొద్దిగా కంపించింది. కాని ఒదినగార్ని ఆపుచేసినా లాభంలేదని గ్రహించాడు. ఆమె యిష్టానికి వ్యతిరేకించకూడదని నిర్ణయించుకున్నాడు. తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

చావడిలో చాలాసేపు వేచివున్న శాంతమ్మ మరది రాక, ఆలస్యం కావడంతోనే, తిరిగి తన్ను చూడలేక రాలేక పోయాడని వూహించుకుంది. మెల్లగా నడచి గుమ్మం దిగబోతోంది.

"వొదినా."

మరది మాటవిని వెనక్కి తిరిగిచూసింది.

"లోపలికి రా."

చంద్రయ్య చౌదరి తిన్నగావచ్చి రాముని చంకను వేసుకున్నాడు.

"నువ్వు చేసేదేమిటి బాబూ"

శాంతమ్మ ఆత్రంగా అడిగింది.

"నే నేమన్నా చేసేవాడినైతే నిన్ను వెళ్ళనిస్తానా? ...అన్న బిడ్డలు...నాబిడ్డలే అనుకున్నాను."

అతని కంఠం గద్గదికమైంది. కళ్ళుకూడా చెమ్మగిల్లాయి. శాంతమ్మ గుమ్మంలోపలకు వచ్చింది.

చావడిలో రామునిక్రిందకు దింపి "తప్పకుండా వెళ్లు వొదినా! బండికోసం కూడా పంపించాను. కాని వెళ్ళేముందు, నీ మనస్సులో నాపై కష్టముంటే, ఎదురుగానే తిట్టివెళ్ళు, కాని పరుల ఎదుట నన్ను నేరస్థునిగా నిలబెట్టకు."

ఈమాటలు విని శాంతమ్మ చకితురాలైంది. బరువుగా, బాధగా నిట్టూర్చింది కూడా.

"చంద్రయ్యా! ఇందులో ఎవరూ నేరస్థులుకారు... అన్యాయంగా దూషించడం నాకుచేతకాదు... ఎప్పుడైనా బాధగలిగితే; నాకు కలిగిన రాతగురించి నన్ను నేనే దూషించుకుంటాను."

గుర్రపుబండి గుమ్మంలోకి వచ్చిఆగింది. శాంతమ్మ కళ్ళుతుడుచుకుంది.

"తీసుకో వొదినా"

అశ్రుమలినమై ఉన్న కళ్ళతో ఆశ్చర్యంగా చూసింది. పదిరూపాయల కాగితాలు చంద్రయ్య, చేతిలో ఉన్నాయి.

"నూట ఏభై; ఇంతే ఉన్నాయి పెట్లో; ఇంతకన్నా ఏమీ యివ్వలేనందుకు బాధగానే వుంది... తీసుకో" చంద్రయ్య ఉద్వేగంతో వచ్చే మాటలనుండి, అతని ఆవేదనామయ హృదయాన్ని చూడగలిగింది శాంతమ్మ. తిరిగి మాట్లాడకుండా తీసుకుంది.

రాముని చంద్రయ్య ఎత్తుకొని బండిలో కూర్చో బెట్టాడు. మెల్లగా శాంతమ్మ, రవికూడా ఎక్కి కూర్చున్నారు.

బండి కదిలింది. చూపుమేర వరకూచూచి చంద్రయ్య కళ్ళు ఒక్కసారి తుడుచుకొని లోపలకు వచ్చాడు. సంతుష్టిగా నిట్టూరుస్తూ చిరునవ్వుగా చూస్తున్న భార్య మొగంకూడా ఆ కాస్సేపటిలో చాలా వికారంగా భయంకరంగా కనిపించింది చంద్రయ్యకు.

# 2

శాంతమ్మ తెనాలి రైల్వేస్టేషన్ రైలులో దిగింది. రాముని నడిపిస్తూ రవిని చంకనువేసుక స్టేషన్ వెలుపల కొచ్చింది. అది కన్నవారి వూరు కావడంవల్ల చిన్ననాటి సంగతులు ఆమె మనస్సులో కదల నారంభించాయి. తాను కాపురానికి వెళ్ళి పది సంవత్సరాలు కావచ్చింది. పది సంవత్సరాల్లో అనేక మార్పులు జరిగాయి.

ఆమె తల్లి చిన్ననాడే పోయింది. తండ్రి తనకు పెళ్ళయిన రెండో సంవత్సరములోనే మరణించాడు. ఆర్థిక బాధవల్ల ఏనాడో పరారైన అన్నగారు ఎక్కడున్నదీ తెలీదు. ఇక ఆ గ్రామంలో వృద్ధాప్యంలో ఉన్న మేనత్త వెంకమ్మ మాత్రం ఉంది. ఇక అక్కడికే వెళ్ళాలని ఆమె నిర్ణయం. ఒక జట్కాలో బిడ్డలతో ఎక్కింది.

"ఎక్కడికమ్మగారూ?" బండివాడు అడిగాడు.

"మారీసుపేట ... వెంకమ్మగారింటికి" అని జవాబు చెప్పింది.

"చెల్" అని గుర్రాన్ని కమిచీతో మోదాడు.

కొంతదూరం బండి నడిచిన తర్వాత, బండివాడు ఇలా అన్నాడు.

"పాపం పాొటలు కట్టేసిందమ్మా."

శాంతమ్మ ఆశ్చర్యపడింది.

వెంకమ్మ పూటకూళ్ళు పెడుతూ ఆరు సంవత్సరాలుగా ఆ తెనాల్లో ఉంది. బాగా భోజనం పెడుతుందనే పేరుకూడా సంపాదించింది. అందుకే పూటకూళ్ల వెంకమ్మ పేరు తెలీని వాళ్ళు ఆ వూళ్ళో బహుతక్కువమంది.

"హోటలెందుకు కట్టేసింది?"

శాంతమ్మ కారణాన్ని తెలుసుకోడానికి ఆత్రంగా అడిగింది.

"ఉబ్బసరోగం గదండీ...అందులో వయసుమీరింది"

ఈలోగా రోడ్డుకడ్డుగా పండుకున్న కుక్కను తప్పించే దృష్టిలో ఉండిపోయాడు బండివాడు. శాంతమ్మ భారంగా ఒక్క నిశ్వాసం విడిచిపెట్టింది. ఏ ఆశతో తాసీ ఊరు చేరుకుందో, అది కాస్తాకూడా శూన్యమయిందా అని బాధ పడింది. కేవలం మేనత్త సంపాదనమీదనే జీవించాలనే ఉద్దేశం ఆమెలో లేదు. అయితే వెంకమ్మకు చేదోడు వాదోడుగా ఉంటే, వంట విషయంలో కాస్త కష్టపడితే, తన బిడ్డలతో సహా జీవించవచ్చుకదా అనే ఆశే, అత్తిల్లు విడిచేంత తెగింపునకు మొదట్లో ఆధారమైంది.

ఒక పెంకుటిల్లు ముందుగా బండివచ్చి ఆగింది. శాంతమ్మ బిడ్డలతో బండి దిగింది.

"ఎంత బాబూ?"

"అర్ధరూపాయి."

బండివాడికి డబ్బులిచ్చి యింట్లోకి వెళ్ళింది. దొడ్లో నించి బిందెతో నీళ్ళు తెస్తున్న పనిపిల్ల, ఆశ్చర్యంగా చూస్తూ ఆలాగునే ఉండిపోయింది.

"ఎవరు మీరు?" అని అడిగింది.

"వెంకమ్మగా రెక్కడ?" శాంతమ్మ ప్రశ్నించింది.

"ఆ గదిలో—"

శాంతమ్మ గదిలోకి వెళ్ళింది. మంచంమీద కూర్చొని జపమాల త్రిప్పుతున్న వెంకమ్మ, అర్ధనిమీలిత నేత్రాలతో చూసింది. తరువాత జపమాల ప్రక్కను పెట్టింది. కళ్ళు మసకలు కావడంవల్ల మనిషిని పూర్తిగా గుర్తించలేక పోయింది. మెల్లగా లేచి దగ్గరకు వచ్చింది.

"అత్తా" శాంతమ్మ దుఃఖపూరిత కంఠధ్వనితో పిలిచింది.

"ఆఁ" అంటూ వెంకమ్మ ఆశ్చర్యంగా చూచి, శాంతమ్మగా కంఠధ్వనివల్ల గుర్తించి హఠాత్తుగా ఆలింగనం చేసుకొని "దేవుడు నీకూడా ఇదేగతి తెచ్చాడమ్మా-" అని రోదనస్వరంతో అంది.

"రామ్మా-రా-చాలాకాలానికి చూశాను. ఎప్పటి కప్పుడే వద్దామనుకుంటే మాయదారి రోగం రానిస్తేనా?" అంటూ ఆయాసం దగ్గుతో కాస్త తటపటాయించి లోపలికి చూస్తూ "ఒసే తులసీ...ఎక్కడ చచ్చావే" అంటూ మళ్ళీ

శాంతమ్మ కేసి చూసి "దిక్కుమాలినదాన్నయిపోయాను. పనిముండలమీద ఆధారపడవలసి వచ్చింది...ఏమిటాలాగే నిలబడ్డావ్...కూర్చో" అంటూ వెంకమ్మ కూర్చుంది. ఎదురుగా ఉన్న మంచంమీద బిడ్డలతో శాంతమ్మ కూర్చుంది.

"ఏవీ నారత్నాలు" అంటూ బిడ్డలకేసి ఆసక్తిగా చేయి చాపింది వెంకమ్మ.

ఆమె ఆయాసం, ఆమె మాటలు, వైఖరి చూస్తున్న రామూ, రవి కూడా బిక్కుబిక్కుమంటూనే ఉన్నారు. అంచేత ఆమె చేతిలోకి వెళ్ళలేదు సరికదా ఇద్దరూ భయంగా వెంకమ్మ కేసి చూస్తూ తల్లినికౌగలించుకున్నారు.

"ఎందుకమ్మగారూ!" అంటూవచ్చింది పనిపిల్ల. "వాళ్లకు కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చావా?" మళ్ళీ కాస్త ఆయాసపడి "వట్టి మొద్దు ముండ... లేమ్మా ఎండలో వచ్చావు...బిడ్డలకు కాస్త తిండిపడేయి... ఎందుకే ఆలా చూస్తావ్...దిక్కులేనివాళ్లకు దేవుడేదిక్కు...తల్చుకుంటే వచ్చి పోరిగేదేమీ లేదమ్మా" అంటూ వెంకమ్మ లేచింది. శాంతమ్మకూడా లేచింది.

శాంతమ్మ అసలు జరిగినదాన్ని తలవడల్లేదు. తలిచినా లాభంలేదని ఆమెకు తెలుసు. అయితే జరగబోయే జీవితం ఏలాగాఅనేది మాత్రం ఆమె ఆలోచన. తన నోటితో ఒక్క మాటకూడా ప్రస్తావించడానికి అంత ఆయాసంలోకూడా

వెంకమ్మ అవకాశం యివ్వలేదు. అయితే అవకాశంలేదనే భయంమాత్రం శాంతమ్మకు లేదు. కాగా వెంకమ్మ ఆదరణ కొంత ఆశాజనకంగానే వుంది, అంతా గది విడిచారు.

వెంకమ్మ, వట్టి బోళా మనిషి అని చూడ్డంతోనే, మాటలు వినడంతోనే సులభంగా నిర్ణయించేవాళ్ళున్నారు. అయితే అమాయకురాలని ఒక్కళ్ళూ ఒప్పుకోరు. కాని ఆమె జీవితం ఆఖరిభాగంలో గడచిన ఆరు సంవత్సరాలూ మంచి అనుభవజ్ఞురాలుగా చేశాయి. హోటలు పెట్టిన కొద్ది కాలంలోనే, అనేక తరహాల మనుష్యుల రాకలతో, పెట్టే తిండికన్నా మాటలద్వారా, మనుష్యులను ఎంత సంతృప్తి పర్చవచ్చో ఆమె బాగా గుర్తించింది. ఇతర హోటళ్లకన్నా ఈమె పెట్టేతిండిలో విశేషపదార్థాలు ఏమీ లేకపోయినా, ఆదరణద్వారా మాత్రం ప్రతివాళ్ళూ "వెంకమ్మ చాలా మంచిది" అని అనకుండా ఉండలేకపోయేవారు. అయితే దేనివల్ల ఆమె మంచిదిగా చలామణీ అవుతూ వచ్చిందో ఆమాటకారితనాన్ని మాత్రం ఇంత ఆయాసంలో కూడా ఆమె విడిచి పెట్టకపోవడం శాంతమ్మకు ఆశ్చర్యంగానే తోచింది.

ఆరాత్రి రాము అప్పుడే నిద్దట్లోపడ్డాడు. వేరే మంచం మీాద రవి పండుకున్నాడు. శాంతమ్మ రవిని జోకొడుతూ మంచంమీాదనే కూర్చొని ఉంది.

వెంకమ్మ మెల్లగా గదిలోకి వచ్చింది.

"ఇంకా పడుకోలేదమ్మా" అంది.

పరధ్యానంగా ఉన్న శాంతమ్మ వెనక్కి తిరిగి చూసింది. మెల్లగాలేచి గోడను ఆన్చి ఉన్న వాలుకుర్చీ మంచం దగ్గరగా వేసింది.

కుర్చీలో కూర్చొని, తీక్షణంగా వెంకమ్మ శాంతమ్మ మొగంలోకి చూసింది.

"శాంతా" జాలిగా ధ్వనించిందా కంఠం.

చిన్ననాడు అందరూ శాంతమ్మను అలాగే పిలిచేవారు. ఏదో మరచిన మధురమైన పిలుపు ఎంతకాలానిగ్గానో మళ్ళీ వింది.

"బ్రతకలేనని భయపడేవాళ్ళు, బ్రతికుండి కూడా చచ్చిన వాళ్ళకన్నా ఏంఘనం కాదు...చూడు! నేను ఆడదాన్నే- ఆయన పోయిన మొదట్లో ఈలాగే ఆలోచించేదాన్ని...అయితే తినడానికి లోటు లేదని, తిండిపెట్టే వాళ్ళతో సూటీ పోటు మాటలు పడ్డం ఎంత కష్టమో నువ్వు గ్రహించే వుంటావ్."

ఇప్పుడు కాస్త దగ్గొచ్చింది వెంకమ్మకు. దగ్గిన తర్వాత కాస్సేపు ఆయాసపడింది.

"హోటలూ..." శాంతమ్మ అడగబోయింది. మాటలో పూర్తిభావం ఆమె మనస్సులోనే ఉండిపోయింది.

వెంకమ్మ ఆయాసపడుతూనే చేయిపెట్టి ఆమె మాటను ఆపు చేసింది.

"హోటలు ... మొదట్లో పెట్టినప్పుడు శారాలు మిరియాలు నూరాడుగా ఘూ మరది...అన్నం అమ్ముకోడం పాపమట...వంశమర్యాద పోతుందట. అబ్బే! నేను లెక్క చేయలేదు. నాలుగురాళ్లు సంపాదించడంతోనే – నాబదినగా రంటూ తెగ తిరిగాడు. అతని కొడుకుని నేనేగా పెంచి పెళ్ళి చేసింది! ఒక్కపూట భోజనం తప్ప ఒక్క కానీ యిస్తేనా ఊహు! అందుకే శాపనార్థాలు పెడుతూచచ్చాడు. పెంచిన విశ్వాసంలేకుండా ఆ వెధవకూడా, దూరమయినాడు... ఏమ్మా నిద్దరొస్తుందా?"

"లేదు" శాంతమ్మ ఏదో అడగాలనుకుంటుంది. కాని అడిగిన తర్వాత సమాధానం ఏ మొస్తుందో నన్నే భయం ఆమెలో ఉన్నట్లుగా ఆమె అడగడానికి భయపడిన లక్షణాలు గుర్తిస్తే తెలుస్తుంది.

"చిన్నా...న్న..."

నిద్దట్లోరాము కలవరించాడు. వెంకమ్మ అటుచూసింది. దగ్గుతో కలసినవ్వు నవ్వింది.

"వెధవకు చిన్నాన్నదగ్గర చేరికా?"

"ఔను"

"పడుకోమ్మా! నిద్దరొస్తున్నట్లుంది" మెల్లగా కర్ర ఆధారంతో లేచింది వెంకమ్మ.

శాంతమ్మకు నిద్దర రావడంలేదు.

"అక్కా"

వెంకమ్మ వెనక్కి తిరిగింది.

"మళ్లీ హోటలు పెడితే!"

వెంకమ్మ ఈ మాటతో ఒక్కసారి కఫంతో కూడిన నవ్వు నవ్వింది.

"హోటలు...మాటలమ్మా!...నీ నోటిలో నాలుకే లేదు...నే నసలు పని ముట్టుకోలేను...ఇదిగో శాంతా! మగవాళ్ల ఆధారం లేకుండా హోటలు నడపడమంటే..." ఉదాహరణ ఏం చెప్పాలో ఆసమయంలో ఆమెకు తోచలేదు. కాస్సేపాగి వెంటనే ఏదో తట్టిన దానిలాగు "నే నొక్కదాన్నే చేసేననుకో—" అని ఊరుకుంది.

"అంతకష్టమా?" నిజంగా సంశయనివృత్తికోసమే అడిగింది.

"అమ్మా నీ వల్ల కాదు తల్లీ! అయినా నీకంత బెంగెందుకే— నేను బ్రతికుండగా నీ బిడ్డలకూ నీకూ యేమీ లోటు లేదు. చాలా..." మళ్ళీ దగ్గి..."పదేళ్ల క్రితం ఏలాగున్నావో యిప్పుడూ ఆలాగే వున్నావే నీలో ఏమీ మార్పు లేదు... పిచ్చితల్లీ" మళ్ళీ నవ్వూ దగ్గుతో ఆగది విడచింది వెంకమ్మ.

బహుశా శాంతమ్మకు ఈ మాటతో ఒక పెద్ద సమస్య పరిష్కరింపబడి, సంతృప్తిపడి ఉంటుందని వెంకమ్మ భావించి వెళ్ళిపోయి ఉంటుంది. కాని శాంతమ్మ మనస్సు నిజంగా వెంకమ్మ గ్రహించ లేదు. ఆమె తిండికోసం బ్రతకడం లేదు. తిండికోసమే బ్రతికేటట్లయితే తిట్లు కూడా ఒక ఆహారంగానే తీసుకుంటూ తన స్వంత యింటిదగ్గరే ఉండేది. కాని తన కాళ్ళమీద నిలబడి జీవించగలిగే స్త్రీపై హిందూ సంఘం ఎలాంటి అభాండాలు వేయడానికి సిద్ధపడుతుందో అనే సంగతికూడా విస్మరించ లేదు. అయితే పరిశుద్ధ హృదయంతో తాను కష్టపడ్డ డబ్బుతో తిని జీవించే సంతృప్తిముందు ఇవన్నీ నిలకడలేని నీడలు మాత్రమే అని ఆమె భావన. ఏలాగయినా బిడ్డల భవిష్యత్తుకోరి తానొక నిలకడైన జీవనభృతిని అన్వేషించాలి. ఈ నిర్ణయంతోనే మంచంమీద పడుకొని బిడ్డను హృదయాని కద్దుకొని కళ్ళుమూసింది శాంతమ్మ.

---

# 3

మళ్ళీ వెంకమ్మ హోటలు తెరిచింది. ఈవార్త చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది. అందుచేతనే కొద్దిరోజుల్లోనే ప్రొద్దుటపూ ఏడైనిమిషాల్కి లేచే పరిస్థితికి వచ్చింది హోటలు.

శాంతమ్మ పట్టుదలతో, ఆమె పెట్టుబడితోనే, వెంకమ్మ పేరుతో హోటలు నిర్వహింపబడుతోంది.

కొద్దిరోజుల్లోనే శాంతమ్మ అనేకరకాల మనుష్యులు రావడం చూసింది.

"పూట కెంత?"

"ముప్పావలా"

"అబ్బా!"

ప్రశ్నిస్తూనే వెర్రిగా శాంతమ్మ కేసి చూశాడు. ఆమె ఆ చూపులో ఏదో భావాన్ని గుర్తించి లోపలకు వెళ్ళిపోయింది.

మరొకరోజు విస్తరిదగ్గర కూర్చున్న పెద్దమనిషి గోడప్రక్కగా ఒదిగి నిలబడ్డ శాంతమ్మనుద్దేశించి ఇలా అన్నాడు.

"ఇంత ఘోషా అయితే హోటలెల్లా పెట్టావమ్మా-రా! కాస్త పెరుగొడ్డించు."

శాంతమ్మ వచ్చి పెరుగు పోసేటప్పుడు మెల్లగా మళ్ళీ యిలా గన్నాడు.

"వట్టి భోజనమేనా, పడుకోడానికికూడా చోటు ఉంటుందా ?"

ఆమె క్రోధంగా అతనికేసి చూసింది. పట్టనట్టు బిగ్గరగా నవ్వి— "నీకు తెలీదా ? పెద్దపెద్ద హోటళ్లలో భోజనం పెట్టి గదులుకూడా యిస్తారులే" అన్నాడు.

ఆమె మాట్లాడలేకపోయింది.

ఒక నెల గడిచింది. రోజురోజూ శాంతమ్మ మనస్సు ఈ వృత్తిపట్ల విముఖత పొందడం ప్రారంభించింది. అలా జరుగుతుందని వెంకమ్మకు తెలుసు.

వెంకమ్మపేరు జపిస్తూనే గుమ్మం పక్కన అత్తరు సాహెబ్, శాంతమ్మను చూసి "హెంత పెద్దకూతుర్ హుంది! హేంకమ్మగార్" అంటూ తిరిగి సమాధానం అందుకోకుండానే కాళ్ళుకడుక్కుని వెళ్లి గదిలో కూర్చున్నాడు.

శాంతమ్మవచ్చి విస్తరివేసింది. రాముడొచ్చి కాళీగ్లాసు పెట్టాడు.

"అరె మీాది బిడ్డా ఏమిటీ ?" అని సాయెబు అడిగాడు. ఔనన్నట్లు తల పంకించింది.

"అరె రాజా వెలుగు ... వహ్వా! మంచి జాతక పురుషుడు హావుతాడు" అని వచ్చినభాషలో అభినందించాడు.

ఆ క్షణంలో శాంతమ్మ హృదయం పుత్రానురాగంతో నిండిపోయింది. సాహెబ్ అన్న మాటల్లో పూర్తిగా

ఉత్ప్రేక్ష లేదు. రాము మొగం చూస్తేనే ప్రతివాళ్ళనూ ఆకర్షించగల మంచి లక్షణాలున్నాయి. రంగుకూడా బాగా ఎరుపు.

రవి తండ్రిపోలిక. చామనచాయ. ఓమూల కూర్చుని చూస్తున్నాడు.

అన్నం వడ్డించడం పూర్తికావడంతోనే నోటిలో ముద్దపెట్టుకుంటూ గోడప్రక్కగా ఉన్న రవిని చూసి, బొంగురుగా ఉన్న కంఠంతో "అరె బచ్చా! తుమ్ కౌన్"? అని అరిచాడు.

రవి కోపంగా చూసి వేలుపెట్టి జాగ్రత్త అన్నట్లు ఆడించాడు. సాహెబ్ అరచేతి నేలకేసికొట్టి "వారేవా! వేలుపెట్టి సూపుతావ్" అంటూ భోజనందగ్గర్నుంచి లేవబోయాడు. రవి భయపడి బేరు మన్నాడు.

శాంతమ్మ రవిని తీసుకొని లోపలకు వెళ్ళిపోయింది. కాస్సేపయిన తర్వాత "అరె వమ్మా". అంటూ బిగ్గరగా సాహెబ్ కంఠం వినిపించడంవల్ల తిరిగి వచ్చింది.

"చారూ లేదూ"

"ఉంది."

చారు వడ్డిస్తోంది. తెల్ల కళ్ళతో ఆ ముస్లిం శాంతమ్మ కేసి చూచి "అరె మొగం చూస్తే..... హెంత అందంగా వుంది" అన్నాడు.

శాంతమ్మ కంగారుతో చారుపాత్ర విడచింది.

"అరె హల్లా" అంటూ భయంగా లేచి చిందులు త్రొక్కడం ప్రారంభించాడు. శాంతమ్మ తప్పుకొని కంగారుగా వెంకమ్మ దగ్గర కొచ్చింది.

"ఏం జరిగింది?" వెంకమ్మ ఆత్రంగా అడిగింది.

"చారుగిన్నె జారిపోయింది" భయంగా సమాధానం చెప్పింది.

పెద్దగా అరుచుకుంటూ సాహెబ్ గదిలోకి వచ్చాడు. వెంకమ్మ మాటలద్వారా అతన్ని శాంతింపచేసి పంపించి వేసింది.

శాంతమ్మ పాత్ర విడవడం బుద్ధిపూర్వకంగా చేయని మాట వాస్తవమైనా - అతని నోటినుండి వెలువడ్డ మధుపాన పరిమళానికి, అతను ఏలాంటి పనైనా చేయగలడేమోననే అదురుమాత్రం చేతిని కంపింప చేసింది.

"ఎందుకు విడిచిపెట్టావ్?" వెంకమ్మ శాంతమ్మకేసి చూసింది. వెంకమ్మ మళ్ళీ ఆశ్చర్యంగా చూస్తూ "ఏడుస్తున్నావేం?" అని అడిగింది.

"నేనిక వడ్డన చేయలేనమ్మా. ఎవర్నన్నా మాట్లాడు" కళ్ళు తుడుచుకుంటూ అక్కడనించి తన గదిలోకి వెళ్ళిపోయింది శాంతమ్మ.

వెంకమ్మ మ్లాన హాసంచేసి "నేను మొదట్లోనే అనుకున్నాను" అని గొణుగుకుంది.

మరునాటినుంచి శాంతమ్మ కేవలం వంటల బాధ్యత మాత్రమే తీసుకుంది. వెంకమ్మ అంత నీరసంలోనూ, శ్రద్ధగా డబ్బులు వసూలుచేయడానికి గుమ్మంలో వేసిన ముక్కాలు పీటమీద కూర్చుంది.

వడ్డన చేయడానికి మరోమనిషిని కుదిర్చింది వెంకమ్మ. అయితే ఆ మనిషిపూర్వ చరిత్ర ఎరిగున్నవాళ్ళు ఎవరన్నా చూస్తే మళ్ళీ గుమ్మం ఎక్కరనే అదురు వెంకమ్మకు లేకుండా పోలేదు. వేరే గత్యంతరం లేక ఆకులు తీసే వెంకినే, శుభ్రమైన బట్టలుకట్టి ఆపనికి పురమాయించింది.

వంటచేస్తున్నంతసేపూ శాంతమ్మ మనస్సు దుఃఖ భారంతో కృంగిపోతూనే వుంది. రెండుమూడుసార్లు అప్రయత్నంగా కళ్ళవెంట నీళ్ళుకూడా కారాయి.

"అమ్మా! చిన్నాన్న" అని రాము గంతులు వేసుకుంటూ వచ్చి చెప్పాడు.

శాంతమ్మ కళ్ళు తుడుచుకొని, రాముని చంకను వేసుకొని చావిట్లోకి వచ్చింది.

"బాగున్నావా వొదినా"

అంతవరకూ నిలబడేవున్న చంద్రయ్య పలుకరించాడు. శాంతమ్మ రాముని క్రిందను దింపి, చావిడిలో ఉన్న చిన్న మంచం వాల్చింది.

"కూర్చో"

చంద్రయ్య మంచంమీద కూర్చున్నాడు. ఇంతవరకూ వెంకమ్మ భోజనానికి వచ్చిన మనిషిలాగునే అనుకుంది. కాని శాంతమ్మను వరసపెట్టి పిలవడంతోనే, మరిదిగా గుర్తించింది.

"ఏం బాబూ! మాయదారిమతి! మర్చిపోయాను నీ పేరు?" అని అడిగింది వెంకమ్మ.

"చంద్రయ్య అని పిలుస్తారు"

"రామయ్య తమ్ముడి వేగా"

"అవును"

అని సమాధాన మిచ్చి నిలబడి చూస్తున్న శాంతమ్మ కేసి చూశాడు.

"సుభద్ర బావుందా?"

"ఆఁ" ఏదో విరక్తిగా ధ్వనించిందా కంఠం.

"చంద్రయ్యా! ఒక మాటడుగుతాను నీకు కోపం రాదుకదా!" అని స్థాయిగా ప్రశ్నించిన వెంకమ్మను చూసిన శాంతమ్మకు భయంవేసింది. ఆమె మాటల ధోరణి ఎప్పుడు ఏరూపంలో వస్తుందో ఈ కొద్దిరోజుల అనుభవంతో శాంతమ్మ గుర్తించింది.

"మాటలు తర్వాత మాట్లాడవచ్చు—భోజనానికి లే బాబూ" దగ్గర చేరిన రవి తల నిమురుతూన్న చంద్రయ్య "భోజనానికేంలే వొదినా" అని వెంకమ్మ కేసి చూచి "అడగండి" అన్నాడు.

అప్పుడే చేసివచ్చిన తాలింపు వాసన మాడుతున్నట్లు గొట్టుకొట్టింది. శాంతమ్మ కంగారుగా లోపలకు వెళ్ళింది.

"వచ్చిన అన్నగారితో బాటే ఒదినగార్ని బిడ్డలనూ వొదిలేయడం మంచిదేనా?" అంది వెంకమ్మ.

"ఒక్కనాడు కూడా నాకా ఉద్దేశమే లేదు... ఆమెకు యిష్టం లేకనే వచ్చేసింది" అని ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

అప్పుడే భోజనానికి వచ్చిన యిద్దరు వెంకమ్మకు డబ్బులిచ్చి లోపల గదిలోకి వెళ్ళారు.

"నేను నమ్మను" వచ్చే దగ్గును ఆపుకుంది. మళ్ళీ ఆయాసంగా "రామయ్య బ్రతికుండగా, అతని చేతులమీదుగానేగా నీ పెళ్ళి చేసింది......ఆరోజుల్లో ఒక్క కానీ సంపాదన నీదుండేదా?...ఈ పక్షపాత బుద్ధే ఆయనకుంటే- ఈనాడు నువ్వీలా సుఖంగా జీవించగలవా..."

"అత్తా" అప్పుడే కంగారుగా లోపలనుంచి వచ్చిన శాంతమ్మ కాస్త కఠినంగానే పిలచింది. వెంకమ్మ ఆమెకేసి చూసింది. కళ్ళ మసకలో కూడా శాంతమ్మ కళ్ళలో అరుణరేఖలు చూడగలిగింది వెంకమ్మ.

"ఒదినా! ఆమె అన్నదానిలో అబద్ధమేమీ లేదు..." మెల్లగా మంచంమీద నుంచి లేచాడు. అతని మొగంపై కోపచ్ఛాయలు స్పష్టంగా చూడగలిగింది శాంతమ్మ.

"వెంకమ్మగారూ! అన్యాయంగా నేను నా వొదినను యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నానసే నింద, మీారు వేసినంత మాత్రాన నాకు బాధ లేదు. కాని విధవ యింట్లో ఉండలేక వీధిపడి హోటలు పెట్టింది అని నలుగురు అనుకుంటే, తప్పని సరిగా బాధపడుతున్నాను." అప్పటికే అతని మొగం కాస్త ఎఱ్ఱబడింది.

వెంకమ్మ ఇరుకున పడ్డట్లయింది. ఏమన్నా మరిదిని నాలుగు ఝాడిస్తే శాంతమ్మకు తృప్తిగా ఉంటుందనుకొని ప్రారంభించిన వాచాలత్వం - శాంతమ్మకే బాధాకరంగా ఉంటుందని అనుకోలేదు.

"నాకెందుకమ్మా" ఒణుకుతో ధ్వనించిన కంఠంతో అని, కష్టంగా కఱ్ఱ ఆధారంతో లేచి భోజనాలు చేసే గదిలోకి వెళ్ళిపోయింది.

చంద్రయ్య ఎవర్నించయినా సమాధానం అందు తుందా అని ఆశించాడు. కాని అలా జరగలేదు. అడుగు-జేబులోనించి మనీపర్సు తీసి "ఇల్లు అమ్మివేశాను. తనఖా బాకీ పోను ఆరువందలు మిగిలింది" అంటూ పర్సులో కాగితాలు తీస్తున్నాడు.

"ఎందుకమ్మాలి?" కొంచం బాధ్యతగా, చనువుగా అడిగింది.

"ఎందుకమ్మకూడదూ - తెలీక అమ్మివేశాను... ఇల్లు నాదనుకునే వాళ్ళు యింట్లోంచి వెళ్ళిపోయారు. ఇక

నాకు భిక్షా! హాహా! బంగారయ్యగారి వసారాకు మూడు రూపాయలు అద్దె ఇచ్చి ఉంటున్నాను."

వంద రూపాయలనోట్లు మూడు పైకితీసి,

"తీసుకోవదినా—"

"నాకక్కర్లేదు" ఆమె మాటల్లో బాధ ధ్వనించింది.

"నీకక్కర్లేకపోయినా - నా అన్న మొగంచూసి - ఇచ్చేబాధ్యత నాకుందని, ఇస్తున్నాను...తీ సు కో వ డ ం తప్పదు."

"దూరంగా ఉన్నా - ఇంకా బాధపెట్టాలనా" ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

ఈ మాటకు చంద్రయ్య ఆశ్చర్యపడ్డాడు.

"దగ్గిరుండగా నిన్ను బాధపెట్టేనా ?"

"బాధగాకపోతే ఇదేమిటీ? కొంప ఎందుకమ్మాలి ? ఎవరమ్మమన్నారు?" ఇక ఆమె మాట్లాడలేక పోయింది.

శాంతమ్మకు కేవలం కొంపమీాద ఉండే మమకారం గాకపోయినా - మ ర ది అద్దె కొంపలో ఉండటం ఆమెకు ఇష్టంలేదు. అయితే ఆమె సద్భావం, భాషా రూపంలో మాత్రం వ్యక్తం కాలేదు. చంద్రయ్య మళ్లీ మంచం మీాద కూర్చున్నాడు. గట్టిగా నిట్టూర్చాడు.

"ఒ ది నా! నువ్వు మళ్ళీ వస్తావనే నమ్మకముంటే యీా పని చేయలేకపోయేవాణ్ని - కాని నీ సలహా లేకుండా

యీాశ్చర్యం చేయడం తప్పేనని యిప్పుడనుకుంటున్నాను..." అని మెల్లగా లేచి, కళ్లు తుడుచుకుంటున్న శాంతమ్మ దగ్గరగా వచ్చి, "ఇంటిమీాద వేయి రూపాయలు అప్పున్నదన్న సంగతి నీకు తెలుసుగా ఒదినా ?"

"తెలుసు."

"నా జన్మలో ఆ అప్పు తీర్చగలననే నమ్మకం లేకనే యీాపని చేశాను...నీకు ఇది ఇంత దుఃఖకారణ మౌతుం దంటే; ఈ పని చేసేవాణ్ణి కాను" కాస్సేపాగి ప్రాధేయతగా "డబ్బు తీసుకో వొదినా" అడిగాడు.

"ప్రస్తుతం నే నేమీా కూటికి మాట్లల్లేను. డబ్బు నీదగ్గరే ఉంచు."

"నేను కూటికి మాడినా – పరుల డబ్బు నాదగ్గర ఉంచనని నీకు తెలుసుగా."

'పరులు' అనే పదం అనాలోచితంగా వదలిపెట్టేనని చంద్రయ్య అనుకోకపోయినా – ఆ పదంమటుకు శాంతమ్మ హృదయానికి శరాఘాతంలా తాకింది.

"అవును...పరాయిదాన్నే!" దుఃఖాన్ని బాధగా కంఠంలో దాస్తూ "ఏది?" అని చేయి చాచింది.

చంద్రయ్య డబ్బు యిస్తూ – "ఈ వాదు చాలు వొదినా? ఇంకా కొంపకూడా అమ్ముకొని ఒదినగారి కివ్వకుండా కాజేశాడనే నింద పొందలేకనే ఇంతదూరం వచ్చి యిస్తున్నా" డబ్బు యిచ్చాడు.

ఈ కొద్దిరోజుల్లో రాముకి ఆ వీధి చాలా చిరపరిచిత మైంది. తప్పటడుగులు వేసుకుంటూ వీధి అంతా పచారు చేయడం, ఆకలైనప్పుడు తిరిగి యింటికి రావడం జరుగుతూంది.

ఆ వీధిలో బళ్ళు ఎక్కువగా తిరక్కపోవడంవల్ల రాము కార్యక్రమానికి ఏమీ అడ్డు లేకుండా జరిగిపోతూంది. ఆ వీధిలోనే వెంకమ్మ యింటెదురుగా ఉన్న బహదూర్ వారి మేడంటే రాముకి చాలా అభిమానం. అందుకే తరచు తప్పటడుగులు వేసుకుంటూ గేటుదాటి కాంపౌండులోకి వెళ్ళి ఆ పూలమొక్కల్లో తచ్చాడుతూ వుంటాడు.

ఒకరోజు అక్కడి పనివాడు రాముని బెదరించబోతే మేడపైనించి ఆ కుర్రవాణ్ణి చూస్తున్న బహదూర్, ఆ పనివాణ్ని మందలించి "ఆ కుర్రాడు ఎప్పుడొచ్చినా ఆటంక పర్చబోకు" అని ఆర్డరుకూడా చేశాడు. అది గమనించిన రాముకి పరిపూర్తి విశేషం గ్రాహ్యం కాకపోయినా, పని వాడు తన్ను బెదిరించి తిట్లు తిన్నాడని మాత్రం తెలుసు కున్నాడు.

ఇక ఆరోజు మొదలు మరీ చనువుగా కాంపౌండులోనికి వెళ్ళి ఆరుబైట వేసిన కుర్చీలో దర్జాగా కూడా కూర్చొంటూ వుండేవాడు. పనివాడు ఒకవేళ కోపంగా చూసినా కుర్చీలోంచి ఎదరకు ఒక్కసారి వంగి వేలుపెట్టి పై అంతస్తు కేసి చూపే వాడు. పనివాడికి కోప మల్లాపోయి నవ్వు కూడా వచ్చేది.

బహుదూర్ తన చావిట్లో కూర్చొని జ్యోతిష పండితునితో ముచ్చటిస్తున్న సమయంలో రాము గేటు తీయడం గమనించాడు. వెంటనే పండితుని కేసి చూసి "ఆ కుర్రవాణ్ని చూశారా?" పండితుడు అటు చూశాడు.

"బాబూ యిలారా" అని పిలచాడు బహుదూర్. ఈలాంటి అవకాశంకోసం ఆ చిన్ని మనస్సు ఏనాటినుంచి చూస్తూందో సంకోచం ఏమాత్రం లేకుండా దర్జాగా రాము దగ్గర చేరాడు.

"యీ కుర్రాడి చేయి చూడండి."

బహుదూరే ఆ చిన్ని చేతిని తిప్పి చూపించాడు. పండితుడు తీక్షణంగా చూచి "అదృష్టజాతకుడు...లక్షాధికారి బిడ్డ కావాలి" అని చెప్పాడు. వెంటనే బహుదూర్ నవ్వాడు.

పండితుడు ఆశ్చర్యంగా చూసి "ఏం?" అని ప్రశ్నించాడు.

"జాతకుడు కావచ్చుగానీ లక్షాధికారి బిడ్డమాత్రం కాదు" అన్నాడు.

"జాతకమే లక్షాధికార్ని చేస్తుందనే ఉద్దేశంకూడా నాకుంది" అని సమయస్ఫూర్తిగా సమర్థించాడు పండితుడు.

గేటులో ఒక కారువచ్చి ఆగింది. పనివాడు గేటు తెరచాడు. కారు లోపలకు వచ్చింది.

బహుదూర్ పైకిలేచి ఆనందాన్ని వ్యక్తం చేస్తూ "దయచేయండి" అని ఆహ్వానించాడు.

గంగాధర్ జమిందారు కారులోనించి దిగి చిరునవ్వుగా ఆహ్వానాన్నందుకొని, బహుదూర్ ప్రక్కగా ఉన్న కుర్చీ మీద కూర్చున్నాడు.

"మరచారా!" పండితుడు పలుకరించాడు. గంగాధరం తీక్షణంగా చూచి, హఠాత్తుగా లేచి చేతులు జోడించి "క్షమాభిక్ష" అని నమ్రతగా తల ప్రక్కకు పెట్టాడు.

"ఫరవాలేదు, ఆమాత్రం జ్ఞాపకముంటేచాలు" అని సగర్వంగా "నేను లోగడ మీకు చెప్పిన విషయాలు ఎంతవరకూ..."

ఇంకా మాట పూర్తిగాకుండానే "అక్షరాలా జరిగాయి" అని సమాధానమిచ్చి, బహుదూరుకేసి చూస్తూ "పండితులువారి ప్రతిభ మీరు విన్నారా?" అని ప్రశ్నించాడు గంగాధరం.

బహుదూర్ నవ్వాడు "నేను ఒక్కడినేమిటి! ఈ గుంటూరుజిల్లా అంతా ఎరుగుదురు" అని సమాధానమిచ్చాడు.

కారు హారన్ వినిపించి అంతా అటు చూశారు. రాము ఎప్పుడు మెల్లగా బహుదూరు దగ్గర్నుంచి జారు

కున్నాడో, గాని యిప్పుడు కారు మొదటసీటులో కూర్చొని, స్టీరింగుపట్టుకొని అటుయిటూ త్రిప్పుతూ మధ్య మధ్య హారన్ కొడుతున్నాడు.

"నేను చెప్పింది ఆ చ ర ణ లో చూస్తున్నారుగా, అది కారులు ఎక్కితిరిగే జాతకం" అంటూ సంతృప్తిగా నవ్వాడు పండితుడు.

"ఎవరా కుర్రాడు?" గంగాధరం ఆత్రంగా అడిగాడు.

"సాటి కులస్తుడే కాని పేదవాడు" అని సమాధాన మిచ్చాడు బహుదూర్.

గంగాధరం మెల్లగాలేచి కారు దగ్గరకు వెళ్ళి కుర్ర వాణ్ని పరిశీలించాడు. రాము దేన్నీ లక్ష్యపెట్టే దృష్టిలో లేడు. అసలు పెద్దవాళ్ళ చేతిలో చెప్పినట్లు వినే కారు, తాను ఎందుకు నడిపించలేకపోతున్నానా? అనే పట్టుదలలో మునిగి ఉన్నాడు.

"ఇదిగో!"

గంగాధరం మాటవిని ప్రక్కకు చూశాడు. మొదట్లో కాస్త జంకాడు. కాని గంగాధరం చిరునవ్వు రాము నిర్ల క్ష్యానికి దోహద మిచ్చింది. మళ్ళీ తన పనిలో నిమగ్ను డయ్యాడు.

"నీ పేరు?"

"లాము."

తిరిగి చూడకుండానే స్టీరింగుతిప్పే ప్రయత్నంలో ఉండి సమాధాన మిచ్చాడు.

ఈ వినోదం చూస్తూ గంగాధరం వెనుక బహుదూర్, పండితుడు కూడా నిలబడ్డారు.

"కుర్రవాడికి తెలీదండీ."

ఈ స్త్రీ కంఠధ్వని ఎక్కడనుంచి వచ్చిందో అందరూ అటు చూశారు. స్తంభం వెనుక శాంతమ్మ నిలబడి "రామూ దిగిరా!" కంపితస్వరంతో పిలచింది.

"నేను లాను."

తల్లి పిలుపు అని తెలుసుకొని కూడా, రాము ఈ విధంగా సమాధానం యివ్వడంలో, అక్కడున్న ముగ్గురూ బిగ్గరగా నవ్వారు.

ఈ నవ్వుల్లో భావం శాంతమ్మ గుర్తించలేదు. పైగా ఇదొక హేళనగా ఆమె బాధ పడింది. కోపంగా కారుదగ్గరకు వచ్చింది.

"కారు దిగు."

ఈమాటు రాము చూసి, తనివితీరా నవ్వాడు. శాంతమ్మ రెండు చేతులూ కారులోనికి పోనిచ్చి రాముని ఎత్తుకోబోయింది.

"నేను లానూ—" అంటూ ఏడవటం ప్రారంభించాడు. స్టీరింగు మాత్రం వదల్లేదు.

"ఫరవాలేదమ్మా! సరదా తీరనియ్యి, వైనకాల పంపిస్తాం."

ఈ మాటలు గంగాధరమే అన్నాడు. అతనికేసి శాంతమ్మ చూసింది. అతని మొగంలో అవహేళన లేదనీ పిల్లవానిపట్ల ఉండే దయ మాత్రం అందర్నీ అలా నవ్వించిందని వెంటనే గ్రహించింది. అక్కడనించి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

శాంతమ్మ యింటికి చేరుకున్న మరి రెండు గంటల్లో చేతిలో నేతి లడ్డూల పొట్లంతో రాము కూడా వచ్చాడు. ఏదో యుద్ధంలో గొప్ప విజయంపొందిన వీరుడులా మొగం పెట్టి "అమ్మా" అని పిలచాడు.

దొడ్డివైపున సాయంత్ర సమయపు పని పాటల్లో ఉన్న శాంతమ్మ పిలుపు విని లోపలకు వచ్చింది.

"ఏం నాన్నా."

"మలి...నాకు" చిరుచేతులో పొట్లం చూపించాడు.

ఆ సమయంలో రాము మొగం చూసిన శాంతమ్మ ఒకసారి ఎత్తుకొనీ తనివితీరా ముద్దు పెట్టుకొనేవరకూ ఊరుకో లేకపోయింది.

అప్పుడే లేస్తూ పడబోతూ గుమ్మం దగ్గరగా అవస్థ పడుతున్న రవి, రాము చేతిలో పొట్లం చూచి ఏడ్చాడు. ఎందు కేడుస్తున్నాడో గ్రహించిన శాంతమ్మ నిలబడ్డ రాము దగ్గర కూర్చొని "ఆ పొట్లం ఏది బాబూ" అని అడిగింది.

"నేనివ్వను" మొగం బుంగగా పెట్టి మరీ సమాధాన మిచ్చాడు.

ఈ తిరస్కారభావంతో ఆశగా దూరంగా ఏడుస్తూ కూర్చున్న రవి మరీ గుక్కపెట్టి ఏడుస్తూన్నాడు.

శాంతమ్మ రాము చేతిలో పొట్లం ఉండగానే, విప్పి ఒక ఉండ తీయడానికి ప్రయత్నించింది.

రాము యీ దౌర్జన్యాన్ని, సహించలేక చేతిలో పొట్లం విసిరికొట్టి, క్రిందపడి గోల చేయడం ప్రారంభించాడు.

ఆపిల్లలగోలతో యిల్లంతా 'రింగ్' మంటూ మ్రోగింది. గదిలో కూర్చున్న వెంకమ్మ చేతికర్ర ఆధారంతో, చావిట్లోకి వచ్చింది.

విరక్తిగా వుదాసీనభావంతో చూస్తున్న శాంతమ్మను చూచి "ఏవిటమ్మా శాంతా" అని అడిగింది.

"వీడి మొహం" అని విసుగ్గా గిరాటు వేసిన పొట్లాన్ని తీసుకవచ్చి రాము చేతిలో కుక్కి "ఏడు...పొరుగు పచ్చ ఓర్వలేడు...వట్టి తిండిపోతు" అని గడప దగ్గర కూర్చున్న రవిని ఎత్తుకుని "నేను నీకు అప్పచ్చులుకొనిపెడతాలే బాబూ" అని సముదాయించింది.

తన పంతం నెగ్గడంతో రాము కిక్కురు మనలేదు. కాని రవి మాత్రం ఏడుపు మొగంతో మధ్య మధ్య వేలు పెట్టి మిఠాయి పొట్లం చూపడం మాననూలేదు.

వెంకమ్మ శాంతమ్మనుండి సమాధానం అందుకోక పోయినా దృశ్యరూపంలో అంతా చూడ్డంవల్ల "లోకంలో యిలాంటి అదృష్టం పొందడం మాత్రం మాటలా?... రామ లక్ష్మణులు" అంటూ లోలోన సంతోషపూర్వకంగా గొణుక్కుంటూ తన గదిలోనికి వెళ్ళిపోయింది. కాని రాముడు తమ్ముడికి తిండిపెట్ట నన్నంత స్వార్థపరుడు కాడని మాత్రం వెంకమ్మ ఆలోచించలేదు.

అప్పుడే భోజనాలు చేసి కూర్చున్న శాంతమ్మ వెంకమ్మలకు, బహదూర్ వారి దగ్గర్నుంచి తమ్ము రమ్మ న్నట్లుగా వచ్చిన కబురు అత్యాశ్చర్యాన్ని కలగజేసింది.

"ఎందుకు బాబూ?" వణుకుతోన్న కంఠంతో వచ్చిన నౌఖర్ని అడిగింది వెంకమ్మ.

"మీ అదృష్టం పండిందండీ – తొందరగా రండి" అసలు సంగతి వివరించకుండా ఆనందంగా సమాధానం చెప్పాడు.

ఇదేమో చాలా అగమ్యంగా వుంది. కాస్సేపు కళ్ళు వప్ప చెప్పి చూసింది వెంకమ్మ.

"నేను కూడా ఎందుకూ?" బిక్కు బిక్కూ మంటూ అడిగింది శాంతమ్మ.

"మీరిద్దరూ కూడా రావాలి...అంతా మీ కోసం కూర్చున్నారు. ఆలశ్యం చేయొద్దు" అంటూ హడావిడిగా హెచ్చరించాడు.

"అసలు సంగతి ఏమిటో చెబుదూ -" కాస్త విసుగ్గా ధ్వనించిందా వెంకమ్మ స్వరం.

"నాతో మిమ్మల్ని తీసుకరమ్మని మాత్రమే చెప్పారు. అదే చెప్పాను. మిగతా విషయాలుంటే మీకు వారే చెబుతారు" అని నిక్కచ్చిగా సమాధాన మిచ్చాడు నౌకరు.

బహుదూర్ మాటంటే, విలువగా తీసుకోని వాళ్ళు ఆ తెనాలిలో లేరు. ఆ విలువ పొందడానికి తగిన ఆస్థిపాస్తులు-గౌరవపు హోదాలు వెంకమ్మ దృష్టిలో ఒకసారి మెరిశాయి.

"శాంతా లేమ్మా."

"నే నెందుకూ?"

"పెద్దవారు కబురు పెట్టారు. వెళ్ళకపోతే బావుంటుందా - పైగా ఏదో మంచి గురించేగా, సంకోచం ఎందుకూ..." అంటూ కర్ర ఆధారంగా వెంకమ్మే ముందు లేచింది.

పది మైళ్ళు నడచినంత ప్రయాస పడుతూ రొప్పుతూ రొజుకుంటూ బహుదూరు కచేరి చావిడిలోకి, శాంతమ్మతో వచ్చిన వెంకమ్మనుచూచి,

"రండి వెంకమ్మగారూ...ఇద్దరూ అలా కుర్చీమీద కూర్చోండి" అన్నాడు బహుదూరు.

ఈ అనాయాసమైన మర్యాదకు వెంకమ్మ మనస్సు సంతోషంతో నిండిపోయింది.

"ఆడముండలం. మాకా మర్యాద ఎందుకు బాబూ" అంటూ వెంకమ్మ కర్ర విడచి గుమ్మం పక్కగా చతికిల పడబోయే ప్రయత్నంలో ఉండగానే హఠాత్తుగా బహుదూర్ లేచి "అరెరె! అదేమిటమ్మా! అదుగో ఆ ప్రక్క బెంచీ మీదైనా కూర్చోండి" అన్నాడు.

"మర్యాదగల కుటుంబం" అని మెల్లగా కర్ర తీసుకుని లేచేటప్పటికి కాస్త దగ్గు ఆరంభించింది.

అసలే శాంతమ్మకు సిగ్గుతో అక్కడ ఉండటం చచ్చినంతపని అవుతోంది. అందులో వెంకమ్మ దగ్గుకి మరీ సిగ్గుపడి కచ్చేరి ప్రక్కగా ఉన్న తలుపు వెనక్కి వెళ్లి నిలబడింది.

వెంకమ్మ దగ్గు తగ్గింది. ఆ స్థూల శరీరాన్ని మెల్లగా బల్లమీదకు చేర్చింది.

"వారు లోపలకు వెళ్ళేరేం?" గంగాధరం శాంతమ్మ వెళ్ళినవేపు చూస్తూ అడిగాడు.

"దాన్ని అక్కడే వుండనివ్వండి బాబూ! అయినింటి పిల్ల. అందులో మగాళ్ల ఎదుట నిలబడ్డం అసలే అలవాటు లేదు" అని సమాధానమిచ్చింది వెంకమ్మ.

"ఆమె మీకు మేనగోడలా?"

ఈ ప్రశ్న ఎవరు వేశారో గమనించే స్థితిలో వెంకమ్మ లేదు. రాబోయే దగ్గును బలవంతంగా ఆపుచేసే ప్రయత్నంలో

వంచిన తలతో ఔనన్నట్లు సంజ్ఞ చేసింది. తలుపు వెనక ఉన్న శాంతమ్మ, "ఏమిటీ సమాధానం యివ్వదు? యివ్వక పోవడమే మంచిదేమో" అనుకుంది.

"భర్త పేరు?"

ఈసారి తలెత్తింది వెంకమ్మ. ఈ ప్రశ్న అపరిచయ వ్యక్తి వేసింది.

"వైద్యుడు రామయ్యచౌదరి" మెల్లగా చెప్పింది.

"ఆఁ" అంటూ ఒక్కసారి ఆశ్చర్యాన్ని వెళ్ళడిచేసి "అయితే...మా..." యింకా మాట పూర్తి చేయని క్రితమే వెంకమ్మ పురస్కరించుకొని "మీ యింటి పేరు బాబూ" అని అడిగింది.

"సిరిమళ్ల గంగాధర జమీందారువారు ... పేరు వినలేదా?" ప్రక్కనున్న పండితుడు గంభీర కంఠధ్వనితో సమాధాన మిచ్చారు.

హఠాత్తుగా పరిసర ప్రదేశంలో పిడుగు పడే ధ్వనికి పొందే భయాన్ని ఆ ముగ్గురూ ఆమె మొగంలో చూడ గలిగారు.

"అయ్యో! అయ్యో! మాయదారిముండను సిగ్గు లేకుండా ఎదురుగా కూర్చున్నానే!" అంటూ కంగారుగా కఱ్ఱ తడుముకొని లేవ పోయేటప్పటికి గంగాధరమే లేచి "తల్లితో సమానం మీరు; బిడ్డలదగ్గర సిగ్గెందుకమ్మా

కూర్చోండి పరవాలేదు" అని వినయంగా సమాధానం చెప్పాడు.

వెంకమ్మ హడావిడినంతా చూడకపోయినా ఆ ధ్వని విన్న శాంతమ్మ గంగాధరమంటే ఎవరో గొప్ప వ్యక్తి కాబోలు ననుకుంది.

"మీరు మాకు దగ్గర బంధువులే బాబూ! కాని మీరు..." వెంకమ్మ కళ్ళు తుడుచుకుంది. ఆ ఏడుపునకు కారణం గంగాధరం జమీందారయ్యాడనే దురుద్దేశం లేక పోయినా, మా బ్రతుకు లిలాకాలేయి అనే భావం మాత్రం ఉంది.

"ధనం శాశ్వతం కాదమ్మా - కావలసింది పరువు ప్రతిష్టాను...ఈవేళ లక్షాధికారి రేపు బిక్షాధికారి కావచ్చు" ఈ మాటలన్నీ జమిందారు గంగాధరం నోటినించే వెలువడ్డాయి. ఆ రెండు మాటలతో ఆయన నిగర్వి, నిరాడంబర జీవి, స్వార్థరహితుడు అని అంచనా వేయలేదు వెంకమ్మ. కాని ఏదో తనతో అవసరమైన పని వుందని గట్టిగా నమ్మింది.

"మీరు కబురుచేసిన కారణమేమిటో..."

"మీవల్లనయ్యేదే"

"చెప్పండి! చెయ్యగలపనే అయితే, వెంకమ్మ ఏనాడూ వెనక్కి తిరగదని మీకు తెలుసుగా" తన మీద తనే ఒక సుభాషితాన్ని విసురుకుంది వెంకమ్మ.

"వెంకమ్మా."

ఈ ధ్వనిలో ఒక ప్రత్యేకత ఉంది. అటు చూసింది. పండితుడు చెప్పడ మారంభించాడు.

"గంగాధరంగారి విషయం నేను చెప్పనక్కర లేకుండానే మీకు తెలిసినా - మీకు తెలీని విషయాలు కొన్ని నాకు తెలుసు" అంటూ ఆ పేము కుర్చీ వెంకమ్మ వైపునకు కాస్తలాగి "రెండు గ్రామాల కధికారి, లక్ష్మీపుత్రులు, గుంటూరుజిల్లాలో పేరుమోసిన పెద్దమనిషి... కాని వీరి ఆస్తి పాస్తులకు అధికారి కాగల యోగ్యత-ఎవరికుంటుందంటారు?" మెడ ఎదుటకు వంచి వెంకమ్మను ప్రశ్నించాడు.

"ఇంకెవరికీ, పుట్టిన బిడ్డలకే"

లోకానుభవం ఉన్న వెంకమ్మకు ఈ సమాధానం మంచినీళ్ల ప్రాయమైంది. పండితుడు బిగ్గరగా నవ్వాడు. వెంకమ్మ ఆశ్చర్యంగా చూసింది.

"అదే - అదే - కొరత, ఆ యోగ్యత అదృష్ట జాతకుడైన మీరామునకు వస్తుందంటే; మీరేమంటారు?" మళ్ళీ ప్రశ్నార్థకంగా చూశాడు.

వెంకమ్మ ముడతలుపడిన ముఖకవళికలన్నీ భయాశ్చ ర్యాలతో నిండిపోయినవి. సమాధానం యివ్వలేని ఆనందం ఆమె హృదయాన్ని తాకింది.

కాని తలుపు వెనక ఉన్న శాంతమ్మ మాతృ హృదయం ఆ పరిస్థితిలో బిడ్డను పరుల చేతిలో పెట్టడానికి ఎందుకో వెనకాడు తోంది.

"అంతకన్నానా బాబూ! రాము జమీందారు అవుతున్నాడంటే; తల్లికీ నాకూ కూడా ఆనందమే" అనే వెంకమ్మ మాట వినిపించింది.

కన్నతల్లి తనుండగా – ఈ భరోసా వెంకమ్మ యివ్వడం శాంతమ్మకు కష్ట మనిపించింది. కష్టాన్ని యిష్టంగా భరించే అలవాటుపడ్డ శాంతమ్మ యీ సమయంలో కూడా ఏమనాలో అర్థంగాని పరిస్థితిలో పడింది.

"అమ్మాయీ! నీ ఉద్దేశం?"

ఇది శాంతమ్మను వేసిన పండితుని ప్రశ్న. క్షోభ పడుతోన్న ఆ వ్యథిత హృదయంనుండి, ఒక్కమాట కూడా సమాధానం రాలేదు.

"దాని మొగం దానికేం తెలుసు...దాని అడ్డేమీ ఉండదు."

ఈ మాట కూడా వెంకమ్మే అంది. శాంతమ్మ మొగంలో కోపం ప్రజ్వరిల్లుతోంది. ఒక్కసారి తలుపు ఎదుటకువచ్చి "నా కిష్టంలేదండీ" అని చెప్పి కంగారుగా యింటికి దారితీసింది.

ఈ సమాధానంతో అంతా స్థంభించిపోయి, ఆమె వెళ్లేదారి చూస్తూ అలాగే ఉండిపోయారు.

# 5

ఏలాగై తేనేం; శాంతమ్మ అభిమాలు నెర వేర లేదు. వెంకమ్మపై బహుదూర్ వారింట్లో ఏలాంటి మంత్రాన్ని విసిరారోగాని, కేవలం రాము అభివృద్ధి కోసం రాముని గంగాధరం చేతులో పెట్టాలనే భావంతో శాంతమ్మ చెవిని యిల్లుకట్టిపోరింది, ఏవో ఊహలు కల్పించింది. నువ్వు జ మీం దా రు తల్లి వౌతావంది.

శాంతమ్మకు బిడ్డపై ఎంత మమకారం ఉన్నా, మాటకారైన వెంకమ్మ మాటలు శాంతమ్మ మనస్సు కొంత వరకూ మార్చకుండా విడిచిపెట్టలేదు. మమకారం ఎంత అడ్డుపడినా, మనస్సు ఎంత క్షోభపడుతున్నా శాంతమ్మ "సరే" అని మాట యిచ్చింది.

శాస్త్రోక్తంగా రాముని జమీందారు దత్తత చేసుకున్నాడు. త్రయోదశి సోమవారం సూర్యోదయాన పది గంటలకల్లా గంగాధరంగారి కారు వెంకమ్మ యింటిముందు ఆగింది.

రాముకి తెల్లటి బట్టలు కట్టి, శాంతమ్మ వెలుపలకు తీసుకవచ్చింది.

రాము కారు చూడ్డంతోనే ఉత్సాహంగా చేతులు చరిచాడు. కిల కిలా నవ్వాడు. రాము ఆనందాన్ని చూసిన శాంతమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

గంగాధరం కారులోంచి దిగి చేతులు చాచాడు. రాము ఒక గెంతులో గంగాధరం చేతుల్లో వాలాడు.

కర్ర ఆధారంతో గుమ్మం ప్రక్కగా నిలబడ్డ వెంకమ్మ బొంగురుగా నవ్వింది. ఓ ప్రక్క కళ్లల్లో నీళ్లు మెదులు తున్నా శాంతమ్మ కూడా నవ్వింది. బిడ్డపట్ల తీరని ప్రేమ భావం మళ్ళీ చేతులు చాచేటట్లు చేసింది.

"నేను లాను" అని కారులో కూర్చున్నాడు రాము.

గడప పట్టుక కారు కేసి చూస్తున్న రవి "అన్న" అని నవ్వుతూ పిలచాడు. రాము రవి కేసి చూచి, "లా" అని తల పంకించాడు.

గంగాధరం జమీందారు శాంతమ్మ కేసి ఏదో చెప్పాలనే ప్రయత్నంలో అరనిముషంనించి చూస్తున్నాడు. కాని శాంతమ్మ అశ్రునయనాలతో బిడ్డను కరువుతీరా చూస్తూంది.

"అమ్మా"

శాంతమ్మ గంగాధరం కేసి చూసింది.

"చిన్నమాట సంతోషార్థం...ఒక వేయి రూపా యలు...ఇంకా ఏదో చెప్పడానికి సంశయిస్తున్నాడు.

"బిడ్డను అమ్ముకునేదాన్ని కాను, ఆ వుద్దేశమే మీకుంటే నాబిడ్డను తీసుక వెళ్ళవద్దు" ఈ మాట కోపంగా అంది. అసలు ఆమె మనస్సు ఇప్పుడు స్థిమితంగా లేదు. ఈ పరిస్థితిలో ఏ తల్లిగుండె స్థిమితంగా ఉండదు.

"సరే మీకు కష్టం గలిగేపని నే నెందుకు చేయాలి" అని కారులో ఎక్కి కూర్చున్నాడు గంగాధరం. వెంకమ్మ కేసి చూస్తూ "వెంకమ్మగారూ మీమేలు మరువలేను" అని కారు స్టార్ట్ చేసే ప్రయత్నంలో ఉన్నాడు.

"అంతా భగవంతుని కృప" అని మాత్రం ఆకాశం కేసి చేతులెత్తి చూచింది వెంకమ్మ.

బహదూర్ వారి కుటుంబమంతా, మిద్దెమీద నిలబడి యీ దృశ్యాన్ని వినోదంగా చూస్తున్నారు. ఇరుగుపొరుగు అమ్మలక్కలంతా గుమ్మాల్లో నిలబడి రాము అదృష్టాన్ని పొగుడుకుంటున్నారు.

కారు కదలింది.

"రామూ" అని పిలచింది శాంతమ్మ.

కారు కదిలే విధానం గురించి ఆలోచించే రాము పరధ్యాన్నంగా చూడ్డమేగాని సమాధానం యివ్వలేదు.

ఆ వీధిలో కారు తొందరగా వెళ్ళే వత్తిడివల్ల లేచిన దుమ్ము చూస్తున్నవాళ్ళ కళ్లు కప్పేసింది. శాంతమ్మ ఆ ధూళినే అలా నిలబడి ఎంతసేపు చూసిందో ఆమెకే తెలీదు.

వెంకమ్మ పిలుపువిని కళ్ళు తుడుచుకుంటూ లోపలకు వెళ్ళి పోయింది.

గంగాధరం వెళ్ళేముందు "మీ మేలు మరువలేను వెంకమ్మగారూ" అనడంలో ఒక విశేషం లేకుండా పోలేదు. ఆరు సంవత్సరాలుగా గంగాధరం ఒక సలక్షణమైన బిడ్డను పెంచుకోవాలనే ప్రయత్నం యీనాటికి ఫలించింది. సంతాన విహీనుడైన గంగాధరం ఉద్దేశాన్ని గ్రహించిన బంధు కోటిలో కొందరు ఉదారంగా తమ బిడ్డల నివ్వడానికి ఆహ్వానాలు పంపించారు కూడా. వాళ్ళు ఏలాంటి స్వార్థంతో, ఈలాంటి స్వార్థ త్యాగాన్ని చేయడానికి సంసిద్ధత పడ్డారో గంగాధరంకి తెలిసినా – ఆ అంచనాని పునర్విమర్శన చేయ దలచలేదు. ప్రతివాళ్ళ యింటికి వెళ్ళి ఆయా బిడ్డలను చూశాడు. కాని ఒక్కళ్ళూ అతనికి నచ్చలేదు.

అతని కుండిన జ్యోతిష సాముద్రశాస్త్ర పరిచయమే ఈ తిరస్కృతికి కారణమైంది. రాములో కనిపించిన లక్షణాలు గంగాధరాన్ని పూర్తిగా ఆకర్షించాయి అనడంలో సందేహం లేదు. ఏ తల్లీ తాను చేయిచాస్తే బిడ్డ నివ్వననే సమాధానం యిస్తుందని గంగాధరం కలలో కూడా అనుకోలేదు. తన ఉన్నతస్థితి గురించి ప్రక్కవారు చెబుతున్నా – ఆమెకు మరోబిడ్డ ఉండికూడా – తనకు బిడ్డ నివ్వడానికి ఇష్టంలేదని శాంతమ్మ చెప్పడంలో గంగాధరం మానసికంగా చాలా బాధే పడ్డాడు. కార్యదీక్షాపరులకు కోపం నిషేధవస్తువుగా

ఏనాడో గుర్తించిన గంగాధరం ఇక్కడ తప్పటడుగులు వేయలేదు. కాని తల్లికి చూపవలసిన కృతజ్ఞత వెంకమ్మకు అందజేశాడంటే, ఈ కార్య నిర్వహణ విజయానికి కారకు లెవరో అతనికి బాగా తెలుసు. శాంతమ్మ తనపట్ల ప్రవర్తించిన విధానం మాత్రం గంగాధరానికి ఆమెమీద వ్యతిరేక భావం కలగడానికి కారణమైంది.

సుమారు యిరవైమైళ్ళ దూరంలో ఉన్న గుంటూరు చేరుకోడానికి కారు ఆట్టే ఆలశ్యం చేయలేదు - జమీందారు భవంతి ముందు కారు ఆగేసరికి నౌకర్లూ - చాకర్లూ ఆశగా చూస్తూ కారుకి కాస్త దూరంలో నిలబడ్డారు. ఆ రోజు యిల్లంతా కళకళ్ళాడుతూ అలంకరింపబడింది.

గంగాధరం భార్య పార్వతమ్మ నవ్వు ముఖంతో కారు దగ్గరగా వచ్చింది.

"మీ అమ్మ" గంగాధరం భార్యను వేలుతో చూపుతూ అన్నాడు.

"అమ్మ" ఏదో ఆలోచిస్తూ ప్రశ్నార్థకంగానే అన్నాడు.

ఆ ఒక్కమాటే పార్వతమ్మ హృదయానికి అమృత ప్రాయంలా పనిచేసింది. అలాంటి పదాన్ని పసిపిల్లల నోటి నుండి వినాలని కుతూహలపడే సంతాన విహీన హృదయం చిరునవ్వుంతు లేసింది. ఆనంద బాష్పాలతో కళ్లు నిండిపోయాయి.

ఒక్కసారి రాముని ఎత్తుకొని హృదయానికి హత్తుకుంది. అర్ధనిమీలిత నేత్రాల్తో శాన్నేపు లోకాన్నే మరచింది. ఆ తల్లినీ, బిడ్డనూ చూసిన గంగాధరం బరువుగా నిట్టూర్చి కాదుదిగాడు. దిష్టితీసిన తర్వాత రాముని భవంతిలోనకు తీసుకపోయారు.

# 6

బిడ్డను తీసుకువెళ్ళిన రెండురోజులవరకూ శాంతమ్మ పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టలేదు. రవి మధ్య మధ్య 'అన్న' 'అన్న' అంటూ ఏడవడం మానటూ లేదు. ఈ రభస చూసిన వెంకమ్మ మనసు భయంతో నిండిపోయింది. ఈ మాతృ పుత్రవియోగానికి కారణం పూర్తిగా తాను అనే భావం ఎప్పుడైతే ఏర్పడిందో శాంతమ్మ మనస్సు స్వస్థత చేకూర్చటమనే బాధ్యత తనదేననే ఉద్దేశం కూడా కలిగింది వెంకమ్మకు. అందుకే మూడవరోజు ఉదయాన్నే ఆయాసం దగ్గూ ఎక్కువగా ఉన్నా, శాంతమ్మ పడుకున్న మంచం మీద కూర్చొని కదల దలచలేదు.

"శాంతా" అని పిలచింది వెంకమ్మ.

గోడవైపుగా మొహంపెట్టుకున్న శాంతమ్మ పలుక లేదు.

"నువ్వులేకపోతే నన్ను చంపుకు తిన్నంతపట్టు" ఈ కంఠస్వరం వెంకమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకున్నట్లు ఊహింప చేసింది.

శాంతమ్మ వెంకమ్మ వైపు తిరిగింది. అప్పటికే శాంతమ్మ మొగం ఆరిన కన్నీళ్ల చారలతో మలినమైవుంది.

"అత్తా" శుష్క స్వరంతో పిలిచింది.

శాంతమ్మ పలికిందనే సంతోషాన్ని మొగంలోకి చూపుతూ "ఏం అమ్మా" అంది వెంకమ్మ.

"నువ్వు చేసినపని మంచిదేనా?"

"కడుపుతీపి మూలాన్న నీకలా అనిపిస్తుంది కాని ఈ పని మంచిది కాదని ఏ ఒక్కరూ అనలేరు" ఈ మాట అని కాస్త దగ్గింది. దగ్గుమాత్రం తీవ్రం కాలేదు:

"మా మరదికేం సమాధానం చెప్పుకోను?"

"ఎందుకు చెప్పుకోవాలి?"

ఈసారి నీరసంగా ఉన్న శాంతమ్మ మెల్లగా లేచి మంచంమీద కూర్చుంది.

"నీకు తెలీదత్తా. పోయి ఎక్కడున్నారో వారికి రాము రవి అంటే పంచప్రాణాలూను. పోయే ముందుకూడా తమ్ముణ్ని చూస్తూ, 'బిడ్డల బాధ్యత నీది. దీనికి వ్యతిరేకంగా వాళ్లను విడదీస్తే పరలోకంలో ఉన్నా నా ఆత్మ వ్యథ పడుతుంది' అన్నారు. 'అలా గెప్పుడూ జరగదు' అని మరది వాగ్దానం కూడా యిచ్చాడు."

ఈసారి శాంతమ్మ పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక పమిటకొంగులో మొగం దాచుకొని ఏడుస్తోంది.

వెంకమ్మ "శాంతా! చూడమ్మా! నీకింత బాధ కలుగుతుందంటే నేను మాత్రం యీపని చేస్తానమ్మా" అంది.

కాస్సేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉన్నారు. "ఈ తప్పు చేసినదానికి ఎవరిచ్చే శిక్షయినా నేనే అనుభవిస్తాలేమ్మా! భగవంతుడికూ్కడా నేనే సమాధానం చెప్పుకుంటాను... ఈ పాపం చాలు తల్లీ...నువ్వు తిండికి మాడి యింకా పాపాన్ని నాకు చుట్టుకోనివ్వకు" అంది.

వెంకమ్మ మొగంకేసి శాంతమ్మ చూసింది. ఎంత బాధలో అయినా ఆమె కళ్ళనీళ్ళు శాంతమ్మ చూడలేదు. కాని ఇప్పుడు ఆమె కళ్ళల్లో మెదిలే నీళ్ళు, ఆమె మానసికంగా పడే క్షోభను శాంతమ్మ గుర్తించేటట్లు చేశాయి.

శాంతమ్మ మెల్లగా లేచింది. వెంకమ్మ కర్ర ఆధారంతో వెనకాలనే లేచింది. ఇద్దరూ కలసి వంటగది వైపు వెళ్ళారు.

మనుష్యుల మనస్సులు గుర్తించకుండా – అర్థం చేసుకున్నామనే అపోహతో, తాము చెప్పేదే శ్రేయోదాయకమని ఉచిత సలహాలివ్వడమే గాక, అది మంచి మార్గమని వేలెట్టి చూపుతూ నిర్బంధంగా ఆ దారిని పొమ్మంటారు కొందరు పెద్దలు. ఆచరణలో ఆ గమనం ఎంత బాధా

పూరితమో; ఎంత కంటకమయమో – నడచేవాళ్లు క్రోభి స్తోంచే, అప్పుడు గ్రహిస్తారు. అప్పటి కయినా ఆత్మాభి మానంతో పడి చచ్చేవాళ్ళు తమ తప్పును ఒప్పుకోలేరు. కాని హృదయమున్న వెంకమ్మలాంటి ఏ కొందరో నిజాన్ని ఒప్పుకొని పశ్చాత్తాప పడచ్చు. అయినా చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొనే ఫలితమెంతో ఈ పశ్చాత్తాపానికి కూడా ఫలితమంతే.

ఈ విషాదపూరిత పుత్ర వియోగ బాణాఘాతం శాంతమ్మ హృదయాన్ని గాయపర్చిన తర్వాత నెల్లాళ్ళకు గాని, ఆ గాయం మాను మొగం పట్టలేదు. ఇప్పుడిప్పుడే రవిలోనే రాముని కూడా చూసుకుంటూ తృప్తి పడుతోంది శాంతమ్మ. సాయంసమయాన రవిని ప్రక్కను కూర్చోబెట్టు కొని, చేటలో బియ్యం ఏరుతున్న శాంతమ్మకు అడుగులు చప్పుడు వినిపించి తలెత్తిచూసింది.

చంద్రయ్య వచ్చి నిలబడ్డాడు.

అతన్ని చూడ్డంతోనే, శాంతమ్మ గుండె లొక్కసారి ఝల్లుమన్నాయి. కాని ఆ అదుటు మొగంలో కనిపించనీయ కుండా మెల్లగా లేచి, చావిట్లో వాలు కుర్చీ వేసింది. చంద్రయ్య కుర్చీమీద కూర్చున్నాడు. శాంతమ్మ మొదట్లో అంత కంపితురాలు కావడానికి కారణం తాను చేసిన నేరమే కాదు. చంద్రయ్య మొగం కూడా క్రోధరేఖలతో నిండిపోయి ఉంది.

శాంతమ్మ మెల్లగా వెళ్ళి చెంబుతో నీళ్లు తీసుకవచ్చి మరది దగ్గర పెట్టింది. రవి అంత చనువుగా చంద్రయ్య దగ్గరకు రాలేదు. బహుశా ఈ రెండు మాసాల్లో కొద్దిగా అలవాటు తప్పివుండవచ్చును.

చంద్రయ్య రవిని మొదట్లో చూసినా అతని మీద దృష్టి నిలుపలేదు. శాంతమ్మకేసే చూస్తున్నాడు.

శాంతమ్మ ఏదో పలకరిద్దామని ఒకసారి చంద్రయ్య కేసి చూసింది. కాని ఆ వెంటనే తల వంచుకువెళ్ళి బియ్యాం చేటదగ్గర కూర్చుంది.

ఒదినగారంటే, చంద్రయ్యకు భక్తి ఉన్నా, చంద్రయ్య అంటే మాత్రం ఆ కుటుంబాని కంతటికీ ఒక భయం మాత్రం ఉండేది. దానికి కారణం చంద్రయ్య కష్టాన్నిగాని, సంతోషాన్నిగాని తొందరగా జీర్ణించుకోలేడు. ఉన్నమాట ఏదన్నా మొగంమీదనే అడిగేసే లక్షణం...దాని గురించే శాంతమ్మ ఆలోచిస్తోంది.

"రాము ఏడీ?" చంద్రయ్య అడిగాడు. ఆ ప్రశ్నలో ఉన్న బాధాపూరిత భావంవల్ల శాంతమ్మ సమాధాన మివ్వలేక పోవడమేకాదు తలెత్తలేకపోయింది.

"ఏం వొదినా?"

ఇప్పుడు తలెత్తి చూసింది.

"దత్తత వెళ్ళేడా?"

"నాకు తెలీదు"

"తెలుసుకోకుండా పిల్లవాణ్ని ఏలా యిచ్చావ్?"

ఈ మాటకు శాంతమ్మ సమాధానం యివ్వలేదు.

"డబ్బేమన్నా ముట్టిందేమిటి?" ఈ మాట చాలా మెల్లగా అన్నాడు. అది ఎంత ధ్వని తక్కువలో శాంతమ్మకు వినిపించిందో, అంత వడిగా చెవినించి దాటి హృదయాన్ని తూటుపరచింది. ఒక్కసారి శాంతమ్మ మరదికేసి చూసింది. ఆమె కళ్ళలో ఉబికిన రక్తపునాళాలు చంద్రయ్య చూశాడు.

"ఏ ప్రతిఫలం లేకుండా ఆ బిడ్డను పరుల చేతిలో పెట్టవని నాకు తెలుసు."

ఈ మాటతో శాంతమ్మ లేచింది. "ఔను తీసుకున్నాను" చాలా చింతగానూ - నిర్లక్ష్యంగానూ - బాధగానూ ధ్వనించిందా కంఠం.

"హోటలుకు పెట్టుబడి లేదా?"

"నాకు సమాధానం యివ్వవలసిన పని లేదు. చచ్చిన తర్వాత సమాధానం చెప్పుకోవాలంటే వారిదగ్గరే చెప్పుకుంటా."

తొందరగా తలుపు వెనక్కి వెళ్ళిపోయింది.

"నే నిస్తాను బాబూ ఆ సమాధానం."

చంద్రయ్య తల యిటు త్రిప్పిచూశాడు. వెంకమ్మ ఎప్పుడొచ్చి నిలబడిందో, అతనికి తెలీదు. వెంకమ్మ ఈలా చెప్పడ మారంభించింది.

"నువ్వెళ్ళిన మరునాటినుంచే శాంతమ్మ హోటలు మూసివేయించింది. జమీందారు గంగాధరానికి పిల్లవాణ్ని యిచ్చింది నేను. వాళ్ళు దత్తత చేసుకుంటారని నాతో చెప్పారు. డబ్బు కాసించి పిల్లవాణ్ని అమ్ముకుందనే నేరం నువ్వేస్తే; చాలా పాపం తగులుతుంది బాబూ!..." ఈ ఆఖరి మాటలు కోపంగా అనడంతోనే వెంకమ్మకు దగ్గు వచ్చింది. ఆ దగ్గు సందడిలో, చంద్రయ్య నిట్టూర్పు ధ్వని కూడా ఎవరికీ వినిపించలేదు.

దగ్గు తగ్గింది. మళ్ళీ వెంకమ్మ యిలా అంది.

"రాము జమీందారు కావడం నీ కిష్టం లేదా బాబూ! అలాంటి కష్ట మేదన్నా ఉంటే; నన్ను దూషించు కాని శాంతమ్మను ఏమీ అనమాకు...నీకు ఏ విధంగా సమాధానం చెప్పుకోనా అని యీ రోజువరకూ ఏడుస్తూనే వుంది."

ఈ మాటలువిన్న చంద్రయ్య కోపం కాస్త తగ్గ నారంభించింది. వచ్చినప్పుడున్న ఆవేశాన్నీ, ఒదినగారు హోటలు కట్టివేసిందనీ, తనకు సమాధానం చెప్పుకోడానికి బాధపడుతోందనే మాటలు - చల్లని వాన జల్లులా హృదయానికి తాకాయి.

"కాదు పెద్దమ్మా! ఆమెను బాధపెట్టాలని నా ఉద్దేశం కాదు. కాని ఆ రాముని నాదగ్గరే ఉంచాలను

కన్నాను. అయితే ఒదినకు జడిసి ఆ మాట నే నడగ లేక పోయాను. పైగా మా అన్న యిద్దర్నీ విడదీయవద్దని చెప్పాడు...ఇవన్నీ ఆమెకు తెలుసు, తెలిసుండి కూడా ఈపని చేసిందంటే; నాకెంత కష్టంగా వుంటుందో చెప్పు...అన్న గారు చచ్చిపోయినా మరది చావలేదని తెలుసుగా – నా ఆలోచనకూడా అక్కర్లేని పాపం నేనేం చేశానో నాకర్థం కావడల్లేదు." మెల్లగా కుర్చీమీదనించి లేచి—"ఒదినా" అని పిలిచాడు.

తలుపు ప్రక్కనించి వచ్చి నిలబడింది. ఆమె కళ్ళు అప్పుడే తుడుచుకున్నట్లుగా చంద్రయ్య గుర్తించాడు.

"ఎవరో డబ్బు తీసుకుని పిల్లవాణ్ని యిచ్చినట్లుగా చెప్పారు...నిజమే; నువ్వన్నట్లుగా నాకేం సంబంధముంది? ఏనాడైతే అన్న పోయాడో – ఆనాడే నాకు ఒదినకూడా దూరమైంది.." ఇక మాట్లాడలేకపోయాడు. కంఠం గద్గదిక మైంది.

శాంతమ్మ ఆశ్చర్యంగా దగ్గరకొచ్చి నిలబడింది.

ఆ వాలుకుర్చీలో చంద్రయ్య కూలబడి మొగం చేతులతో కప్పుకొన్నాడు.

"అదేంపని బాబూ"

ఈ మాటలు శాంతమ్మ అంది.

ఈ విషయాన్నంతా గమనిస్తున్న రవి గుక్కపెట్టి ఏడుస్తున్నాడు.

వెంకమ్మ అంత నీరసంతోనూ - కర్ర చేతిలో ఉండ గానే నవిని చంక నేసుకుని ఈరడిస్తూ దొడ్డివైపునకు తీసుక పోయింది. ఆరోజు చంద్రయ్యలో మార్పు శాంతమ్మను విస్మితురాలుగా చేసింది.

భోజనానికని పిలచిన ఒదినగారి ఆహ్వానాన్ని కూడా తిరస్కరించకుండా వెళ్ళి ఆకు దగ్గర కూర్చున్నాడు. అతను భోజనం చేస్తున్నంతసేపూ శాంతమ్మ కాస్త దూరంగా ఎదురుగానే కూర్చుంది.

తనపై చంద్రయ్య హృదయంలో ఏలాంటి ప్రేమాభిమానా లున్నాయో శాంతమ్మ ఈరోజు ఎక్కువగా అర్థం చేసుకుంది. ఆ మధుర భావనే, అవిరామ గతితో ఆమె హృదయంలో ప్రవహిస్తోంది. భోజనమైన తర్వాత చంద్రయ్య లేచి, చేతులు కడుక్కుని, కండువా పైన వేసు కుంటూ "వెళతా ఒదినా" అన్నాడు.

"కాస్సేపుతాళి వెళుదువుగాని యిప్పుడేగా భోజనం చేసింది."

"అయినా పరవాలేదు..." రెండు అడుగులు వేసి "ఇక రాను - ఏదన్నా కష్టం వచ్చినప్పుడు నన్ను మర్చి పోకు..తప్పులుంటే క్షమించు" గుమ్మందాటి వెళ్ళిపోయాడు.

శాంతమ్మ స్తబ్ధురాలై అలాగే నిలబడిపోయింది. ఈ ఆఖరిమాటలు అతని హృదయంలో ఉన్న తీరని వ్యధను వ్యక్తం చేసేయి. తానే ఆ క్షమాపణ కోరుకోవాలనుకుంది శాంతమ్మ. ఆ అవకాశాన్ని అతనే తీసుకొని చేయని నేరానికి క్షమాపణ కోరి వెళ్ళిపోయాడు.

# 7

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. మళ్ళీ చంద్రయ్య ఒక్కసారి కూడా రాలేదు, ఇక వచ్చి తన కష్టసుఖాలు కనుక్కుంటాడనే నమ్మకం కూడా శాంతమ్మకు లేదు.

వెంకమ్మ దగ్గూ ఆయాసంవల్ల మంచం పట్టింది. ఆమెకు సేవచేస్తూ నాలుగు మెతుకులు తింటూ జీవనోపాధి చేస్తోంది. కాని భవిష్యత్తు తలపునకు వచ్చేటప్పటికి శాంతమ్మ కంపించడం జరుగుతుంది. రవి యిప్పుడిప్పుడే తప్పటడుగులు మాని సాఫీగా నడవగలుగుతున్నాడు. రాము జ్ఞాపకానికి వచ్చినప్పుడు, ఏదో ఆశ శాంతమ్మ అంతరాన మెదిలేది. కాని వెంటనే నిస్పృహతో కూడిన ఒక నిట్టూర్పు విడిచి పెట్టేది.

ఒకరోజు ఉదయం లేచి చూసే సరికి సావిట్లో ఒక అపరిచిత యువకుడు కూర్చుని వున్నాడు. తెల్లవారుఝాము అయిదు గంటల బండికి రైలు దిగి వచ్చినట్లుగా ఆమె ఊహించింది.

మనిషిని చూస్తే; నాగరికుని వేషంతో ఉన్నాడు. ఎదురుగా రెండు పెట్టెలు, ఒక బెడ్డింగూ పడి ఉన్నాయి. ఎరమరిక ఏమీ లేకుండా చావిట్లో ఉన్న వాలు కుర్చీమీద కూర్చొని సిగరెట్టు పీలుస్తున్నాడు.

శాంతమ్మ మెల్లగా కుర్చీని ప్రక్కనుంచి తప్పుకొని వెంకమ్మ గదిలోకి వెళ్ల బోతుంటే—"మీ రెవరూ?" అని వెనకనించి ఆ పెద్దమనిషి ప్రశ్నించాడు. శాంతమ్మ ఆశ్చర్యంగా చూసింది. తాను వేయవలసిన ప్రశ్న అతడే వేశాడు. సమాధానం యివ్వడం ఆమెకు యిష్టం లేక వెంకమ్మ గదిలోకి వెళ్ళింది.

ఈ దృశ్యం మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది శాంతమ్మకు. వెంకమ్మ మంచం ప్రక్కగా ఒక తుంగ చాప పరుచుకొని, ఒక యువతి గాఢ నిద్రలో మునిగిఉంది.

"అత్తా" శాంతమ్మ వెంకమ్మ దగ్గరకు వెళ్లి మెల్లగా పిలచింది. వెంకమ్మ సుఖ నిద్రలో చిన్నగుర్రు కూడా పెడుతూ వుంది.

"అత్తా!" కాస్త బిగ్గరగా పిలచింది మళ్లీ. క్రింద పడుకున్న యువతి కాస్త కదలి "ఆ రాత కోతలు పూర్తి చేయండి...తరువాత మాట్లాడదాం" అని అస్పష్టంగా పలికింది. శాంతమ్మ కాస్త దూరంగా తప్పుకొని పరిశీలించి చూస్తుంది.

వెంటనే నవ్వు వినిపించి వెనక్కి తిరిగి చూసింది.

"కలవరింతలు లెండి, మీరేం కంగారు పడొద్దు... తెల్లార్లూ రైలు ప్రయాణం."

చావిట్లో కూర్చున్న అతనే గది గుమ్మంలోకి వచ్చి ఆ మాట లన్నాడు.

"అయితే మీ రెవరో చెప్పేరు కాదు" మళ్ళీ ప్రశ్నించాడు. శాంతమ్మ సమాధానం యివ్వలేకపోయింది.

"రాత్రి వీధి తలుపు వేసింది మీరేనా?"

శాస్త్ర ఆక్షేపణగా ధ్వనించిందా స్వరం.

శాంతమ్మ ఆలోచించింది. తాను చేసిన పొరపాటు గుర్తించింది. వీధి తలుపు గడియ వేయకుండా తలుపు జేర వేసి, పరధ్యాన్నంగా వచ్చి పడుకుంది.

"ఎవరయినా దొంగలు వచ్చినా అంతేకాదూ?" అది నిజమే కావచ్చు. ఆ అపరిచిత వ్యక్తి, ఇంత చనువుగా మాటలు కలపడం శాంతమ్మకు చిరాకనిపించింది.

"అత్తా" ఈసారి బిగ్గరగా తట్టి లేపింది. వెంకమ్మ తృళ్లిపాటుగా కళ్ళు తెరచింది. "ఏవమ్మా" ఆందోళనగా లేవకుండానే ప్రశ్నించింది.

"అమ్మా" ఈ కంఠం విని గుమ్మంవైపునకు తలెత్తి చూసింది. మనిషినికూడా గుర్తించింది. కాని ఏమీ ప్రశ్నించ లేదు. ఆమె మొగంలో ఒక విరక్తి భావం వెల్లడికావడం శాంతమ్మ గమనించింది.

"నాలుగు గంటల బండికి వచ్చాంలే! నీ ఆరోగ్యం ఏలావుందీ?" ఈమాట అంటూనే మంచం దగ్గరగా వచ్చాడు.

"పెద్దమ్మ యిప్పుడు కావలసివచ్చినట్లుంది" అని వెంకమ్మ మొగం ప్రక్కగా తిప్పుకుంది.

"ఏం చేయను పెద్దమ్మా...ఊరికాని వూళ్లో ఉద్యోగం. నెల్లాళ్ళనించి ప్రయత్నం చేస్తే; ఈ నాటికి కాస్త శెలవు దొరికింది" అంటూనే చనువుగా వెంకమ్మ కాళ్ళదగ్గర కూర్చుని "పెద్దమ్మా! వారెవరూ?" మళ్లీ శాంతమ్మకేసి చూస్తూ అడిగాడు.

పదేపదే ఈలా ప్రశ్నించడంలో తగిన కారణం లేకుండా పోదని శాంతమ్మ గ్రహించినా - శెలవులో వచ్చిన మనిషికి తెలుసుకో తగ్గ కాలం కరువు కాలేదని కూడా తెలుసుకుంది. అందుకే కాస్త దూరంగా తప్పుకుంది.

"మా మేనగోడలు."

"అరె! రామయ్యచౌదరి భార్యా?"

దీనికి వెంకమ్మ సమాధాన మివ్వలేదు.

"పెళ్ళినాడు చూశాను...అబ్బో! అప్పుడే పన్నెండేళ్ళయింది. అప్పుడు నేను స్కూల్ ఫైనల్ చదువుతున్నా-" అని కాస్సేపాగి "పాపం! ఆయన బావున్నాడా" అని నోరు ఆలాగే ఆవలించి కాస్సేపటివరకూ ఉంచాడు.

శాంతమ్మకు ఈ ప్రశ్నే మరొకళ్ళు వేసివుంటే తప్పక తనకు నవ్వు వచ్చేదేమో.

హిందూ స్త్రీని కళ్ళారా చూచి కూడా కన్యో, పునిస్త్రీయో, విధవో గుర్తించలేని హిందువు డున్నాడంటే; ఆడది తప్పకుండా నవ్వుతుంది. అయితే మతాన్ని విస్మరించిన

మగువ కాదని తెలిసికూడా ఈ తెలివి తక్కువ ప్రశ్న వేయడంలో పూర్తిగా అమాయకత్వం కాదనీ, అతిగా మాట్లాడే వాళ్ల లక్షణాల్లో ఇదొకటని మాత్రం శాంతమ్మ ఊహించింది.

"ఏమేవ్!" అని క్రిందచూస్తూ బిగ్గరగా పిలచాడు.

"అబ్బబ్బ! చంపుతున్నారే...ఒకటే గోల" అంటూ అటు తిరిగి పండుకుంది.

"ఇస్! ఇది మన యిల్లు కాదే" అన్నాడు నోరు నొక్కుకుంటూ.

"ఎవరిల్లు కానివ్వండి...బద్ధకం తీరే వరకూ చచ్చినా లేవను" వెంటనే కాళ్లు ముడుచుక పండుకుంది. మళ్లీ కాస్త చలించి "ఏమన్నారూ? మనిల్లు కాదూ?" అని లేచి చాపమీద కూర్చొని "పరాయి యిల్లుగా చేద్దామనేగా యింత కాలం పట్టినట్లు కూర్చున్నారు!" ఈ సారి లేచి, మంచమ్మీద ఉన్న వెంకమ్మను చూస్తూ "విన్నావూ! అత్తయ్యా? చెవిని యిల్లుకట్టుక పోరగా పోరగా యిప్పటికి కదిలేరు. కన్న తల్లి వేరున్నూ, పెత్తల్లంటే వేరూనా? మనుషులకి కాస్త జ్ఞానం ఉండాలి..". అని ఆయన మొగంలోకి కోపంగా చూస్తూ, "మీ చదువుకీ – మీ వెలుక్కీ కారణం ఎవరో మర్చిపోతే పుట్టగతులుంటాయా?" అని అడిగింది.

"ఊ–రు–కోవే" వెంకమ్మ మెల్లగా అంది. కంఠం కూడా ఆమెకు కళ్లనీళ్ళు వచ్చినట్లుగా స్ఫురింపచేస్తుంది. రవి

అప్పుడే లేచి "అమ్మా!" అంటూ పిలిచాడు. శాంతమ్మ తన గదిలోకి వెళ్ళిపోయింది.

వెంకమ్మ అపత్కాలంలో ఆదుకోడానికి వచ్చిన ఈ పుణ్యదంపతులిద్దరూ వెంకమ్మకు కావలసినవాళ్ళు.

మరదికొడుకైన రవణయ్యను చిన్ననాటినించీ స్వంత కొడుకుగా పెంచి పోషించి విద్యాబుద్ధులు చెప్పించింది వెంకమ్మ. ఒకయింటివాణ్ణిగాకూడా తనేచేసింది. అయితే కాకిగూటిలో పెరిగిన కోకిలలా రెక్కలు రావడంతోనే తన పరివారంలో చేరిపోయాడు. ప్రస్తుతం నెల్లూరులో పోస్టు క్లార్కు ఉద్యోగంచేస్తూ భార్యతో అక్కడే ఉంటున్నాడు.

ఇంతకాలానికి పెత్తల్లిని చూడ్డానికి రావడంలో అంతరంగికంగా పెంచిన ప్రేమలేదని అనలేముగాని, హోటలు పెట్టి స్వయంకృషితో పదివేలరూపాయలవరకూ ఆర్జించి ఉంచిందనీ, యిక ఎంతోకాలం బ్రతకదనే వదంతి యథార్థం కాదనే నమ్మకంకూడా అతన్ని రప్పించి ఉంటుంది.

రవణయ్య భార్యపేరు కాంతం. భర్తకు మించిన వాగ్ధాటి, భర్తపడే పొరపాట్లు సవరించగల నేర్పరితనం కూడా ఆమెలోఉంది. శాంతమ్మ పనిపిల్ల సహాయంతో పని పాట్లలో మునిగిఉంది. కాఫీలు అయిన తర్వాత శాంతమ్మ వెంకమ్మ గదిలోకివచ్చి "ఏం కూరలు చేయనత్తా" అని అడిగింది.

వెంకమ్మ ఆలోచిస్తుంది.

కాంతం మెల్లగా అంది "అత్తయ్యా! నల్లకోడి ఏమన్నా గుడ్లుపెడుతోందా?"

వేరే ఆలోచనకు తావివ్వక వెంటనే "దాని మొగంలే! నాలుగురోజులు గుడ్లుపెడితే, నెల్లాళ్లు అణుగుతుంది" అని వెంకమ్మ సమాధానం యివ్వగానే రమణయ్య గుటకలువేస్తూ "అయితే ఎందుకూ? యీరోజు కోడిని కానివ్వండి" అన్నాడు.

కాంతం నవ్వింది "సిగ్గూబొగ్గూ లేదు... ...వచ్చిన చుట్టాలు అడిగి ఎక్కడైనా వంటచేయించుకుంటారా?" అని అంది.

"ఎక్కడైనా చేయించుకోపోవచ్చు–ఇక్కడమాత్రం కాదు. ఇది నా స్వంతయిల్లు...ఇష్టంలేకపోతే నువ్వు తినడం మానేయి" మొహం పెడగాపెట్టుంచి, తన తెలివితేటలకు తనే ఆనందించే దుస్థితిలో ఉన్నాడు రమణయ్య.

ఆ భంగిమచూసి కాంతం రెండోసారికూడా నవ్వింది. శాంతమ్మ అంతసేపూ నిలబడి చూడ్డం కాస్త విసుగ్గానే తోచింది. "ఏం చేయమంటావూ?" అని మళ్లీ రెట్టించి అడిగింది.

ఆ కోడిపెట్టపై తనకున్న అభిమానాన్ని మరచి అనాలోచితంగా అన్నమాట వెంకమ్మను ఇరుకునపడేటట్లు చేసింది. "సరే కోణ్ణి కోయించు" అని మెల్లగా మూలిగింది.

శాంతమ్మ వెనక్కి తిరిగింది.

"ఏం అక్కా ! నన్ను పరాయిదానిలా అనుకుంటు న్నావా?" అని కాంతం ప్రశ్నించింది.

ఈ అకారణనిందకు శాంతమ్మ ఆశ్చర్యంగా వెనక్కు చూసింది. "లేదమ్మా" అనికూడా అంది. కాంతం నవ్వబోయి ఆగిపోయింది. వెంకమ్మకేసి చూస్తూవుండిపోయింది.

ఆ ప్రశ్న ఆ ప్రవర్తనలో అర్థాన్ని శాంతమ్మ గుర్తించలేదు. గుర్తించాలని ప్రయత్నించలేదు. మెల్లగా వెళ్లిపోయింది.

"అంగటికి పోయివస్తా ఏం తోచటల్లే" వళ్లు విరుచు కుంటూ లేచాడు రవణయ్య. వెంకమ్మ సరే అన్నట్లు తలపంకించింది.

కాంతం ముందుగానే లేచి వెళ్ళింది. రవణ చావిట్లోనించి వీధిగుమ్మంలో అడుగు పెట్టబోతుంటే "మాట" అనేమాట వినిపించింది.

కాంతం రెండో గది గుమ్మంలో నిలబడివుంది. రవణయ్య భార్యదగ్గరగా వచ్చాడు.

"నేను చెప్పింది ఏం చేశారూ?" కాస్త రహస్యంగా ధ్వనించిందా కంఠం.

"ఇదిగో వెళుతున్నాగా" ఒకడుగు వేసి వెనక్కు తిరిగి "మరి అమ్మతో చెప్పద్దూ?" అమాయకంగా మొగం పెట్టి అడిగాడు.

"అయ్యో! తెలిసి" చేతులు తిప్పి, పెదవి విరచింది కాంతం.

ఈ అభినయంతో రవణయ్య కాస్త చిన్నబుచ్చు కున్న చిహ్నాలు మొగంమీద కనిపించాయి.

కాంతం భర్త చెవిదగ్గరగా మొగంపెట్టి, కళ్ళు పెద్దవిగాచేసి "అడక్కుండా తీసుకురావడమే మంచిది. అడిగితే ఆమె ఒప్పుకుంటుందా?" అని అడిగింది కాంతం.

"ఔనౌను" తల పంకించాడు.

"వెళ్లండి మరీ" అని హెచ్చరించింది మళ్లీ కాంతం.

రవణయ్య వెళ్ళిపోయాడు.

వంట చేస్తున్న శాంతమ్మ దగ్గరగా కాంతం వెళ్లి, క్రిందఉన్న ఉల్లిపాయ పొరలు తీస్తూ "ఇంత పీనాసిముం డేమిటక్కా" అని ప్రశ్నించింది.

తెడ్డితో తీసిన అన్నం పదునుచూస్తున్న శాంతమ్మకు ఈ మాట ఎవర్ని గురించి అందో అర్థంకాలేదు.

"ఎవరూ?"

"తెలీనట్లు అలా అడుగుతావేమి టక్కా! అత్తముండ." ఈమాటకు శాంతమ్మ చాలా ఆశ్చర్యపడింది. ఆశ్చర్యపడ్డంలో వెంకమ్మకు లేని లోభత్వాన్ని చూపిస్తుందనికాదు. వెంకమ్మ లోభే కావచ్చు, కాని వయసు మీరిన ఆమెను "ముండ" అని ఉచ్చరించడంలో శాంతమ్మ ఆశ్చర్యపడింది.

"నీకు తెలీదక్కా! పెళ్ళి కూడా యీముండే చేసింది. కొడుకు చచ్చేడో ఉన్నాడో అని కూడా విచారణ లేదు. ఆయనకు ఉద్యోగం లేనప్పుడు ఎన్నెన్ని బాధలు పడ్డామో ఆ భగవంతుడికి తెలుసు." ఇప్పటికే ఉల్లిపాయల ఘాటు కళ్ళవరకూ పాకి కళ్లనీళ్లు కార్చేటట్లు చేసింది. తరువాత ఒక్కసారి కళ్ళు తుడుచుకొని "ఆ కష్ట కాలంలో నోరు తెరచి అడిగినా పదిరూపాయలు సాయం చేసిందా దీని సంపాదన పాడుగాను.. చచ్చేటప్పుడు కూడా తీసుకపోతుంది కావాసు" అని ఉల్లిపాయలు అక్కడ విడిచిపెట్టి పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుంటుంది.

"పోనీలేమ్మా—పెద్దది" అని మాత్రమే శాంతమ్మ సమాధాన మిచ్చింది.

"అవును. కాస్తో కూస్తో నీకాధారంగా ఉంది కాబట్టి నీకు మంచిగానే కనిపిస్తుంది...ఆమెనుండి ఒక్క చిల్లికానీ కూడా నే నెరగను. ఆమె పెద్దరికం నాకెందుకూ?" అంది కాంతం.

ఈమాట శాంతమ్మకు బాధగానే తోచింది. అన్నం కలబెడుతూ ఒక్కసారి మాత్రం కాంతంకేసి చూడగలిగింది. కాంతం ఏమనుకుందో, మూతి తిప్పుకొని అక్కడనించి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం పన్నెండు గంటలకల్లా, రవణయ్య ఒక డాక్టర్ని తీసుక యింటికి వచ్చాడు. అప్పటికే వెంకమ్మ నాలుగు మెతుకులు తిని తన గదిలో పడుకొనివుంది.

"ఏమేవ్" గుమ్మంలో అడుగు పెడుతూనే భార్యను పిలిచాడు రమణయ్య.

ప్రక్క గదిలోనుంచి కాంతం వచ్చి చూసింది. డాక్టరు గుమ్మం వెలుపలనే నిలబడి ఉన్నాడు.

"ఏమి టలా చూస్తారు? ఈ కుర్చీ తీసుకెళ్ళండి" అంటూ గదిలోని వాలుకుర్చీ గుమ్మందగ్గరకు తీసుకవచ్చింది. రమణయ్య కుర్చీ అందుకొని చావిట్లో వేసి "కమిన్ సార్" అన్నాడు.

డాక్టరు వచ్చి కూర్చున్నాడు.

కాంతం ముందుగానే వెంకమ్మ గదిలోకి వెళ్ళింది.

వెనకాలనే రమణయ్య కూడా చేరుకున్నాడు.

"అత్తయ్యా" అని పిలిచింది కాంతం. గాఢనిద్రలో లేని వెంకమ్మకు యీ పిలుపు తొందరగానే వినిపించింది.

"మీ అబ్బాయి డాక్టరుగార్ని తీసుకవచ్చారు."

"డాక్టరా?" ఆశ్చర్యంగానే ధ్వనించిందా మాట. మెల్లగా లేచి మంచంమీద కూర్చుంది.

"అవునమ్మా! కళ్ళారాచూస్తూ కాదని నేనుకూడా ఏలా వుండను" అన్నాడు మెల్లగా రమణయ్య.

పెరటిలో ఉన్న శాంతమ్మ అప్పటికే చావిడి ప్రక్క గదిలోకి వచ్చి నిలబడింది.

"లేవండి! వారు చావిట్లో కూర్చున్నారు."

వెంకమ్మ ఏదో అనాలని నోరు తెరచింది. ఆ మాట అనకుండానే దగ్గు తరుముక వచ్చింది.

"మాయదారి రోగం ...... ఇంతకాలం తింటూ యింటిలో ఉన్నవాళ్ళకు కూడా అంత పట్టలేదు" అంది కాంతం. ఈ మాటలు శాంతమ్మ వినలేదు. ఆ దగ్గుధ్వనిలో కలిసిపోయిన ఆమాటలు స్పష్టంగా వినిపించలేదు. కొడుకూ కోడలూ వెంకమ్మను చెరొక వైపునా ఉండి, ఆమె నడకకు పరిపూర్తిగా సాయపడకపోయినా, జబ్బలు పట్టుక తీసుక వచ్చారు.

"ఏమిటక్కా! అట్లా చూస్తావు? ఆ ముక్కాలుపీట ఈలా తీసుకరారాదూ...అంది కాంతం కాస్త కఠినంగా.

శాంతమ్మ గోడప్రక్కగా ఉన్న ముక్కాలుపీట డాక్టరు ఎదురుగా వేసింది. వెంకమ్మ కూర్చుంది.

"ఏమిటమ్మా రోగం?"

అంటూ డాక్టరు ప్రశ్నార్థకంగా చూశాడు.

"దగ్గూ...ఆయాసం" వెంకమ్మ ఆయాసపడుతూ చెప్పింది.

డాక్టరు స్టెతస్కోప్‌తో పరిశీలించాడు. ఒకసారి బరువుగా గాలి పీల్చాడు. అందరూ అతని మొగంకేసి చూశారు.

"సరే! కొంచం కష్టపడాలి" పైకి లేచాడు.

వెంకమ్మ ఆలాగునే చూస్తూ వుండిపోయింది.

"మీారు హాస్పిటలుకు రండి మాట్లాడదాం" అంటూ డాక్టరు గుమ్మం వెలుపలకు వొచ్చాడు. రవణయ్య వెన కాలనే నడుస్తూ వెళ్ళాడు.

"ఎవరు తీసుక రమ్మన్నారు డాక్టర్ని" అనుమానంగా కాంతంకేసిచూస్తూ అడిగింది వెంకమ్మ.

"వారే"

"మాయదారి డాక్టర్లే...డబ్బు తగలేయడంగాని, రోగం తగ్గుతుందా పెడుతుందా?" అంటూ నడ్డిమీాద చేయివేసుకొని మెల్లగా లేచింది వెంకమ్మ. కాంతం సమా ధానం యివ్వలేదుగాని నవ్వింది.

శాంతమ్మకేసి చూస్తూ "అత్తయ్యకు డబ్బుమీాద ఆశ, డాక్టర్లను పనికిరాని వాళ్ళగా చేస్తుంది కదా అక్కా" అని అంది.

ఈమాటకు ఏం సమాధానం యివ్వాలో శాంతమ్మకు తెలీలేదు. చిన్నగామాత్రం నవ్వింది.

వెంకమ్మకు కాస్త కోపం వచ్చింది. "డబ్బుమీాద ఆశ...ఆశలేనివాళ్ళెవరమ్మా? బెల్లముంటేనే చీమలు చేర తాయి" అంటూ వెంకమ్మ గదిలోకి దారితీసింది.

ఈమాట కాంతం మొగంలో విచిత్రమైన మార్పు తీసుకవచ్చింది. హృదయానికి తగిలిన శరాఘాతం కళ్ళల్లో కోపం మెరిసేవరకూ ఊరుకోలేదు.

"పరవాలేదు...ఒక్క నెల్లో మాఅమ్మ మామూలు మనిషైపోతుంది..అరె!అమ్మేది"అంటూ గుమ్మంలోంచివస్తూనే పై మాటలని భార్య మొగం చూసి అలాగే ఉండిపోయాడు.

"మీరెందుకు డాక్టర్ని తీసుకరావాలి?" క్రోధంగా రవణయ్యకేసిచూస్తూ అడిగింది కాంతం.

ఈ మాటకు సమాధానం నాలుక చివరనే వుంది. కాని దిగమ్రింగి గుటకలువేశాడు. ముఖం చిట్లించి "తీసుకొస్తే?" అని ప్రశ్నించాడు.

"ఆమెదగ్గర బెల్లం ఉంది కాబట్టి చీమల్లాచేరాం.." ఈమాటతో కాంతం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. గుమ్మంలో నిలబడ్డ శాంతమ్మ దగ్గరగా వచ్చింది "పెద్దావిడఏదో అంటె.. అంతలో బాధపడితే..." ఇంకా శాంతమ్మమాట పూర్తి కానిదే, తన భుజంమీద ఉన్న శాంతమ్మచేయి విసురుగా తీసి "పెద్దా విడ...ఆశా పాశా ఉండేవాళ్ళు ఆవి డనే మాటకు పడుంటారు. మాకేం మేం యిక్కడ పడిగాపులు పడి తినడానికి రాలేదు" అంటూ తొందరగా వంటగది వైపునకు వెళ్ళిపోయింది.

ఈ మాటకు శాంతమ్మ స్థంభించిపోయి అలాగే నిలబడి చూస్తూ వుండిపోయింది.

తాను విసిరినరాయి, కాంతాన్ని దూసుక శాంతమ్మ కణతకు తగులుతుందని వెంకమ్మ మొదట్లో అనుకోలేదు.

ఈ మాటలు గదిలో ఉన్న వెంకమ్మ వింది. గట్టిగా నిట్టూర్చి మంచంమీద పడుకుంది.

రాత్రి భార్యాభర్తలు ఏమాలోచించారో, ఉదయాన్నే ప్రయాణానికి సిద్ధమయ్యారు.

శాంతమ్మ మాత్రం ఈ హఠాత్ ప్రయాణానికి చాలా బాధపడింది. కాని ఏ మాటంటే తిరిగి ఏ విధమైన సమాధానం వస్తుందో అని భయంతో కాంతాన్ని వారించడానికి ప్రయత్నించలేదు. తిన్నగా వెంకమ్మ గదిలోకి వెళ్ళింది. వెంకమ్మ అప్పుడే లేచి మంచంమీద కూర్చునివుంది.

"వారు వెళ్ళిపోడానికి ప్రయాణ మౌతున్నారత్తా" చిన్నగా ధ్వనించే కంఠంతో అంది.

"వెళ్ళడమే మంచిదీ" అంత ధ్వనిలోనే వెంకమ్మ కూడా సమాధాన మిచ్చింది.

శాంతమ్మ ఆశ్చర్యంగా చూసింది. తరువాత ప్రాధేయతా భావం వెళ్ళడయ్యేట్లుగా "ఆలాఅంటే బావుంటుందా?" అని మాత్రం అడిగింది.

"నీకు తెలీదమ్మా" మెల్లగా దగ్గింది. తరువాత యిలా అంది "ఉన్నమాటంటే ఉలుకెక్కువ. ఏనాడో విడిచిపెట్టిన వాళ్ళు యిప్పుడొచ్చారంటే..." అంటూ శాంతమ్మకేసి చూచింది. శాంతమ్మ ఏమీ సమాధాన మివ్వలేదు. శ్రద్ధగా మాత్రం వింటోంది. మళ్ళీ వెంకమ్మ ఈలా అంది: బేంకులో

ఉన్న పదివేలూ – ఈ కొంపా కాజేయడానికీ...ముందుగానే చంపేస్తారేమో;" వెంకమ్మ కళ్ళలో నీళ్లు తిరిగాయి.

ఈ మాట శాంతమ్మకు విచిత్రమైన భయాన్ని కలిగించింది. వెంకమ్మ నిగూఢ మేధాశక్తి సంపన్నతకు విస్తుపోయి చూసింది శాంతమ్మ.

ఎవరితో చెప్పకుండానే భార్యాభర్త లిద్దరూ వీధి గుమ్మం వెలుపలకు వెళ్ళారు. బండి గుమ్మంలో ఉంది. వెంకమ్మ మెల్లగా నడచి గడప దగ్గర నిలబడి చూసింది. ఏదో ఆలోచించి ఒకడుగు ఎదుటకు వేయబోయింది. కాని ఆ వెంటనే కాలుజారి క్రిందపడింది.

బండి ఎక్కబోతున్న రవణయ్య గిరుక్కున తిరిగి "అమ్మా" అంటూ కంగారుగా వచ్చాడు. శాంతంకూడా ఎక్కినబండి దిగివచ్చింది. వెంకమ్మ స్థూలశరీరాన్ని ఆ ముగ్గురూ ఆయాసంగా ఎత్తి లోపలకు తీసుకరావడం ఎంతో కష్టమైంది.

భార్యాభర్త లిద్దరూ ప్రయాణాన్ని విరమించారు. రప్పించిన బండిని రవణయ్య తిరిగి పంపించివేశాడు.

ఆ రోజు మళ్ళా వెంకమ్మ మంచంమీదనుంచి లేవనే లేదు. మధ్యాహ్నానికి రవణయ్య డాక్టర్ని తీసుకవచ్చి చూపించాడు.

డాక్టరు తిరిగి చావిట్లోకివచ్చి "పెరాల్సెస్ స్ట్రోక్" అని చెప్పాడు.

రవణయ్య "ఆ" అని నోరావలించి చూశాడు. అది ఆశ్చర్యమో, ఆనందమో, విచారమోకూడా మొగాన్నీ చూసిన డాక్టరు గ్రహించలేక పోయాడు.

దగ్గరున్న కాంతం "ఏం రోగమండీ?" అని అడిగింది.

"పక్షవాతమట" అన్నాడు రవణయ్య.

"పక్షవాతమే!" కళ్ళు పెద్దవిచేసి మరీ రెట్టించింది కాంతం.

ఈ మాటలు విన్న శాంతమ్మ కళ్లనీళ్లు తుడుచుకొని లోపలికి వెళ్లిపోయింది.

మరునాటినుంచి వెంకమ్మకు నోటి మాటకూడా లేదు.

కాంతమే యిప్పుడు గృహయజమాని అయ్యింది. పనిపిల్లను మాటపట్టింపుతో మానిపించి వేసింది. యింటి చాకిరీ అంతా శాంతమ్మతోనే చేయిస్తోంది.

శాంత స్వరూపమైన శాంతమ్మకు చాకిరీ చేయడం బాధగా తోచలేదు. కాని వెంకమ్మ స్థితికి మటుకు లోలోన కుమిలిపోతూవుంది.

ఒకరోజు శాంతమ్మ వెంకమ్మ కాళ్లు ఒత్తుతుండగా, రవణయ్య తల్లిదగ్గరగా వచ్చాడు. వెంకమ్మ శాంతమ్మను చూస్తూ అప్పటికే కళ్ళనీళ్లు గారుస్తోంది.

రవణయ్య చూసి "ఛా! అదేమిటమ్మా! తొందరగా తగ్గిపోతుందన్నాడులే డాక్టరు" అని ధైర్యం చెప్పాడు. ఆమె

దుఃఖ కారణం అది కాదని ఆమెకు తెలుసు. కాని తన ఉద్దేశాన్ని వెల్లడి చేయగల మాట కరువైందని ఆమెబాధ.

రవణయ్యను కూర్చోమని సంజ్ఞ చేసింది. రవణయ్య మంచం ప్రక్కగా క్రింద చతికిలపడ్డాడు. కాంతం కూడా అదే సమయానికి అక్కడకు వచ్చింది. వెంకమ్మ తెలివిగా పది వేళ్ళు చూపించి, అయిదువేళ్ళు శాంతమ్మకు యిమ్మన్నట్లు సంజ్ఞచేసింది.

రవణయ్య భార్య మొగం చూశాడు.

కాంతం వెంకమ్మ దగ్గరగా వచ్చి "నువ్వు చెప్పినట్లే చేస్తా మత్తయ్యా" అంది.

అది దిక్కు లేనిదనీ, మీ కడుపులో పెట్టుక కాపాడాలనీ, కళ్ళనీళ్ళతో, మూగసైగలతో కాంతమ్మను ప్రార్థించింది.

ఈ స్థితి చూసిన శాంతమ్మకు దుఃఖం ఆగలేదు. తనపైగల వెంకమ్మ దయార్ద్ర హృదయానికి శాంతమ్మ అభిమానంతో తలవంచుకుంది. వెక్కి వెక్కి వచ్చే దుఃఖాన్ని పమిటకొంగును కళ్లలో కరిగిపెట్టి ఆపుకోడానికి ప్రయత్నించింది. కాని దుఃఖం ఆగలేదు. అక్కడనించి లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది.

కాలుజారిన నెల్లాళ్ళకే వెంకమ్మ కాలం చేసింది. కాంతం యిచ్చిన వాగ్దానం ఎంతవరకూ సఫలీకృతమాతుందో శాంతమ్మకు తెలుసు.

శాంతి - తనపై చూపే నిరాదరణకు శాంతమ్మ బాధ పడుతూనే వుంది. శాంతమ్మ పెద్దకార్యమయ్యేవరకూ మెసలకుండానే ఉంది.

మరునాడు, భార్యాభర్తల దగ్గర సెలవు తీసుకుని, కట్టుగుడ్డలతో రవిని చంకను వేసుక, తూర్పుదిశగా బయలు దేరింది శాంతమ్మ.

రవణయ్య - శాంతం, వెళ్లే శాంతమ్మను చూస్తూ, ఆమె పిరికి తనానికీ, తమ తెలివి తేటలకీ ఫక్కున నవ్వుకొని మాత్రం ఊరుకున్నాడు.

## 8

ప్రొద్దుక్రుంకేముందు గుంటూరు రవితో చేరుకున్న శాంతమ్మ రాత్రి పది గంటలకుగాని గంగాధర్ జమీందారు భవంతి చేరుకోలేకపోయింది.

దారీ తెన్నూ తెలీని శాంతమ్మకు ఊరు శివారున విశాల ప్రదేశంలో చక్కగా నిర్మించుకున్న ఆ సౌధాన్ని చేరుకోడానికి, గుర్తుచెప్పేవాళ్ళ నిర్లక్ష్యాన్నిబట్టి, చంకను బిడ్డను వేసుక ఊరుచుట్టి తిరిగిరావలసి వచ్చింది.

శాంతమ్మకు అభిమానం ప్రసాదించిన పట్టుదలవల్ల మేనత్త యిల్లు విడిచేప్పుడు కొంగునున్న రూపాయి పావలా

తప్ప, మరేమీ డబ్బు లేకపోవడంవల్ల అంతవరకూ ఆహారం ముట్టనే లేకపోయింది. ఆ రూపాయి పావలా దారి ఖర్చులకు సరిపోయింది.

ఆకలవుతున్న రవికూడా శాంతమ్మ దైన్యపూరిత వదనాన్ని చూసి, ఎక్కువ మారాం చేయలేకపోయినా చీకటిపడిన తర్వాత రెండుసార్లు మాత్రం "బువ్వ" అని అడిగాడు.

"ఇదిగో అన్నయ్య యింటికి వస్తున్నాంగా అక్కడ తిందువుగాని" అని సముదాయించింది.

అన్నయ్య ఏమిటో యిల్లేమిటో రవికి అర్థంకాలేదు. ఏదో వింతను ఎదర చూడగలననే కుతూహలంవల్ల, ఆకలి కొంచంగా మరవగలిగాడు.

ఆ భవనం ముందుభాగాన ఉన్న గేటు దగ్గర శాంతమ్మ చాలాసేపు నిలబడింది. లైటు దివ్యంగా వెలుగుతున్నా, అంతగా జనసంచారం లేకపోవడంవల్ల, అంతా పడుకొని ఉంటారని అనుకొంది.

మెల్లగా ఊచలతో కూర్చిన గేటు ఎదుటకు గెంటింది. 'కీచు' ధ్వనితో గేటు విడివడ్డం "ఎవరు?" అని బిగ్గరగా పిలుపు వినపడ్డం, ఒకేసారి జరిగింది. శాంతమ్మ ఎదుటకు కదలలేక అలాగే నిలబడిపోయింది.

కాపలాదారు గేటు దగ్గరగావచ్చి "ఎవరు?" అని మళ్లీ అదే ప్రశ్న వేశాడు.

"జమిందారుగారున్నారా?"

"ఎందుకూ?"

"పని ఉంది"

విరక్తిగా నవ్వాడు. వెంటనే యిలా అన్నాడు. "నీ గొప్ప పనికి పగలు ఖాళీ లేకపోయిందా? వెళ్లు! పని ఉంటే రేపురా"

శాస్త్రి తెరుచుకున్న గేటు దగ్గరకు వేసే ప్రయత్నంలో ఉన్నాడు.

"తెనాలినుంచి వచ్చాను. ఇక్కడికి వచ్చేటప్పటికి యింత ఆలశ్యమైంది. శాస్త్రి..."

శాంతమ్మ ఆత్రుతగా మాట్లాడేమాటలు పూర్తికాని క్రితమే గేటు దగ్గరగా వేసి

"ఇదెవరిల్లు అనుకుంటున్నావు నువ్వు?"

"గంగాధరంగారిది కదా"

"అబ్బో! పేరుకూడా తెలుసు... జమిందారుగారు మామూలు మనిషిలా ఎప్పుడు బడితే అప్పుడు వచ్చి మాట్లాడరు వెళ్లు."

అని చెప్పి వెనక్కి తిరిగాడు.

"అయ్యా" శాంతమ్మ దీనంగా పిలిచింది.

పనివాడు ఎదుటకు తిరిగి, "ఓాయ్మంటే బుద్ధిలేదూ?" అంటూ బిగ్గరగా అరచాడు.

ఈ కేకకు రవి కేసమన్నాడు. రవిని భుజంపై ఒత్తు కుంటూ "చాలా అవసరమైన పనిమీద వచ్చాను... ఉదయాన్నించి బిడ్డకు తిండిలేదు..."

ఇంకా శాంతమ్మ మాట పూర్తికానిదే "ఓ—ఆలా అని అఘోరించకూడదూ" అన్నాడు.

శాంతమ్మ బాధగా జూసింది.

"వెంకయ్యా! ఎవరూ?"

వెనకనించి గంగాధరంగారి విధవ చెల్లెలు హాలులో నుంచి అడిగింది.

వెంకయ్య వెంటనే సమాధానం యివ్వలేకపోయాడు.

శాంతమ్మ ఆశగా అటు జూసింది.

"ఎందుకూ అనవసరంగా గేదెలా ఆలాఅరుస్తావ్... కాస్త ముద్దపడేసి పొమ్మనమను" అని చెప్పి ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

తనే ఒకధికారిలా నేరస్తులను దూషించే పోలీసు— సబు యినిస్పెక్టర్ని జూసిన వెంటనే సలాంకొట్టినట్లుగా వెంకయ్య తలవంచాడు. ఆమె వెళ్ళిన తర్వాత శాంతమ్మకేసి కోపంగా జూసి "అక్కడే ఉండు, లోపలకు రాకు" అని తిరిగి వెళ్ళిపోయాడు.

అసలు బంగారానికన్నా— బంగారు పూత పూచిన ఇత్తడిముక్క ఎక్కువగా మెరుస్తుంది. ఆ మెరుపులో అసలు

బంగారాన్ని కూడా మరిపిస్తుంది. మరిపించడమే కాదు, నేనే బంగారాన్నని మూడుసార్లు మురుస్తుంది. అయితే బంగారు పూతమాసి అసలు రంగు బయట పడ్డంతోనే మలినమై, పూర్వ అహంకారానికి పశ్చాతాపపడుతూ, ప్రజల కంట పడకుండా ఏ మూలనో పడి ఉంటుంది.

ధనికుల నాశ్రయించినన్నాళ్ళూ పూర్వ స్థితిని మరచి దర్జాను డంబాన్ని ప్రదర్శించే అల్పులగతికీ—పూతమాసిన ఇత్తడి ముక్కకూ అట్టే తేడా లేదేమో.

తిరిగి వచ్చిన వెంకయ్య "తీసుకో" అంటూ గేటు తెరచి చేతులో ఉన్న అన్నంతో నిండిన ఆకును, శాంతమ్మ చేతిలో పడేసి తిరిగి గేటువేశాడు.

"నాకు తెలిసున్నవాళ్లు ఈ వూళ్లో ఎవరూ లేరు..."

"ఇక్కడ ఉండటానికి వీల్లేదు. ఫో! ఫో!" అంటూ గేటు గొండెం వేసి, లైటు స్విచ్చికూడా ఆఫ్ చేశాడు.

అన్నం పెట్టినా బిడ్డకు అంధకారంలో ఆకలి తీర్చగల అవకాశం పోయింది. రోడ్డు ప్రక్కగా వెలుగుతున్న లైటు దగ్గరకు శాంతమ్మవచ్చి రవికి నాలుగు మెతుకులు పెట్టింది. కాని తాను తినలేకపోయింది.

ఆ లైటు స్తంభం ప్రక్కనే బిడ్డతో కూర్చున్న శాంతమ్మ ఆ మేడ కేసి జూసింది. పై భాగాన్ని వెలుగుతున్న లైట్లు, కిటికీ చువ్వలనుంచి కాంతిని విరజిమ్ము తున్నాయి.

తన బిడ్డ సుఖనిద్రలో ఉంటాడని ఆమె ఊహించింది. కాని చలిలో తన తమ్ముడితో యీ అర్ధరాత్రి వీధి ప్రక్క తల వాల్చడానికికూడా తగని స్థలంలో తాను కూర్చున్న సంగతి తన బిడ్డకు తెలిస్తే; ఎంత బాధపడతాడో అని ఆమె మానసిక కల్పనా చిత్రాన్నిజూసి సంతృప్తిపడుతోంది. "అమ్మా" ఆ మేడపైనే ఒక పిలుపు వినిపించింది. అది విన్న కంఠమే! అది రాము పిలుపు! శాంతమ్మ రవిని చంకను వేసుక ఆనందంగా లేచింది.

"ఏం బాబూ?" మరో కంఠం వినిపించింది ఆపైనే! ఆమె అలాగే నిలబడి శ్రద్ధగా వింటోంది.

"నువ్వు లేకపోతే నేను పడుకోను...నా ప్రక్కలో పడుకోవే అమ్మా"

"అమ్మ ప్రక్కలో లేకపోతే; ఒక్క క్షణం నిద్దర పోవు...వస్తున్నా." విసుగ్గా వినిపించిందా మాట.

ప్రశాంత నిశీధంలో—పైనించి వినిపించే ఆ మాటలు, శాంతమ్మ స్పష్టంగా వినగలిగింది. ఈ రెండు సంవత్సరాలలో రాము చక్కగా మాట్లాడ గలుగుతున్నాడు. మరో అమ్మను సంపాదించ గలిగాడు. కాని అసలు అమ్మ గుర్తుంటుందో ఉండదో – ఇదే ఊహిస్తుంది శాంతమ్మ. గుర్తు ఉండదనికూడా ఆమె నిర్ణయించుకొంది. కాని "భగవంతుడా! నా బిడ్డ నన్ను మరచినా పరవాలేదు. వాడు సర్వదా సుఖంగా

జీవించేటట్లు దీవించు బాబూ'' అని ఆర్ద్రకంఠంతో మెల్లగా అంది. ఆ మాతృ హృదయం ఆనంద విషాద సమ్మిళితమైన ఏదో తీయటి వేదన ఆ సమయంలో అనుభవించింది. మెల్లగా బజారువైపునకు దారితీసింది.

క్షోభపడుతున్న వ్యధిత హృదయాన్ని అదుపులోకి తీసుకరాగల అవకాశాన్నికూడా విస్మరించి, కారులప్లాంకు దగ్గర ఉన్న హాలులో, రవిని పడుకోబెట్టి, శ్రమించిన శరీరానికి స్థంభాన్ని ఆధారంగా చేసుకొని, తెల్లార్లూ కంటి మీద కునుకు లేకుండా కూర్చుంది శాంతమ్మ.

సూర్యోదయం కాక ముందే శాంతమ్మ నిద్రాకులిత నేత్రాలతో నిద్దరపోతున్న రవిని భుజంమీద వేసుకొని తిరిగి జమిందారు యింటికి బయలుదేరింది.

ఉదయాన్నే గేటుతెరచి ఉంచడంవల్ల లోపలకు వెళ్ళింది. రాత్రి అటకాయించిన పనివాడు ఎక్కడా కనిపించ లేదు. ఒక దాసి గుమ్మాలు తుడుస్తూవుంది.

గుమ్మం దగ్గరగా వచ్చిన శాంతమ్మను దాసీది ఆశ్చర్యంగా చూచి "తెల్లారందే ధర్మానికి వచ్చావ్ ?" అంది.

శాంతమ్మ తల అభిమానంతో క్రిందకు వాలిపోయింది. దాసీది అలా అనడంలో ముందుగా బాధపడ్డా, కంకరతో కలసిన బట్టలు, ధూళితో మలినమైన తన శరీరం చూసుకున్న మీదట ముష్టిదానిగా పరులకు కనిపించడంలో ఆశ్చర్యం లేదనుకుంది.

“కాస్త తాళిరా! ఛా!”

ఈమాటలు కూడా దాసీయే అంది. అప్పుడు శాంతమ్మ తల పైకెత్తి చూసింది.

ఆమె కళ్ళల్లో నీళ్ళు చూసిన దాసీ నిర్విణ్ణురాలైంది.

“నేను ముష్టిదాన్ని కాదమ్మా!... నా బ్రతుకలా కాలింది” అని శాంతమ్మ గద్గదికంగా అంది. దాసీ మొగంపై పశ్చాత్తాప ఛ్ఛాయలు కనిపించాయి.

“ఎవరికోసం వచ్చారు?”

“జమీందారుగారి కోసం”

దాసీది అంతవరకూ మెట్లపైనుండి మాట్లాడింది. మెట్లుదిగి దగ్గరగా వచ్చింది.

“అమ్మగారితో చెప్పమన్నారా?... మీ పేరు?”

శాంతమ్మ కాస్సేపు ఆలోచించింది. మెల్లగా యిలా అంది “ఎవరితోనూ చెప్పవద్దు...నేను బైటనే ఉంటా” దాసీ మరీ ఆశ్చర్యపడింది.

“మరి జమిందారుగారికోసం వచ్చానన్నారుగా?”

“ఔను...వారితో యిక్కడే మాట్లాడి వెళ్ళిపోతా” దాసీ నిదానించి కాస్సేపు శాంతమ్మకేసి చూసింది.

ఏమనుకుందో ఒక్కసారి నవ్వింది.

శాంతమ్మ కళ్ళనీళ్ళతోనే ఆశ్చర్యంగా చూసింది.

“అమ్మగారికీ విషయం తెలియకపోవడమే మంచిది. అదుగో! ఆ కారుషెడ్ ప్రక్కగా కూచోండి” అని తలతో కారుషెడ్ చూపి, తన పనిలో ఉండిపోయింది.

డాసీ అలా అనడంలో ఉద్దేశమేమిటో శాంతమ్మకు అంతుపట్టలేదు. మెల్లగా వెళ్లి కారుషెడ్ దగ్గర కూర్చుంది. రవిని ఒళ్ళో కూర్చోబెట్టుకొని అలాగే గోడకు చేరగిలపడి కూర్చుంది. రాత్రి నిద్దర లేకపోవడంవల్ల కాస్త కునుకుకూడా పట్టింది.

కారు 'బుర్' మన్న ధ్వని విన్న శాంతమ్మ త్రుళ్లిపడి చూసింది. అప్పటికే చాలా ప్రొద్దు ఎక్కింది. డ్రైవరు కారుని తీసుకవెళ్లి గుమ్మం దగ్గరగా నిలపాడు.

శాంతమ్మ ఆత్రంగా లేచి నిలబడింది.

గంగాధరం ప్రక్కగా రాముని తీసుక కారుదగ్గరకు వచ్చాడు. రాముని శాంతమ్మ ఆ కాస్సేపూ కరువుతీరా చూసింది. సిల్కు బట్టల్లో మిలమిలా మెరుస్తూన్న రాము శాంతమ్మ కళ్ళకు బాల భానుడుగా కనుపించాడు. ఆనందంగా నిట్టూర్చింది. కళ్లల్లో ఆనందబాష్పాలుకూడా నిలచాయి.

"మీరుకూడా రండి నాన్నగారూ" అని జమీందారు చేయిపట్టుకొని రాము లాగుతున్నాడు.

జమీందారు వాత్సల్యపూరితంగా "నువ్వెళ్ళు బాబూ! మళ్లీ పదకొండుగంటలకల్లా వచ్చేస్తావుగా - ఇక్కడేవుంటా" అంటూ రాముని ఎత్తుక కారులో కూర్చోబెట్టాడు.

కారు కదిలింది. గేటుదాటి వెళ్లిపోయింది. అంత వరకూ శాంతమ్మను ఎవరూ గమనించలేదు. జమీందారు వెళ్లే కారును చూస్తూ కాస్సేపు అలా నిలబడిపోయాడు.

శాంతమ్మ జమీందారు ఎదురుగా రాలేక అక్కడే నిలబడి ఉంది.

"మీకోసం ఎవరో వచ్చారు."

దాసీది మెల్లగా స్తంభం వెనకనించి అంది.

"ఎవరూ!" పరిసరాన్నంతా ఆశ్చర్యంగా పరిశీలిస్తూ అడిగాడు జమీందారు.

"అదుగో –"

దాసీది శాంతమ్మ ఉన్నవేపు చూపించి తలుపు వెనక్కి వెళ్ళింది. గంగాధరం అటు చూశాడు. చాలా ఆశ్చర్యపడ్డాడు. మొదట్లో ఎవరో గుర్తించలేదు. అలాగే చూస్తున్నాడు.

శాంతమ్మ, జమీందారు తీక్షణ దృష్టికి కంపించి తల వంచుకుంది.

"ఓ – శాంతమ్మగారా!"

బిగ్గరగా అన్నాడు. ఈ మాటలలో ధ్వనిని బట్టి, జమీందారు భావాన్ని అర్థం చేసుకోడానికి శాంతమ్మ ఊహిస్తూంది.

"లోపలకు రండి"

శాంతమ్మ మనస్సు కుదుటపడింది. మెల్లగా కదిలింది. జమీందారు అక్కడే నిలబడి ఉన్నాడు.

శాంతమ్మ మెట్లు దగ్గరగావచ్చి ఆగింది. రవి మెళుకువగానే ఉన్నాడు. తల్లి చంకనించి క్రిందకు దిగాడు.

"వెంకమ్మగారు బావున్నారా?"

"పోయింది" శాంతమ్మ హీన స్వరంతో చెప్పింది.

ఆ సమాధానం బహుశా రావచ్చును అనే జమిందారు ఆ ప్రశ్న వేశాడు. ఆ ప్రశ్న ఉదయించడానికి శాంతమ్మ ఎదురుగా మలినరూపంతో ప్రత్యక్షం కావడమే.

"పాపం" జమిందారు ఈమాట అని వెనక్కి చూసి "సుబ్బులూ" అని బిగ్గరగా పిలచాడు.

దాసీది వచ్చింది.

"వీరిని తీసుకవెళ్లి అమ్మగారితో చెప్పు...వీరి పేరు శాంతమ్మ అని."

జమిందారు శాంతమ్మకేసి చూసి "దాసీతోవెళ్లండి" అని చెప్పి హాలులోనించి ఉన్న మెట్లు ఎక్కి మేడపైకి వెళ్లి పోయాడు. దాసీ సుబ్బులుతో శాంతమ్మ లోపలకు వెళ్లింది.

---

# 9

జమీందారు భార్య పార్వతమ్మ. ఆమె ఆదరణకు శాంతమ్మ హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది.

శాంతమ్మనీ - రవినీ - స్నానాలు చేయించిన తర్వాత విలువైన కొత్తబట్టలు శాంతమ్మ చేతిలో పెట్టింది.

"ఎందుకండీ!" శాంతమ్మ జంకుతూ అడిగింది.

పార్వతమ్మ మెల్లగా నవ్వింది "నువ్వో కోకకట్టుకొని, అబ్బాయికా బట్టలు తొడుగు"

శాంతమ్మ తిరిగి ఏలాంటి సమాధాన మిస్తే, ఆమెకు తృప్తిగా ఉంటుందో ఆలోచిస్తుంది. తిరిగి శాంతమ్మ తలెత్తే లోగానే పార్వతమ్మ అక్కణ్ణించి వెళ్లిపోయింది.

శాంతమ్మ వెంకమ్మను ఈ సమయంలో హృదయానందంతో తలచకుండా ఉండలేకపోయింది. ఆనాడు తనకు ఆమె యిచ్చిన సలహా బాధాపూరితమైందీ, భయంకరమైందిగా తోచింది. అయితే ఈనాడు జమీందారు యింట్లో పొందే ఆదరణద్వారా, ఆమె సలహా ఎంతో అమూల్యమైందిగా భావించింది. ఎంతకాలం ఈ సంతోషం సుస్థిరంగా నిలచిపోయి ఉంటుందో మాత్రం ఆమె అంచనా వేయలేకపోయింది.

వ్యక్తి లేకస్తుందని తెలిసిన గంగాధరం ఆ రెంటిో సూచన యివ్వడం మంచిపనే అయింది.

శాంతమ్మ మెల్లగా జంకానామీద కూర్చుంది.

"మీరసలు ఎందుకొచ్చినట్లు?"

శాంతమ్మ ఈ మాటవిని స్థంభించిపోయింది. తరువాత సిగ్గుతో తలవంచుకుంది.

గంగాధరం వేసిన ప్రశ్న తీవ్రంగాగాని కఠినంగాగాని ధ్వనించలేదు. కాని దాని భావం ఉదాసీనంగా అవమానకరంగా మాత్రం శాంతమ్మకు స్ఫురించింది.

శాంతమ్మ మాట్లాడలేదు సరికదా తలపైకెత్తికూడా చూడలేదు.

గంగాధరం ఆమెకేసి క్షణం చూచిన మీదట "ఈ ప్రశ్న మీకు బాధకలిగించవచ్చు - కాని మిమ్మల్ని బాధించాలని నా ఉద్దేశం కాదు. మరి మీరు వచ్చిన కారణాన్ని తెలుసుకోవడం నాకవసరమేగా" అన్నాడు.

శాంతమ్మ మెల్లగా తల పైకెత్తింది.

"మా రాముని చూసి వెళదామని..." అంది. గంగాధరం నవ్వాడు. ఈ నవ్వులో కనీ కనిపించని బాధ ఉన్నట్లుగా శాంతమ్మకు వినిపించింది.

"మీరు చూడలేదూ?"

శాంతమ్మ అట్లాగునే చూస్తోంది, సమాధానమీయలేదు.

"కాపులో ఎక్కేముందు చూసినట్టున్నారు"

"అవును..."

"మరి చూశారుగా"

ఈ సమాధానం శాంతమ్మకు చాలా క్షోభ కల్గించింది. గంగాధరం జేబులో చుట్ట తీసికొని, అగ్గిపుల్ల గీసి చుట్ట కాల్చిన తర్వాత, ఆరిపోతూఉన్న అగ్గిపుల్ల కేసి చూస్తూ "తల్లి ప్రేమ" అన్నాడు. శాంతమ్మ అతని కేసి చూసింది.

"కాదనను...కాని తల్లి ప్రేమకన్నా పెంచిన ప్రేమ హెచ్చని ఈ మూడేళ్ళ అనుభవం చెబుతుంది...శాంతమ్మ గారూ! మీకు మరొక అబ్బాయి ఉన్నాడు, మా కసలు సంతానంలేకనే కదా మీ అబ్బాయిని తీసుకున్నది..." మాట్లాడుతునే సోఫామీదనుంచి లేచాడు "భగవంతుడు మనుషుల మనస్సులు ఏలాంటి విచిత్ర పదార్థంతో సృష్టిస్తాడో అర్థం కాదు...ఒకర్ని ఒకరు తెలుసుకున్నామని అనుకోడం కూడా చాలా పొరపాటనిపిస్తుంది. పైగా తన మనస్సును తనే తెలుసుకోలేని దౌర్బల్య మానవుడు పరుల మనస్సులను గుర్తించానని విర్రవీగడం పొరపాటు"

"ఏమిటీ మీరనేది?" విస్మయ స్వరంతో, ఆతని భావం అర్థంగాక శాంతమ్మ ఆందోళనగా అడిగింది. ఈ సారి గంగాధరం శాంతమ్మకేసి చూచాడు. అతని గంభీర ముఖ మండలంపై ఏదో పశ్చాత్తాపవీచిక అటూయిటూ సంశయా స్పదంగా సంచారం చేస్తూంది.

"మీ గురించే కాదు... నా గురించే నేనే అనుకుంటున్నా" మళ్ళీ సోఫామీద కూర్చొని, ఎదుటికి వంగి శాంతమ్మ మొగంలోకి చూస్తూ "ఈ మూడు సంవత్సరాలుగా బిడ్డను చూడ్డానికి మీరు రాకపోవడంవల్ల మిమ్ములను నా మనస్సు శుభాకాంక్షగల మాతృ హృదయంగా అభినందించుకుంది. కాని..." ఇక మాట్లాడలేదు. మళ్లీ యధాప్రకారం కూర్చున్నాడు.

"అలా కోరడం తప్పా?" మనో వ్యధను వ్యక్తం చేసిందా ధ్వని.

"మీరు మరొకటి ఏది కోరినా నేను యింత బాధపడను..."

"చూస్తే—"

"గుర్తిస్తాడు" ఆలోచనగా లేచాడు. మళ్లీ యిలా అన్నాడు "బహుశా గుర్తించకపోవచ్చు...మీరు తల్లని నేను చెప్పచ్చు...అంత మాత్రాన్న మీకువచ్చిన లాభం?" ఆమె మొగంకేసి తీవ్రంగా చూస్తూ ప్రశ్నించాడు. "ఇందువల్ల వచ్చిన నష్టమేమిటో నాకర్థం కావడంలేదు" ఈలాంటి ప్రశ్న శాంతమ్మ వేస్తుందని గంగాధరం ఊహించలేదు. అతని మొగం కాస్త ఎర్రబడింది. కాని వెంటనే నిగ్రహించుకున్నాడు. బాధగా నవ్వాడు.

"నష్టం యిదని నేను వేలుపెట్టి మీకు చూపకపోయినా చాలా నష్టముందని నాకు తెలుసు...నిజంగా

మీరు వాడికి కన్నతల్లి అయితే; ఈ సమయంలో ఈలాంటి కోరిక కోరడం సబబుకాదని గట్టిగా ఆలోచిస్తే మీకే తెలుస్తుంది. తల్లి బిడ్డను గురించి ఏం కోరుతోంది?" కాస్సేపు సమాధానం వస్తుందని చూశాడు. నిశ్శబ్దమే శరణ్యమైంది. మళ్లీ ప్రారంభించాడు "బిడ్డ శ్రేయస్సు...రాముకి పట్టిన అదృష్టం ప్రపంచంలో ఎవరికి పడుతుంది...మీ దగ్గరే రాము ఉంటే, తిండికి కూడా బాధపడి, మురికి గుడ్డల్లో మూలుగుతూ, కటిక నేలలో పడుకొని..."

"బాబుగారూ!" శాంతమ్మ ఉద్వేగంతో మాటలు పూర్తికాని క్రితమే బిగ్గరగా అరచింది. గంగాధరం ఆమె మొగంకేసి చూశాడు. ఆలోచించాడు. ఆమె కళ్ల వెంబడి నీళ్లు కారుతున్నాయి.

"ఏడుస్తారేం...ఏడవద్దు..."

ఆమె కళ్లు తుడుచుకుంది.

"శాంతమ్మగారూ! ఒక పనిచేస్తారా?"

ఆమె ప్రశ్నార్థకంగా చూసింది.

"మీ అబ్బాయిని మీరు తీసుక వెళ్ళిపోగలరా?"

ఈ మాటతో శాంతమ్మ నిశ్చేష్టురాలుగా అయిపోయింది. అత్యాశ్చర్యంగా అతని మొగంకేసి చూసింది. మెల్లగా లేచింది. "నా చిన్నకోర్కెకు మీకింత బాధకలుగుతుందంటే; నేను అడిగేదాన్ని కాను...శలవివ్వండి" రవితో రెండడుగులు ఎదరకు వేసింది.

"ఆగండి" జమిందారు పిలచాడు.

శాంతమ్మ ఆగిపోయింది.

జమిందారు నవ్వాడు. ఆ నవ్వులో విజయగర్వం ఉంది. తాను మాటల ద్వారా శాంతమ్మను ఒక స్థితికి తీసుకవచ్చి; ఆమె కోరిన కోర్కె ఆమెకు తప్పుగా తోచేటట్లు చేశాడు. తోచేటట్లు చేయడమే కాదు, ఆ నిర్ణయాన్నుంచి ఆమె బుద్ధిని మరలింప చేశాడు. మెల్లగా జేబులోనుంచి ఫర్సుతీసి— "శాంతమ్మగారూ" అని పిలచాడు.

ఆమె ఆలాగునే అతనికేసి చూస్తూంది.

"తెలివైన వాళ్లెప్పుడూ ధనాన్ని తిరస్కరించరు..."

ఫర్సులోనుంచి డబ్బుతీసి, కాగితాలు లెక్క పెడుతున్నాడు.

ఈ మాటలో అసత్యం లేదని, వెంకమ్మ పోయిన తర్వాత పరిపూర్తిగా గ్రహించింది. అందుకే శాంతమ్మ మాట్లాడ లేదు.

"పదిహేను వందలు...తీసుకోండి"

శాంతమ్మ మాట్లాడకుండా తీసుకుంది. అంత సులభంగా తీసుకోవడం గంగాధరానికి ఆశ్చర్యం వేయక మాన లేదు.

"వెళతాను"

"మరొక్క మాట"

శాంతమ్మ కసిపోయి చూస్తుంది.

"ఎక్కడికి వెళతావు?"

ఈ ప్రశ్నకు శాంతమ్మ సమాధానం యివ్వలేక పోయింది. అసలు ఆమె ఒక చోటకు వెళ్లాలనే నిర్ణయం కూడా చేసుకోలేదు.

"సరే! మీ యిష్టంవచ్చిన చోటుకు వెళ్లండి...కాని రాము మీ అబ్బాయిగా మాత్రం ఎక్కడా చెప్పద్దు"

ఆమె మాట్లాడలేదు.

"ఏమంటారు?" ఈసారి బిగ్గరగా అరచాడు.

"సరే" మెల్లగా సమాధాన మిచ్చింది.

"ఇక వెళ్ళండి" అధికార పూర్వకంగానే ఆజ్ఞ యిచ్చాడు గంగాధరం. ఆమె ఆ గదినుంచి కదలి రవితో బైటకు ప్రయాణమైంది.

---

# 10

గంగాధరం జమీందారు తండ్రి పేరను ఒక పాఠశాల కట్టించాడు. దానిలోనే రాము యిప్పుడు చదువుకొంటున్నది. ఆ పాఠశాలలో ధర్మయ్య అనే ఉపాధ్యాయుడు సాటి కులస్తుడు కావడంవల్లనూ, మంచివాడుగా పేరు పొందడం వల్లనూ ప్రధానోపాధ్యాయ పదవి నిచ్చి, స్కూలు వ్యవహారా లన్నీ అతనే చూసేటట్లుగా నిర్ణయించాడు గంగాధరం.

ఆరోజు ఉదయము పిల్లలకు ధర్మయ్య శ్రద్ధగా పాఠాలు చెప్పే సమయంలో, శాంతమ్మ రవిని నడిపించుకుంటూ వచ్చింది.

ధర్మయ్య ప్రక్కగా మరో చిన్నకుర్చీమీద కూర్చున్న రాముమీద ఆమె దృష్టిపడింది. రాముకూడా ఆమెకేసి చూస్తున్నాడు.

"ఎవరు మీరు?" ధర్మయ్య అడిగాడు.

ఆమె మాట్లాడలేదు. రాముకేసి అలాగునేచూస్తోంది. ఈవిచిత్ర వీక్షణకు అర్థమేమిటో ధర్మయ్య ఆలోచిస్తున్నాడు.

క్లాసులో ఉన్నపిల్లలంతా శాంతమ్మకేసి ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"మీ కిక్కడేం పని?" మళ్ళీ ధర్మయ్యే తీవ్రంగా అడిగాడు. శాంతమ్మ తేరుకుంది.

"మా అబ్బాయిని తమ స్కూల్లో చేర్పిద్దామని..."

ఆమె ఆ విధంగా ఆలోచించుకునే యిక్కడకు వచ్చింది. వచ్చిన తర్వాత విషయాన్ని మరచి రాముని, ఆప్యాయంగా చూసింది. అలా చూడ్డం తన కెంత నష్టమో; గ్రహించిన మీదట అటు చూడ్డం విరమించింది. రాము మాత్రం అలాగునే చాలాసేపు చూశాడు.

"మీ పేరు?" ఉపాధ్యాయుడు అడిగాడు.

"శాంతమ్మ; మా అబ్బాయి పేరు రవి."

వేసే రెండో ప్రశ్నకు కూడా ముందుగానే సమాధాన మిచ్చింది.

"ఈవూరేనా?" కాదేమోనని అనుమానంతోనే అడిగాడు ధర్మయ్య.

"ప్రస్తుతం యీవూరే" 

"ఎక్కడుంటున్నారు?"

ఈ మాటకు కూడా "ప్రస్తుతం యిక్కడే ఉన్నాను," అని సమాధానం యిచ్చేదేమో; కాని ఆ పదం ఈ పిల్లల ముందు ఎంత అపహాస్యానికి పాత్రమౌతుందో ఆమె గ్రహించింది. ఏమీ సమాధానం చెప్పలేదు.

ధర్మయ్య ప్రక్కగా పెట్టిమీద కూర్చున్న లక్ష్మి ఆ క్లాసులోఉన్న అందరికన్నా చిన్నది. బహుశా నాలుగేళ్లు మించి వుండవు. ఇంత చిన్న వయస్సులోనే ఆ బాల అంత శ్రద్ధగా స్కూల్లోకి రావడం శాంతమ్మకు చాలా ఆశ్చర్యం కలిగించింది.

రవి వైపు లక్ష్మి పెట్టెమీద కూర్చొని కాలుఊపింది. రవికి కోపంవచ్చి కాలుఎత్తి 'తన్నుతా' అన్నాడు.

పిల్లలంతా గొల్లున నవ్వారు. రవి ఏడుస్తూ తల్లిని కౌగలించుకున్నాడు. మళ్లీ పిల్లలు నవ్వారు.

ఇంతవరకూ ధర్మయ్య శాంతమ్మకేసి రాముకేసి చూస్తూ పోలికలు గమనిస్తున్నాడు. రాము పెంపుడు బిడ్డగా ధర్మయ్యకు తెలుసు. కాని ఎవరి బిడ్డో మాత్రం గంగాధరం చెప్పలేదు.

"చూడు నాన్నా!" లక్ష్మి ఆలోచిస్తున్న ధర్మయ్యను చేయిపట్టుక లాగింది.

శాంతమ్మ ధర్మయ్య కూతురుగా వెంటనే గ్రహించింది. ధర్మయ్య కుర్చీలోనుంచి మెల్లగా లేచాడు. శాంతమ్మకేసి చూశాడు. "అమ్మా! ఈ వీధి చివరనే మా యిల్లు. స్కూలు విడిచిన తర్వాత ఇంటికి వస్తాను. అక్కడుండండి... మంచిరోజు చూద్దాం. అప్పుడు మీ రవిని స్కూల్లో వేద్దురు గాని" అని సౌమ్యంగా పలికాడు.

"అలాగేనండి."

ఇక ఎవరికేసి చూడకుండానే, రవిని తీసుకొని స్కూలు వెలుపలకు వచ్చింది.

రాము ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రాము మాట వినాలని శాంతమ్మ కోరిక. తాను చేసిన ఈ సాహసం

జమీందారు దృష్టిలో క్షమించరానిదే కావచ్చు. కాని కడుపుతీపి కన్నవాళ్ళకే తెలుస్తుందనే న్యాయంముందు జమీందారు యిచ్చే శిక్షకూడా శాంతమ్మముందు తేలిపోయింది.

శాంతమ్మ స్కూల్లోనుంచి వెలుపలకు వచ్చింది. ఎదురుగాఉన్న మామిడిచెట్టు క్రింద, తాము ఎక్కి వచ్చిన జమిందారుగారి కారు నిలిపిఉంది. కారుముందు డ్రైవరు కూర్చొని ఏమీతోచక నేలమీద పులీ మేకా గళ్ళు గీస్తున్నాడు.

గీట్లు గీస్తూన్న డ్రైవరు చప్పుడు విని క్రిందగా చూడ్డంలో శాంతమ్మ కాళ్ళు కనిపించాయి. తరువాత రవినీ శాంతమ్మను 'ఏం పని?' అనే భావంతో చూశాడు.

"ఈ కారూ..." శాంతమ్మ సంశయంగా అడిగింది.

"జమిందార్ గంగాధరంగారిది" క్లుప్తంగా సమాధానం చెప్పి మళ్ళీ తన పనిలో నిమగ్నుడయ్యాడు.

అతని ఉదాసీనమైన భంగిమ చూసి శాంతమ్మ మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. వెళ్ళి మామిడిచెట్టు క్రింద కూర్చొని ఉంది.

డ్రైవరు మూడు పులులూ - పన్నెండు మేకలూ - రాళ్ళల్లో ఏరుకొని ఒక్కడే ఆట ప్రారంభించాడు.

శాంతమ్మ దగ్గర్నుంచి రవి మెల్లగా డ్రైవరు దగ్గరకు వెళ్ళాడు. పరధ్యాన్నంగా ఉన్న శాంతమ్మ రవి ప్రక్కనే ఉన్నాడనుకుంది.

డ్రైవరు వేస్చిన రాళ్లన్నీ రవి పాదాల తాకిడితో చెల్లాచెదరై పోయాయి. డ్రైవరు నిప్పులాంటి కళ్ళతో రవికేసి చూశాడు. రవి నవ్వుతున్నాడు. డ్రైవరుకోపం మాయమైంది.

"పులీ మేకా ఆడతావా?"

"ఓ-" రవి చాలా ఉత్సాహంగా సమాధాన మిచ్చాడు. శాంతమ్మ అటు చూసింది. రవి డ్రైవరు ప్రక్కను కూర్చొని ఆటలో పడ్డాడు.

కాస్సేపటిలో రవి పుణ్యమా అంటూ డ్రైవరు శ్రమించి గీచిన గీట్లుకూడా మాయమయ్యాయి.

డ్రైవరికి చాలా కోపం వచ్చింది. వెంటనే లేవదీసి "ఏవమ్మో నీ కొడుకుని జాగర్త పెట్టుకో" అని బిగ్గరగా పిలచాడు. శాంతమ్మ తొందరగా వచ్చి రవిని తీసుకుంది.

"మా చినబాబు కూడా యిలాంటి వెధవ పని చేయడు" అన్నాడు చెరచిన గీట్లు చూపుతూ.

"చినబాబెవరూ?" అంది.

అంతలో స్కూల్లో గంట మ్రోగింది. బిలబిలమంటూ పిల్లలంతా వెలుపలకు వచ్చారు.

డ్రైవరు శాంతమ్మకు సమాధాన మివ్వలేదు.

ధర్మయ్యతో రాము కారు దగ్గరకు వచ్చాడు. ధర్మయ్య ప్రక్కగా లక్ష్మి నిలబడి ఉంది.

రాము కారు ఎక్కి అటువైపు చూశాడు. శాంతమ్మ నిలబడి ఉంది. రాము లేత హృదయం ఎందుకో ఆమెవైపు

లాగుతోంది. ఎక్కడో చూసినట్లు చిన్న మెదడు ఊహించ డానికి ప్రయత్నిస్తోంది.

"ఎప్పుడైనా మాయింటికి వచ్చావా?" ఈ ప్రశ్న శాంతమ్మను చూస్తూ రాము వేశాడు.

శాంతమ్మ మాతృ హృదయం ఒక్కసారి ఉప్పొంగింది. ఆనందబాష్పాలతో నిండిన కనుకొలకులతో ఆలాగే చూస్తోంది. సమాధాన మివ్వలేదు.

రాము మొగం చిట్లించి మళ్లీ అడిగాడు "నన్నెరుగు దువా?" ఈ మాటకు కూడా సమాధాన మివ్వలేదు.

ప్రక్కనున్న రవి కారులోఉన్న రాముకేసి చూస్తూ- "మా అమ్మ" అని దగ్గరకు చేరాడు.

శాంతమ్మ రవిని చంకను వేసుకుంది. రాముకేసి చూస్తూ - "నిన్నసలు ఎరగను బాబూ" అంది.

రాముకి చాలా నిరుత్సాహం కలిగింది. తన్నుఎరగని వాళ్ళు ప్రపంచంలో లేరని అతని ఉద్దేశం.

"మరి నాకేసి ఎందుకాలా చూస్తావ్?" కొంచం కోపంగా అడిగాడు.

ఈ మాట సకారణమైందే, అయితే శాంతమ్మ సమాధానం యివ్వలేదు సరికదా, భయంగా వెనక్కి తిరిగి వెళ్లిపోతోంది.

రాము నవ్వాడు. కారు స్టార్టు అయింది. కారు కదలి వెళ్ళిపోతుంటే; రవి - రాముకేసి రాము రవికేసి చూసుకుంటూనే ఉన్నారు.

"అమ్మా"

వెళ్ళే శాంతమ్మను ఆగేట్లు చేసింది. ఉపాధ్యాయుడు ఆప్యాయంగా పిలచిన పిలుపది. శాంతమ్మ వెనక్కి తిరిగి వచ్చింది.

"మా యింటికి వస్తారా?" అన్నాడు ధర్మయ్య.

"నడవండి" శాంతమ్మ అంది.

శాంతమ్మ మనఃస్థితి యిప్పుడు చాలా విచిత్రంగా వుంది. ఏం చేస్తోందో - ఏం చేయాలో నిర్ణయం లేదు. ఆమె మనస్సులో ఒక ఉత్కంఠ ఏర్పడింది. హృదయం బాధతోనూ, సంతోషంతోనూ ద్వంద్వ యుద్ధం చేస్తోంది. ఏడవాలనీ ఉంది, నవ్వాలనీ ఉంది. కాని ఏదో చేయకూడదని కూడా లేకుండా పోలేదు. మౌనంగా ధర్మయ్య వెనక రవితో వెడుతోంది. ధర్మయ్య చంకను ఉన్న లక్ష్మి, రవిని కోపంగానూ తీవ్రంగానూ చూస్తూంది. రవి ఆమెను మధ్యమధ్య వెక్కిరిస్తున్నాడు.

పేరుకు తగ్గ మనుషులు ప్రపంచంలో బహు తక్కువగా కనిపిస్తారు. కొన్ని పేర్లు తల్లి తండ్రుల అధికారాశను, మరికొన్ని పేర్లు వాళ్ళ విశాల భావాలను, ఇంకా కొన్ని వాళ్ళ వైరాగ్య భావాన్ని స్ఫురింపచేస్తాయి.

అయితే ధర్మయ్య పేరును పెట్టడంలో తల్లి తండ్రులు ఏవిధమైన వక్రగతినీ పొందలేదని, ఆయన ధర్మనిష్ఠనూ మానసిక సంపత్తినీ గ్రహించినవాళ్లు తప్పక అనుకుంటారు.

ధర్మయ్య భార్య గతించి మూడు సంవత్సరాలు కావచ్చింది. లక్ష్మికి సంవత్సరం నిండకమునుపే భార్యా వియోగాన్ని పొందిన ధర్మయ్య మళ్ళీ పెళ్లి అనే మాట లేకుండా స్వయంపాకం చేసుకుంటూ బిడ్డను పోషిస్తున్నాడు. మిత్రు లెవ్వరన్నా పెళ్ళివిషయం ప్రస్తావిస్తే; మ్లానంగా ఒక నవ్వు నవ్వి మాత్రం ఊరుకునేవాడు.

శాంతమ్మతో ధర్మయ్య యింటికి చేరుకున్నాడు. లక్ష్మిని దింపి యింటితాళం తీస్తుంటే శాంతమ్మ ఆశ్చర్యంగా చూస్తూ "ఇంట్లో ఎవరూ లేరూ?" అని అడిగింది.

"ఇదిగో నా లక్ష్మి నేనూ ఉన్నాం" అని మాత్రమే సమాధాన మిచ్చాడు.

అంతా లోపలకు వెళ్లారు. అది చిన్న పెంకుటిల్లయినా-ఆడదక్షత లేకపోయినా ఇంటిలోపల ఎంతో పరిశుభ్రంగా ప్రతి వస్తువూ తీర్చిదిద్దినట్లుగా వుంది.

లక్ష్మిని ఒళ్లో కూర్చోబెట్టుకొని ధర్మయ్య ఒక వాలు కుర్చీమీద కూర్చున్నాడు. శాంతమ్మను చూసి "మీ రలా కూర్చోండి" అంటూ ప్రక్కగా ఉన్న బల్లను సంజ్ఞతో చూపించాడు.

"మరి మీ భోజనం?" శాంతమ్మ అలాగే నిలబడి అడిగింది.

"భోజనం తరువాత. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" అన్నాడు. ఈ మాటల్లో ఏదో పట్టుదల

ఉన్నట్లుగా శాంతమ్మ ఊహించింది. భయపడుతూ బల్లమీద కూర్చొంది. ప్రక్కగా రవిని కూర్చోబెట్టుకుంది.

"నాను మీ కేమవుతాను ?" మెల్లగా అడిగాడు.

శాంతమ్మ భయాశ్చర్యాలతో చూసింది.

రవి క్రిందకు దిగి లక్ష్మిని "రా" అని పిలచాడు. ధర్మయ్య లక్ష్మిని క్రిందకు దించాడు. ఇద్దరూ కలిసి వంట వసారాలోకి వెళ్ళారు.

శాంతమ్మనుండి సమాధానం రాకపోవడం ధర్మయ్య ఊహ నిరాధారం కాదని నిర్ణయించుకోడానికి ఎక్కువ కాలం వినియోగించ లేదు. "మీ అబ్బాయా ?" మళ్ళీ అదే ధ్వనిలో అన్నాడు.

"మీ కేలా తెలిసింది ?" కొంచం భయంగా - ఆత్రంగా తలెత్తి ప్రశ్నించింది.

"మీవల్ల."

"నావల్లా ?"

"నీ హృదయ వేదన చెబుతోంది...... నాదగ్గర దాచకు చెల్లాయీ!" అన్నాడు సరళంగా.

ఆ చెల్లాయి అనే పదం ఆమె మనస్సు ధర్మయ్యను సన్నిహితం చేసుకోగలిగింది. చిన్ననాడే పరారైన అన్న గారు గుర్తుకొచ్చాడు. చెమ్మగిల్లిన కళ్ళతో ధర్మయ్యను చూస్తూ "మీరు తెలుసుకున్న రహస్యాన్ని ఎక్కడా వెల్లడి చేయొద్దు" అంది.

"ఏం?" ఆశ్చర్యంగా అడిగాడు.

ఆమె జరిగిన తన గాథను యావత్తూ ధర్మయ్యకు విపులీకరించి చెప్పింది.

ధర్మయ్య అంతా విని బరువుగా నిట్టూర్చి "మరి ఎక్కడికి వెళ్లాలని నిశ్చయం?" అని అడిగాడు.

"గంగాధరంగారు కూడా ఇలాంటి ప్రశ్నే వేశారు; కాని, నేనేం సమాధానం చెప్పలేకపోయాను."

"దాని కేమన్నారు?" ఆత్రంగా అడిగాడు.

"ఎక్కడున్నాసరే; రాము మాత్రం నీ బిడ్డ అని చెప్పొద్దు అన్నారు" అని సమాధాన మిచ్చింది.

ధర్మయ్య కుర్చీమీదనుంచి లేచి "సరే! ఇది నీ అన్నయ్య యిల్లు. ఇక్కడుండటానికి నా అభ్యంతరం లేదు. కాని మేనగోడలి బాధ్యత నీది" అన్నాడు.

అప్పటికే శాంతమ్మకూడా లేచింది. "అన్నయ్యా... నీ ఋణాన్ని..." మాట పూర్తికాని క్రితమే "వద్దు, వద్దు ఒకళ్ల కొకళ్ళు ఋణస్తులు కావడం నా కిష్టం లేదు..." అంటూ రెండడుగులు వేసి "లక్ష్మీ" అని పిలచాడు.

పిల్లలిద్దరూ అప్పుడే స్నేహితులైపోయారు. లక్ష్మీ రవీ కూడా వంటగదిలోనుంచి మసిపూసుకు వచ్చారు.

"ఛీ! ఛీ! ఏమిటమ్మా యిది" ధర్మయ్య లక్ష్మిని ఎత్తుక ఒళ్లు దులుపుతున్నాడు.

"ఆ అబ్బాయి" తన చిన్ని వేలితో కవిని చేరస్తూనుగా ఫిర్యాదు చేసింది.

"అబ్బాయి కాదమ్మా - బావ!" అన్నాడు.

"బావ" చప్పట్లు చరుస్తూ ఉత్సాహంగా నవ్వుతూ అంది లక్ష్మి. ఉన్న భోజనమే నలుగురూ తిన్నారు.

ధర్మయ్య చూపిన సామానులు తీసుక సాయంత్రం వంట ప్రయత్నానికి శాంతమ్మ ఉపక్రమించింది.

శాంతమ్మకు ధర్మయ్య అంత తొందరగా తన యింట్లో అవకాశం యివ్వడం ఆమెకు చాలా ఆశ్చర్యంగా తోచింది. అయితే ధర్మయ్య మాత్రం మనుష్యుల మొగాలు చూడ్డం తోనే వాళ్ల చిత్తప్రవృత్తిని తెలుసుకోగల శక్తి మొదట్నుంచీ అతనిలో వుంది. కాకుండా శాంతమ్మ పుట్టింటి వారూ - ధర్మయ్య ఒకే యింటిపేరు గలవాళ్ళు కావడం, ఆమె చెప్పిన బంధువుల పేర్లవల్ల అంత దగ్గిర గాకపోయినా తనకు శాంతమ్మ దూరపుచుట్టం కావడం జరిగింది.

లక్ష్మి భవిష్యత్తుకోరిన ధర్మయ్యకు, సద్వర్తనంగల శాంతమ్మ చేతులో పెరగడం చాలా సంతుష్టికరమైన సంగతి.

ఆనాటినుంచీ, ధర్మయ్య శాంతమ్మ అన్నాచెల్లెలుగా ఆ ఇంటిలోనే ఉంటూ, సంతుష్టిగా జీవనోపాధి చేస్తున్నారు.

# 11

రోజులు గడుస్తూనే ఉన్నాయి. ధర్మయ్యగారింట్లో శాంతమ్మ సంతృప్తిగానే జీవిస్తోంది.

ధర్మయ్య కర్మ జీవితం చాలా నిర్దుష్టంగానూ, ఆదర్శం గానూ శాంతమ్మకు గోచరిస్తూంది. రానురాను అతనిపట్ల శ్రద్ధాభక్తులు ఆమెలో పెంపవుతూ ఉన్నాయి.

కాలం విలువ తెలుసుకున్న ధర్మయ్య కార్యక్రమాల్లో నియమం తప్పక స్నానపాన జపాదుల దగ్గర్నుంచి జాగ్రత్తగా సంచరించడంతో శాంతమ్మకు ఒక గురుభావం పాతుకు పోయింది.

నెల్లాళ్ళు గడిచిన తర్వాత శాంతమ్మ, కుర్చీలో కూర్చుని ఏదో చదువుకుంటున్న ధర్మయ్య దగ్గరగా వచ్చింది.

ధర్మయ్య చూసి "ఏవమ్మా?" అని అడిగాడు.

ఆమె ఏదో చెప్పాలని సంశయిస్తున్నట్లుగా అతను గుర్తించాడు. "అలా బల్లమీద కూర్చో" అన్నాడు.

శాంతమ్మ కూర్చుంది "అన్నయ్యా" అంది.

పుస్తకం ప్రక్కకుపెట్టి ఎందుకన్నట్లు చూశాడు.

"ఈ యాభై రూపాయలూ నీ దగ్గరుంచు."

మడతపెట్టి చేతులో ఉంచిన పదిరూపాయల నోట్లు యివ్వబోయింది.

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఖర్చు నిమిత్తం."

దాంతో ధర్మయ్య అర్థంచేసుకున్నాడు. "చెల్లెలుకు పెట్టిన తిండికి చార్జి తీసుకొనే స్వార్థం యింకా పుట్టలేదమ్మా" మెల్లగా కుర్చీమీదనుంచి లేచాడు. "అంతగా అవసరమైతే నేనే అడుగుతాలే" పుస్తకం తీసుకు తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఉదయం స్నానమైన తర్వాత పూజా గదిలోకి వెళ్ళిన ధర్మయ్యకోసం శాంతమ్మ నిరీక్షిస్తూంది.

ధర్మయ్య వెలుపలకు వచ్చాడు.

"రవి చాలా అల్లరిచేస్తున్నాడన్నయ్యా"

"ఏం చేయమంటావు?"

"లక్ష్మితోబాటు బడికి తీసుక వెళ్లు."

ధర్మయ్య నవ్వాడు "వాడి లక్షణాలు చూస్తే సరస్వతి వాడికి చాలా విరోధురాలుగా కనిపిస్తుంది...సరే."

ఆ రోజు పట్టి బలవంతంమీద రవిని ధర్మయ్య పాఠశాలకు తీసుక వెళ్ళాడు.

రవి వేరే కూర్చోడానికి యిష్టపడలేదు. లక్ష్మి ప్రక్కనే స్థావరం ఏర్పర్చుకున్నాడు. ధర్మయ్య ఓనామాలు వ్రాసి యిస్తే; శ్రద్ధగా మాత్రం తీసుకున్నాడు. కాస్సేపు దిద్దిన తర్వాత చేయిలాగి పలక ప్రక్కకు గిరాటు వేశాడు రవి.

స్కూల్లో పిల్లలంతా గొల్లున నవ్వారు. కాని పలక బ్రద్దలవ్వలేదు. లక్ష్మి పలకతీసి "తప్పు! అక్షరాలు దిద్దాలి" అని చెప్పింది.

రాము రవికేసి చూస్తున్నాడు. రవికూడా ఒకటి రెండుసార్లు చూశాడు.

"ఏమండీ మాష్టారూ, ఆరోజు కారుదగ్గర కనిపించిన అబ్బాయి కదూ?" అని రాము అడిగాడు.

"అవును బాబూ మా చెల్లెలుగా రబ్బాయి" అని ధర్మయ్య సమాధాన మిచ్చాడు.

మాష్టారు దగ్గర బంధువు అనడంతోనే రాముకి రవిపట్ల శ్రద్ధ కలిగింది.

ఔట్ బెల్ కొట్టారు.

పిల్లలంతా వెలుపలకు వచ్చారు.

మామూలు ప్రకారం లక్ష్మీ రామూ కారు దగ్గరగా వెళ్లారు. రవికి చాలాకోపం వచ్చింది. బుంగమూతి పెట్టుకు స్కూలు ప్రక్కనే కూర్చున్నాడు.

లక్ష్మి తిరిగిచూసి 'బావా' అని పిలిచింది.

రవి మాట్లాడలేదు. లక్ష్మి పరుగునవచ్చి "కారు ఎక్కుదాం, రా" అని చేయిపట్టుక లాగింది.

"వెధవ కారు! నేను రాను."

ఈ మాటలు రాము విన్నాడు. తన కారుని దూషించడం చాలా కష్టమనిపించింది.

"నెత్తిన కాదూ? మళ్ళీ ఆ మాటన్నావంటేనా?" జాగ్రత్త అనే భావం వచ్చేటట్లు చూచాడు.

రవి చురుగ్గా లేచాడు "ఆ మళ్ళీ అంటాను, నెత్తిన కాదు!" అన్నాడు.

రాము మీదకు వచ్చాడు. లక్ష్మి రాము చేతులు పట్టుకొని "మా బావ! కొట్టకు" అని ప్రాధేయపడింది. "లక్ష్మి చెప్పింది కాబట్టి ఊరుకున్నా- నే నెవర్నో తెలుసా?" భుజాలు ఎగరేసి నిర్లక్ష్యంగా నవ్వాడు.

మళ్ళీ బెల్ కొట్టారు. పిల్లలంతా బిలబిలా స్కూల్లోకి వెళ్ళిపోయారు. రవి చాలా కష్టంమీద లక్ష్మి పట్టుమీద మళ్ళీ క్లాసులోకి వెళ్ళి కూర్చున్నాడు. రాము అంటే మాత్రం రవికి చాలా కష్టంగానే ఉంది. ఒకటి రెండుసార్లు కోపంగా కూడా చూచాడు.

స్కూలు విడిచిపెట్టారు. రవి చిన్న రాయితీసుకొని జాగర్తగా ఉంచాడు. రవికేసి చూస్తూ నిర్లక్ష్యంగా వెక్కిరిస్తూ పోతున్న రాముమీద విసరాడు ఆ రాయి.

రాము తలకు తగిలి "అబ్బా!" అన్నాడు. రవి యింటికి దౌడుతీశాడు.

ధర్మయ్యా కళ్ళెదురుగానే తలవని తలంపుగా ఒక క్షణంలో జరిగిపోయిందా కార్యం.

రాము నెత్తినుంచి రక్తం కారుతూంది. లక్ష్మి ధర్మయ్య మరికొందరు పిల్లలు రాము చుట్టూ చేరారు. ధర్మయ్య కండువా చించి కట్టు కట్టాడు.

డ్రైవరు కోపం ఆపుకోలేక ఆ కుర్రవాణ్ణి పట్టుకోవానికి పరుగెత్తాడు. తిన్నగా వెళ్ళి రవి ధర్మయ్యగారింట్లోకి దూరి పోయాడు.

శాంతమ్మ గుమ్మంలోకి వచ్చేటప్పటికి డ్రైవరు రొప్పుతూ రొజుకుంటూవచ్చి "వాడేడీ?" అని ఒగురుస్తూ అడిగాడు.

"ఎవరూ?"

"ఆ - మీ కుర్రాడు...మా చినబాబుమీద రాయి విసిరాడు... రక్తం! రక్తం!..."

"రాము మీదా?"

"ఆఁ!" డ్రైవరు సమాధాన మిచ్చాడు.

శాంతమ్మ మరేమీ సమాధానం చెప్పలేదు. తిన్నగా పాఠశాలవైపు పరుగెత్తింది.

డ్రైవరు యింట్లో ప్రవేశించాడు. యిల్లంతా గాలించాడు. రవి కనిపించలేదు. మంచం క్రింద దాక్కుని రవి తెలివి తేటలుగా అతని దృష్టినించి తప్పించుకొంటున్నాడు.

శాంతమ్మ రాముదగ్గర చేరేటప్పటికి రాము కూర్చొని ఉన్నాడు. శాంతమ్మకేసి చూశాడు. "మీ అబ్బాయే కదూ?" అని అడిగాడు. శాంతమ్మ తల పంకించింది.

ప్రథమ మొత్తంమీద విజయాన్ని సాధించాడు. రవిని బలవంతంగా పట్టుకొని, ఏడుస్తున్నా రక్కుతున్నా లక్ష్య పెట్టక లాక్కొచ్చి రాముముందు పడేశాడు.

కోపంతో మండిపోతున్న రాము రవిని ఒక్క చెంప పెట్టు పెట్టాడు. శాంతమ్మ అడ్డువచ్చి ప్రాధేయతగా చూసింది.

“నువ్వు మంచిదానివి కాబట్టి ఊరుకున్నా - లేకపోతే చంపేద్దును” అని కారెక్కి “నే నెవ ర్ననుకుంటున్నావో - హుం!” అన్నాడు.

ధర్మయ్య కూడా యీ లోపానికి జమీందారు ఎదుట సవినయంగా సమాధానం చెప్పడానికి లక్ష్మితో సహా వెనక సీటులో కూర్చున్నాడు. ఏడుస్తూన్న రవిని చూసిన శాంతమ్మకు జాలి కలగ లేదు. అక్కడున్న చిన్నపుల్ల తీసుకొని “పెద్ద వాళ్ళను ఎప్పుడూ కొట్టవుకదా!” అని రవిని కొడుతూ వుండగా రాము కారు దిగి “ఏడుస్తున్నాడు. యిక కొట్టద్దు. నేను కొట్టానుగా” అని పెద్దమనిషిలా వచ్చి సముదాయించాడు, ఆ ముద్దుమాటలు చూసిన శాంతమ్మకు ఎందుకో వుద్వేగంతో దుఃఖం పొర్లు కొచ్చింది. హఠాత్తుగా రాముని ఎత్తుకొని కళ్ళ నీళ్ళతో, హృదయాని కద్దుకుని చెక్కిళ్ళు ముద్దు పెట్టుకుంది. రాము ఆ సమయంలో ఏదో ఆనందంలో మంత్ర ముగ్ధుడుగా అయిపోయాడు.

"చెల్లాయి" ఈ మాట బిగ్గరగా వినిపించింది. శాంతమ్మ ధర్మయ్యకేసి చూసింది. రాముని క్రిందకు దింపింది. కళ్ళనీళ్ళతో రవిని ఎత్తుక యింటివైపు వెళ్ళిపోయింది.

తిరిగి ధర్మయ్య యింటికి వచ్చేటప్పటికి పన్నెండు గంటలు దాటింది. అంతవరకూ శాంతమ్మ భయంతోనూ క్షోభతోనూ నిండిన హృదయంతో ఎదురుచూస్తూంది.

"ఏం జరిగిం దన్నయ్యా?"

యింటికి వచ్చిన ధర్మయ్యను శాంతమ్మ ఆత్రంగా అడిగింది.

నెత్తినున్న తలపాగా తీసి వాలుకుర్చీ కమ్ముకు తగిలించి, చెమట తుడుచుకుంటూ కుర్చీలో చతికిలబడ్డాడు. "కాస్సిని మంచినీళ్ళియ్యమ్మా" అన్నాడు. శాంతమ్మ మంచినీళ్లు తీసుకవచ్చింది. మంచినీళ్లు తాగిన తర్వాత "ముందు లక్ష్మికి అన్నం పెట్టు" అటు యిటూ చూసి "రవి ఎక్కడ?" అని అడిగాడు.

"నిద్దరపోతున్నాడు" అని గదికేసి చూసింది.

"నాన్నా! నువ్వుకూడా తింటేనేగాని తినను" అని మారాం చేసింది లక్ష్మి. జమీందారుగారింట్లో రాముద్వారా లక్ష్మికి ముట్టిన లడ్డుండల పొట్లం విప్పుకుంటూ వేరే మూలను కూర్చుంది.

ధర్మయ్య బరువుగా నిట్టూర్చి "రాము నిజంగా నీ పెద్దకొడుకేనమ్మా?" అన్నాడు.

కాదని ధర్మయ్యకు అపనమ్మకం లేదు. కాని యీ గండాన్నంతీ, తనని శాంతమ్మనూ ఏలా కాపాడేదో చెప్పడానికి ముందు ఆ మాటన్నాడు.

"అయినా నువ్వు అట్లా చేయడం బాగుండలేదు" అన్నాడు కాస్త విరక్తిగా.

"ఎట్లా?" విస్మయంతో ప్రశ్నించింది.

"అట్లా ఎత్తుకోవటం, ముద్దాడటం..." అంతటితో ఆగిపోయాడు ధర్మయ్య.

"నిజమే! క్షమించు" శాంతమ్మ తలుచుకుని సిగ్గుతో తల వంచుకుంది. ఆమె ఎందుకలా చేసిందో ఆలోచిస్తోంది.

"నీ కొడుకే కావచ్చు...కానన్నట్లు ప్రవర్తించాలని కదా నువ్వొప్పుకున్నది. యీలా జరిగిందని తెలిస్తే; నువ్వు ఉండటం మాట అటుంచి నా ఉద్యోగం ఏమౌతుంది?" శాంతమ్మ తల వంచుకునే వుంది. శాంతమ్మ కంటినుండి నేల మీద రెండు కన్నీటిబిందువులు పడ్డం ధర్మయ్య గమనించాడు.

"ఛా! అదేమిటీ?...ఇప్పుడాలాంటిది ఏమీ జరగలేదులే...సంతోషించవలసిన సమయం" అన్నాడు.

కళ్లు తుడుచుకొని శాంతమ్మ ఏం జరిగిందన్నట్లు తల ఎత్తి చూసింది.

ధర్మయ్య యీలా చెప్పాడు.

"బాటలో రాము అడిగాడు "ఆమె పిచ్చిదా మాస్టారూ" అని. కాదని చెప్పలేదు గాని 'నిన్ను చూస్తే ఆమె కెంతో ముద్దు' అన్నాను. దానికి రాము "నిజమే!

ఆమె చాలా మంచిది" అని సమాధాన మిచ్చాడు. ఆ తర్వాత నెమ్మదిగా అడిగాను "మరి మీ నాన్నగారితో ఏం చెబుతావ్?" అని. కాసేపు ఆలోచించి "ఏమన్నా చెబితే ఆమె నన్ను చెడ్డవాడనుకుంటుందా?" అని అడిగాడు. నేను, "చెడ్డవాడనుకోవడం అటుంచి నిజం చెపితే మీ నాన్న ఆమెను ఈసడించి గెంటేస్తారేమో" అన్నాను. రాము కాసేపు ఆలోచించాడు. అతని మొగంలో బాధ కనిపించింది. ఎదరకు చూసి "ఏ డ్రైవర్" అని పిలిచాడు.

"సార్" అన్నాడు కారు నడుపుతూనే డ్రైవరు.

"స్కూలు దగ్గర జరిగిన గొడవ నాన్నగార్కేం చెప్పకేం?" అన్నాడు. "సార్" అని డ్రైవరు కారు నడిపించుకు పోతున్నాడు. రాము క్రిందకు దిగగానే, ఎదురు వచ్చిన జమిందారు, రాము తలకట్టు చూసి "ఏమిటి మాష్టారూ ఇది" నా కేసి చూస్తూ కోపంగా అడిగాడు.

రాము నవ్వుతూ తండ్రికి సమాధాన మిచ్చాడు "మాష్టారు ఏమీ ఎరుగరు నాన్నా - ఔట్ బెల్ కొట్టిన తర్వాత, పరుగు పరుగున వస్తుంటే కాలుజారి పడ్డాను, చిన్నరాయి తలకు తగిలింది...పాపం మేష్టారు కండువా చింపి కట్టు కట్టారు" అని చెప్పాడు. "అప్పటికి నా ప్రాణాలు చేరుకున్నాయమ్మా" అని ధర్మయ్య కుర్చీమీదనుంచి లేచాడు.

రాముని ఆయుష్మంతుడుగా కమ్మని శాంతమ్మ హృదయం ఆశీస్సులిచ్చింది. సంతోషంగా నిట్టూర్చి పైకి లేచి వంట గదిలోకి వెళ్ళిపోయింది.

# 12

ఒక్క పూటలో పాఠశాలకు స్వస్తి చెప్పిన రవి యింటి పట్టుతిరక్క రోజుకి ఒకటి రెండు తగువులు తీసుక వస్తున్నాడు. శాంతమ్మ సహనశక్తికూడా రవి దుశ్చేష్టల ముందు సన్నగిల ప్రారంభించింది.

ధర్మయ్య రాత్రిపూట రవికి చదువు చెప్పడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. అందుచేత రవి విషయంలో ప్రస్తుతం ఎక్కువ శ్రద్ధతీసుకోడానికి కాలాన్ని వృథా చేయదలచలేదు.

ఒకరోజు పక్కింటి మహాలక్ష్మి ఎడబిడ్డను చంకను వేసుకవచ్చి శాంతమ్మకు ఆ బిడ్డ వీపుని చూపిస్తూ—"ఇంత దుండగుణ్ని కన్నా వేమిటమ్మా?" అని అడిగింది. శాంతమ్మ విస్తుపోయి చూసింది. ఆ బిడ్డ వీపుమీద రక్కులు కనిపించాయి. పిల్ల మెల్లగా మూల్గుతూవుంది.

"క్షమించమ్మా! చంటిపిల్లాడు. భయం చెబుతా" అని ప్రాధేయతగా అంది శాంతమ్మ.

మహాలక్ష్మి చీత్కారం చేస్తూ "ఈ పిల్ల ఏమన్నా బిడ్డల తల్లా?...ఇదిగో నమ్మా మావారసలు మంచివారు కారు. మరి జాగ్రత్త! ధర్మయ్యగారి మొగంచూసి వెళుతున్నా" రోజుకుంటూ వెళ్లిపోయింది.

శాంతమ్మ నిద్రోతున్న మహాలక్ష్మిని చైతన్య రహితంగా కాసేపు చూసింది. తరువాత రవి గురించి జాగ్రత్త పెట్టిన వేపబెత్తం మూలలోనించి తీసి, అన్నంతింటున్న రవిని భయపెట్టడానికి లోపలకు వెళ్ళింది.

సగం అన్నంతిని విడిచిపెట్టిన కంచం తప్ప, అక్కడ రవి లేడు. పొరిగింటావిడ మాటలు విన్న రవి అక్షణాన్నే దొడ్డివైపునకు ఉడాయించాడు.

శాంతమ్మ దొడ్డిలోఉన్న మామిడిచెట్టుకేసి చూసింది. పెద్దవాళ్లు ఎక్కడానికే వెనుకాడే ఆ చెట్టు, తప్పుచేసినప్పుడల్లా రవికి స్థావరం యిస్తుంది. ఆ కొమ్మల్లో తల్లికి కనిపించకుండా దాక్కున్నాడు.

"రవీ" అని పిలచింది శాంతమ్మ.

మనిషి కనిపించకపోయినా, ఆకులు కదిలాయి. రవి ఉన్నట్లుగా శాంతమ్మకు అదేగుర్తు.

"దిగిరా" మళ్ళీ పిలచింది.

"కొడతావ్—" రాగంతీస్తూ సన్నగా అన్నాడు.

"వస్తావా రావా?"

"నేనురాను" బిగ్గరగా నిక్కచ్చిగా చెప్పాడు రవి.

"సరే" చెట్టుకేసి కోపంగాచూసి, విసుగ్గా లోపలకు వెళ్ళిపోయింది శాంతమ్మ.

మళ్ళీ కనుచీకటిపడేవరకూ చెట్టుదిగిరాలేదు రవి. అంతా పడుకునేవరకూ అటూ యిటూ తిరిగి రాత్రి పది గంటలకు మెల్లగా వంట గదిలోకిచేరి ఆకలి కావడంవల్ల కంచాలు తడుముకున్నాడు.

ఒక కంచంలో అన్నం కూరలూ పెట్టి మూతవేసి ఉంచడంవల్ల, తల్లి దయకు చంకలు కొట్టుకొని కంచందగ్గర కూర్చున్నాడు.

శబ్దంవిన్న శాంతమ్మ మెల్లగా మంచంమీదనుంచి లేచింది. మంచంకిందుగా ఉన్న బెత్తంతీసి వంటగది తలుపు ప్రక్కకు వెళ్ళి రవిని తొంగిచూసింది.

పరిసరాలు భయంగాచూస్తూ అన్నంతింటున్న రవిని చూసేసరికి శాంతమ్మ ముందుకు వెళ్ళలేకపోయింది. వెనక్కు తిరిగివచ్చి బెత్తం మామూలుచోట పెట్టి, మంచంమీద కూర్చొని గట్టిగా నిట్టూర్చి మెల్లగా పడుకుంది.

రవి తన పనిపూర్తి అయిన తర్వాత పిల్లి అడుగులు వేసుకుంటూ తల్లి మంచం దగ్గరకువచ్చి, నిద్రపోయిందో లేదో అని మొగంలో మొగంపెట్టి చూడ్డంలో, శాంతమ్మచేయి వెళ్లి రవిని పట్టుకుంది.

“కొట్టకమ్మోయి” ఇల్లు ఎగిరేంత బిగ్గరగా అరచాడు. ఈ కేక విని చదువుకుంటోన్న పేపరు ప్రక్కకుపెట్టి ధర్మయ్య ఆ గదిలోకి వచ్చాడు.

శాంతమ్మ కొట్టుకుంటూనే "ఎప్పుడూ తగువులు తెచ్చుకొస్తావు కదా!" అని రక్తం చూసి భయపడుతోంది.

"శాంతమ్మా" అని ధర్మయ్య పిలిచాడు.

శాంతమ్మ అటు చూసింది.

"రాత్రిపూట చేయి చేసుకోకమ్మా...రవిని విడిచి పెట్టు" అన్నాడు. శాంతమ్మ రవి చేయివిడిచిపెట్టి "అబ్బబ్బ వీడితో వేగలేకపోతున్నా అన్నయ్యా...పసన్నా దూళ్ల దగ్గరన్నా పెట్టు; కాస్త గొడవన్నా తగ్గుతుంది" అంది.

"ఆ మాట్లాడేను ... జమిందారుగారి దూళ్లదగ్గరే; రేప్రొద్దున్నే తీసుకవెళ్ళి వప్పచెబుతా" అన్నాడు ధర్మయ్య. ఈ మాటతో రవికి చాలా కోపంవచ్చింది. "వాళ్లదూళ్ల దగ్గరకు మాత్రం వెళ్లను...ఇంకేపనైనా చేస్తా" అన్నాడు.

ధర్మయ్యకు నవ్వొచ్చింది. కాని పైకి వెల్లడిచేయ లేదు. "వెధవాయి! ఎందుకు వెళ్లవో చూస్తా. రేపే నీపని చెబుతా" అంటూ వెళ్ళిపోయాడు.

శాంతమ్మ మంచంమీద పడుకుంది. రవి చాలాసేపు అలాగే నిలబడ్డాడు. రాము అంటే అసలేమంట. అందులో వాళ్ళదూళ్ళ దగ్గర కాపలా అట. ఈ అవమాన భారంతోనే తల్లి ప్రక్కనే పడుకున్నాడు..

రవికి నిద్దరపట్టలేదు. మెల్లగా "అమ్మా" అన్నాడు.

శాంతమ్మ మాట్లాడలేదుగాని, కళ్లువిప్పి చూసింది.

"వాళ్ళ దూళ్ళ దగ్గరకు వెళ్ళను."

"అన్నయ్య, ఊరుకో." అంటూ శాంతమ్మ యిటు తిరిగిపడుకుంది. నిజమే! శర్మయ్య అంటే ఆ పేట పిల్లలందరి కోబాటే రవికికూడా భయం. అంటే తప్పక చేస్తాడనే నమ్మకంకూడా రవికుంది. ఈ ఆపత్తునుండి కాపాడమని తనకు పేర్లు తెలిసిన దేవుళ్ళందర్నీ మనస్సులో ప్రార్థించుకుంటూ రవి నిద్దరపోయాడు.

రవి ఉదయాన ఎప్పుడు లేచి వెళ్ళిపోయాడో శాంతమ్మకు తెలీదు. నీళ్ళబిందె క్రిందపెడుతూ మంచంకేసి చూసింది. రవిలేడు.

లక్ష్మి చిట్టిచెంబుతో మొగం కడుక్కోడానికి వీధి అరుగుమీదకు వెళుతుంటే శాంతమ్మ పిలచింది. చెంబు అరుగుమీదపెట్టి లక్ష్మి శాంతమ్మ దగ్గరగా వచ్చింది.

"రవి ఎక్కడే?" శాంతమ్మ అడిగింది.

"ఏమో-నాతో మాట్లాడడంలేదుగా!" ఈ కంఠధ్వని చాలా కష్టనిష్ఠూరాలతో ధ్వనించింది.

"ఏం? ఎందువల్ల?"

"రాముతో మాట్లాడవద్దని చెప్పాడు. ఒకే బడిలో చదివేటప్పుడు మాట్లాడకుండా ఏలావుండనత్తా?" ఆలోచనతో నిండిన లక్ష్మి ముఖం చూసి, శాంతమ్మకు నవ్వొచ్చింది. కాని ఆపుకుంది. మళ్ళీ లక్ష్మి "అందుకే మాట్లాడకుండా ఉండలేనని చెప్పేశానమ్మా" అంది.

"ఎందువల్ల" శాంతమ్మ ప్రశ్నించింది.

"నాలుగు రోజులనుంచి నాతో మాట్లాడ్డంలేదు... మాట్లాడకపోతే నాకేం! నాకు రాము జత ఉన్నాడుగా" అంటూ కోపంగా మొగం పెట్టుక వెళ్ళిపోబోతుంటే "లక్ష్మి" అని శాంతమ్మ మళ్ళీ పిలిచింది. లక్ష్మి దగ్గరగా వచ్చింది.

"రాము ఏలాంటివాడు లక్ష్మీ?" అని శాంతమ్మ అడిగింది.

"చాలా మంచివాడు. కాలవమీద వాళ్ళింటికి తీసికెళ్ళి అప్పచ్చులు పెడతాడు..." యింకా ఏదో చెప్పబోయి ఆగి మళ్ళీ యిలా అంది "అత్తా! నిన్నొకసారి అడిగాడు కూడాను."

ఈ మాటతో శాంతమ్మ లక్ష్మిని దగ్గరకు లాక్కొని "ఏమని అడిగాడు?" అని ఆత్రంగా అడిగింది.

"మీ అత్త చాలామంచిది" అన్నాడు. శాంతమ్మ లక్ష్మి శిరస్సు ముద్దుపెట్టుకొని ఆనందస్వరంతో "నూరేళ్లూ బ్రతుకు తల్లీ" అని దీవించింది. అప్పట్లో శాంతమ్మ కళ్లు ఆనందబాష్పాలతో నిండిపోయాయి. రాముగురించి చెబితే తన్ను దీవించడమేమిటో లక్ష్మికి అర్థంగాక, కాస్సేపు అలాగే చూసి అక్కడినించి వీధి అరుగుమీదకు వెళ్ళిపోయింది.

వంటచేసిన తర్వాత రవి కోసం శాంతమ్మ చాలాసేపు చూసింది. రవి జాడా జవాబూ లేదు.

ధర్మయ్య లక్ష్మితో భోజనానికి కూర్చునేముందు "రవి ఏడీ?" అని అడిగాడు.

గుమ్మందగ్గర కూర్చున్న శాంతమ్మ "రాలేదు" అని క్లుప్తంగా సమాధానం చెప్పింది.

అన్నం కలిపి నోట్లో ముద్దపెట్టుకుంటూ ధర్మయ్య శాంతమ్మకేసి ఓమారు చూశాడు. ఆమె దైన్యపూరిత విషాదవదనం చూసిన ధర్మయ్య ఆమె హృదయం బిడ్డకోసం ఎంత పరితపిస్తుందో అర్థంచేసుకున్నాడు.

"అన్నంతిన్న తర్వాత వాడు ఎక్కడున్నా తీసుక వస్తాను" అని ధర్మయ్య చెప్పాడు.

ఇంటికిరాడనే అపనమ్మకం ఆమెకులేదు. కాని తన బిడ్డవల్ల ఏక్షణాన ఏలాంటి దూషణ తిరస్కారాలు ఆమె సహిస్తూ పూరుకోవలసి వస్తుందో అనే భయమే ఆమెలో పనిచేస్తోంది.

ధర్మయ్య భోజనంచేసి చేయికడుక్కోడానికి దొడ్డివైపునకు వెళ్ళాడు. లక్ష్మి అప్పుడే భోజనంచేసి గదిలోకి వెళ్ళి పుస్తకాలు తీసుకుంటోంది.

శాంతమ్మ ఎంగిలిఎత్తి కంచాలు తీయబోతూ ఉండగా గుమ్మంలో కారువచ్చి ఆగిన ధ్వని వినిపించింది. ఆమె హృదయం భయంతో కంపించింది. కంచాలు తీసుక కంగారుగా లోపలకు వెళ్ళిపోయింది.

"మాష్టారూ!" అని పిలుస్తూ రవిని వెనకాల పెట్టుకొ రాము వాకిట్లోకి వచ్చాడు. రాము కంఠం విన్న లక్ష్మి చేతిలో పుస్తకంతో పరుగున వచ్చింది.

"మీ నాన్నగారు ఏరి?" అని మళ్ళీ రాము అడిగాడు.

"ఏం బాబూ!" చేయి తుడుచుకుంటూ ధర్మయ్య వచ్చాడు.

కంగారుగా చేతులు కడుక్కున్న శాంతమ్మ, ప్రేమ పూరితమైన తన బిడ్డ కంఠస్వరంనుండి ఏలాంటి వార్త వస్తుందో అనే ఆత్రంతో తలుపు వెనకాలనుండి వింటోంది.

"రవిని మా దూళ్ళకాడ పెడతానన్నారట కదూ?"

"అవును బాబూ! చదువుకోపోతే ఏం చేయను?" అని ధర్మయ్య సమాధాన మిచ్చాడు.

"చదువుకుంటానంటే దూళ్ళకాడ పెట్టరుకదూ?" అని రాము అడిగాడు.

"అబ్బే! చదువుకుంటే ఎందుకు పెడతాను."

"సరే! రేపటినుంచి స్కూలుకు వస్తాడట...నాతో లక్ష్మితో జతగా ఉంటాడట. కూడా తీసుకరండి" రవిని అక్కడ విడిచి, వెనక్కి తిరిగాడు రాము. శాంతమ్మ దగ్గర్నుంచి వచ్చి "రామూ" అని లక్ష్మి వెనక్కు పిలిచింది. రాము ఆగి చూశాడు.

"మా యింట్లో అన్నంతినవూ?" అని అడిగింది.

ఈ మాట ఎవరు ఎక్కడినించి అడిగించారో రాము గమనించలేదు. కాని అంత పేదవాళ్ళయింట్లో తనలాంటి వాళ్ళు అన్నంతినడం మంచిది కాదనే నిర్ణయం లేకపోయినా, ఎందుకో "వద్దు" అని మాత్రమన్నాడు.

"మా యింట్లో అన్నంతింటే తప్పా?" లక్ష్మి కాస్త బాధగానే అడిగింది.

"తప్పో ఒప్పో నాకు తెలీదు... కాని మానాన్న గారు ఎవరింటిదగ్గరా ఎప్పుడూ అన్నం తినవద్దన్నారు" అన్నాడు. పరిసరాలు ఎవరికోసమో అతని కళ్లు వెతికాయి.

శాంతమ్మ వెలుపలకు రాలేదు. రావాలనీ, రాముని కళ్ళారా చూడాలనీ ఉన్నా ధర్మయ్య ఏమంటాడో అనే భయం కొంత ఆపుచేసింది.

బిడ్డకు తన చేతులారా అన్నంపెట్టాలనే కోరిక కలిగిన శాంతమ్మ మనస్సు కాస్త నిరుత్సాహంతో వ్యథపడింది.

రాము గుమ్మందిగి కారులో ఎక్కాడు. ధర్మయ్య కూడా కారుదగ్గరగా వచ్చాడు.

"మాష్టారూ? ... మరి" ఏదో అడగబోయాడు. కాని మాట పూర్తికాకక్రితమే కారుస్టార్ట్ కావడంవల్ల, గుమ్మంలో తను అడగబోయే ప్రశాంతమూర్తి కనిపించడం వల్ల మాట పూర్తిచేయలేదు.

శాంతమ్మ గుమ్మంలో నిలబడి రాముని చూస్తూనే వుండి, రాముకూడా ఆమెపై తన కళ్ళలో ఈ అవ్యా అజ మానం అర్థంగాక అలాగే చూస్తున్నాడు. ధర్మయ్య ఇద్దరి కేసి చూశాడు. కారు కదిలిపోయింది.

పిల్లల తగవుల్లో మొదటి నేరస్తుణ్ని నిర్ణయించడం ఎంతకష్టమో; మళ్ళీ జతకూడిన తర్వాత ఏవరుముందు స్నేహానికి చేయిచాచారో నిరూపించడం కూడా అంతే కష్టం.

రవికి రాము అంటే ఆనాడు జరిగిన సంఘటన దగ్గర్నుంచీ కష్టంగానేవుంది. కాని అతణ్ని చూడాలనీ, మాట్లాడాలనే మమకారం లేకుండాపోలేదు. రవి ఆత్మాభిమానం ఎంత అడ్డుపడినా, తానుచేసిన పొరపాటునకు బుద్ధిమాత్రం మధ్యమధ్య వ్యథపడుతూనేవుంది.

ఈ రోజు రవి ఊరు చివర రోడ్డు ప్రక్కన, తూము మీద కూర్చొని ఉదాసీన వదనంతో, ఎర్రగా ప్రసరించే ఎండలో, దూడల్లుకాసే కుర్రాళ్ళను చూస్తూ, తన భవిష్యత్తు ఉద్యోగం సంతోషదాయకమో విచారకారణమో ఊహించడానికి ప్రయత్నిస్తున్నాడు.

రోడ్డుప్రక్కన కారు సడెన్‌గా ఆగిన ధ్వని విని రవి వెనక్కి చూశాడు. సంతోషంతోపైకిలేచి, కారుదగ్గరకు రాబోయి, ఏదో జ్ఞాపకంవచ్చి ఆగిపోయి, తలక్రిందకు దించుకొ కోపంగా చూస్తున్నాడు.

కారులో వున్న రాము మొదట్లో మాట్లాడదా మనుకుని తరువాత అతని నిరుత్సాహ నిర్లక్ష్యభంగిమను చూసి ''పోనియ్యి'' అని డ్రైవరు కేసి చూశాడు.

రవి కళ్ళనీళ్ళతో రాముకేసి చూశాడు. రాము కారు ఆపుచేయించి ''ఇక్కడున్నావేం?'' అన్నాడు.

రవి మాట్లాడలేదు. రాము కాస్సేపాగి తరువాత ''కార్లో ఎక్కుతావా?... మీ యింటిదగ్గరకు తీసుకవెళతా'' అన్నాడు.

విరోధిద్వారా యిలాంటి ఆదరణ వాక్యాలు వింటానని రవి ఎప్పుడూ అనుకోలేదు. మెల్లగా కారులో ఎక్కాడు.

రవి కారు కదిలిన తర్వాత, నవ్వుతూ, నసుకుతూ, తను యిల్లువిడచి యిక్కడ ఉండటానికి కారణంకూడా చెప్పాడు.

# 13

శాంతమ్మ మనస్సు శాస్త కుదుటపడింది. రవి ఏదో స్కూల్లోచేరి ఘనంగా విద్యార్జన చేస్తాడనే ఆసక్తికన్నా, ఇంటిదగ్గర ఉండి తగువులు ఏమీ తీసుకరాడు అనే నమ్మకం కుదిరింది.

స్కూల్లో రవి ఏవన్నా తగువులు తెస్తున్నా, రాము అభిమానాన్ని సంపాదించడంవల్ల వాటిగురించి శాంతమ్మకు గాని, రవికిగాని ఏవిధమైన బెడదా లేకుండా పోతోంది. ఇక రాత్రుళ్ళుకూడా లక్ష్మికి చదువుయందుగల శ్రద్ధవల్ల, రవికి చాలా యిబ్బంది వచ్చిపడింది.

లక్ష్మి తీరిగ్గా పుస్తకాలు ముందువేసుక కూర్చొని "బావా!" అని పిలచేది. రానంటే; ధర్మయ్య జ్ఞాపకానికి వచ్చేవాడు. మనస్సులో కోపంతో మండిపోతూ చిరాకుగా పుస్తకాలు తీసుక్రొని లక్ష్మి దగ్గర కూర్చునేవాడు. కిక్కురు మనక చదివేవాడు.

చదువులో లక్ష్మి తెలివితేటలు ముందు తాను పరాజితుడు కావడంవల్ల ఒకసారి చెటేలున లక్ష్మిని చెయిచేసుకున్నాడు రవి.

ప్రక్కగదిలో ఏదో చదువుకుంటున్న ధర్మయ్యకు ఆశబ్దం వినిపించింది. "ఏమిటి లక్ష్మి" అని పిలచాడు. కాని

ఆమె సమాధానం చెప్పలేదు. ధర్మయ్య దగ్గరకువచ్చి చూశాడు. రవి అప్పుడే పుస్తకాలు తీసుక ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు.

"కొట్టాడా?" అని లక్ష్మి నడిగాడు.

"గట్టిగా కొట్టలేదులే నాన్నా" అని సమాధాన మిచ్చింది. ధర్మయ్య రవి వెళ్ళినదారిని కాస్సేపుచూసి, యథాస్థానానికి వెళ్ళిపోయాడు.

మరునాడు సాయంత్రంవరకూ లక్ష్మి రవితో మాట్లాడ లేదు. రాత్రి పుస్తకాలు తీసుకవచ్చి ఎదురుగా కూర్చున్నాడు. కాని లక్ష్మి ఏమీ పట్టనట్లుగా అటు చూడనేలేదు. కాస్సేపటి వరకూ రవి మాట్లాడక కూర్చొని మెల్లగా అన్నాడు "అలా అయితే నేను చదవను."

"నా గురించి చదువుతున్నావేమిటి?" అని మొగం పెడగా పెట్టుకొని సమాధానం చెప్పింది.

కాస్సేపాగి రవి "కొట్టానని కోపమా?" అని అడిగాడు. లక్ష్మి మాట్లాడలేదు.

"యిక ఎప్పుడూ కొట్టను లక్ష్మి" బాధగా మొగం పెట్టి అన్నాడు. లక్ష్మి అతనికేసి విమర్శనీయంగా చూసి "సరే పాఠం నప్పచెప్పు" అని అంది.

చాటునించి వీళ్ళ సంభాషణలు వింటున్న ధర్మయ్య తనలో తాను నవ్వుకున్నాడు.

ఈరోజు జమిందారు గంగాధరంగారింట్లో చాలా హడా విడిగావుంది. రాము పుట్టినరోజు.

ప్రొద్దుటనించి రవికీ, లక్ష్మికీ తీరికే లేదు. వారేమీ పనులు చేయకపోయినా, రాము కారు పంపిస్తానని చెప్పాడు. అందుచేత బట్టలు వేసుకొని, ముస్తాబవడంలో లక్ష్మి కాలాన్ని చాలా వృథా చేస్తోంది. రవి అప్పుడే తయారై కూర్చున్నాడు. లక్ష్మి అద్దంలో చూసుకొని, "బావుందా బావా?" అని ఇప్పటికి ఏ అరసార్లో అడిగింది. ఇప్పటికే రవికి చాలా విసుగుదలగా వుంది.

సమాధానం యివ్వకుండా చావిట్లోకి వెళ్ళి గడ్డం క్రింద చేతుల పెట్టుక దీర్ఘాలోచనలో మునిగాడు. అతనికేం ఊహ తట్టిందో "లక్ష్మి" అని పిలచాడు.

"ఏం?" లోపలనుంచే సమాధానం చెప్పింది.

"కారొచ్చింది రావాలి" ఆ కంఠ ధ్వని నిజంగా కారు వచ్చినట్లుగానే వుంది.

లక్ష్మి కంగారుగా వెలుపలకు వచ్చింది. అప్పటికి ఒక కంటికే కాటుక పెట్టుకుంది. రవి నవ్వాడు. తప్పట్లు చరిచాడు. లోపలున్న శాంతమ్మ వచ్చి చూసింది. ధర్మయ్య కూడా అరుగుమీాదనించి యింట్లోకి వచ్చాడు.

"ఆ కాటుక ఎవరు పెట్టారమ్మా?" అని ధర్మయ్య నవ్వుతూ అడిగాడు. లక్ష్మి తిరిగి వెళ్ళి అద్దం చూసుకుంది. "మాయమతిలే" అని తనలో మూలుక్కుంది.

ఆ వెనకాలనే వెళ్ళిన శాంతమ్మ; లక్ష్మి ఆరిందాలా ముక్కుడం చూసి పక్కున నవ్వింది. లక్ష్మి వెనక్కు తిరిగి కోపంగా చూసింది. "మీా అబ్బాయి మూలాన్నే" అంది.

శాంతమ్మ దగ్గరిగా వచ్చింది. కాటుక బొట్టూ పెట్టింది. లక్ష్మిని తన ఎదురుగా నిలుపుకుంది.

"ఎవర్ని పెళ్ళి చేసుకుంటావ్ లక్ష్మీ!" అని అడిగింది. పెళ్ళంటే తెలీకపోయినా ఆపేరు చెప్పేటప్పటికి లక్ష్మి తలవంచుకొని "ఫో అత్త" అంది.

"రామునా? రవినా?" అని మళ్లా అడిగింది.

"రాడీ బావనే—బాబో!" అంది.

"మరి రాముని చేసుకుంటావా?" శాంతమ్మ మరీ నిలదీసి అడగడంతో, లక్ష్మి అక్కడినించి తప్పుకోలేక పోయింది. ఏం చెప్పనా అని ఆలోచిస్తూంది.

అంతలో కారు ఆగిన ధ్వని అయింది.

"అదుగో కారు వచ్చింది" అంటూ తుర్రున అక్కడ నించి లక్ష్మి పారిపోయింది.

పారంపర్యంగా వచ్చే ఆనవాయితీ ప్రకారం ఊళ్లో ఉన్న పెద్దవాళ్ళనందరిని గంగాధరం ఆహ్వానించాడు. హాలంతా జనంతో కిటకిటలాడుతూంది. పిల్లలంతా ఓ ప్రక్కనూ, పెద్దలంతా మరో ప్రక్కనూ కూర్చున్నారు.

తేనీటివిందయిన తర్వాత వినోదార్థం పేరుగల నర్తకి చేత నాట్యంకూడా చేయించారు.

రాము ఎత్తయిన కుర్చీమీద అలంకార భూషితుడై కూర్చున్నాడు. అతని దృష్టి దూరంగాఉన్న లక్ష్మి కేసి

పోతూంది. రవి ప్రక్కన ఉన్న లక్ష్మి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ రాముని చూస్తూంది.

నాట్యం పూర్తయింది. రాముకి, వచ్చిన అతిథులు బహూకరణలు అందచేస్తున్నారు. కాస్తదూరంగాకూర్చున్న గంగాధరం చిరునవ్వుగా అన్నీ పరిశీలిస్తున్నాడు. ఆ ప్రక్కనే ధర్మయ్య కూడా కూర్చున్నాడు.

పిల్లలుకూడా చిన్నచిన్న వస్తువులు యివ్వడం రవి చూశాడు. లక్ష్మికేసి తిరిగి "నువ్వేం తీసుకొచ్చావ్ ?" అని అడిగాడు.

"ఇదిగో" అని చిన్న ఉంగరం చూపింది.

ఆ ఉంగరాన్ని రవి పరిశీలించాడు. అది బంగారానిదే!

"ఇంత ఖరీదైందే యివ్వాలా ?" అని అమాయకంగా అడిగాడు.

"ఏదిచ్చినా ఫరవాలేదు" అని చెప్పి తనువెళ్లే అవకాశం కోసం చూస్తూంది.

"నువ్వు దొంగవు" పళ్ళు బిగబెట్టి కోపంగా అన్నాడు రవి. లక్ష్మి అర్థంగాక అటు చూసింది.

"మరి నువ్వు నాతో ముందు చెప్పద్దూ" కోపంగా అడిగాడు.

"అందరూ యిస్తారేమిటి?"

"ఇది నువ్వేలాయిస్తున్నావ్ ?"

"నాన్నగారు చేయించారు. యిమ్మన్నారు."

మళ్లా లక్ష్మి రాముకేసి చూస్తూ ఉండిపోయింది.

రవి మనస్సు ఆత్రంతో నిండిపోయింది. అందరికేసీ చూశాడు. లక్ష్మి చెప్పినట్లుగా కొండరే యివ్వడంలేదు. ఏవో తోచిన వస్తువులు పిల్లలతో సహా అంతా యిస్తున్నారు.

"లక్ష్మీ" రవి పిలచాడు.

లక్ష్మి రవికేసి చూసింది. అతని మొగం అవమాన భారంతో మలినమై చూడ్డానికి భయంగావుంది.

"నీదగ్గర డబ్బులున్నాయా?"

"ఓ పావలా ఉంది."

"ఇటు తే" చేయిచాచాడు. లక్ష్మి భయంగా అతని చేతులో డబ్బులు పెట్టింది.

రవి డబ్బులందుకొని, జనాన్ని తప్పించుకొని, కంగారుగా వీధిలోకి వెళ్ళిపోయాడు.

గేటు దాటి రవి బజారు వేపు పరువెడుతున్నాడు. బజారు చాలాదూరముంది. తిరిగివచ్చేటప్పటికి అంతా వెళ్ళి పోతారేమోనని భయంగాకూడా ఉంది. అందుకే మరీ తొందరగా వెళ్ళబోతుంటే; గొప్పుతగిలి క్రిందపడిపోయాడు. బట్టలు కంకర రంగుతో డాగులుపడ్డాయి.

చాకులు అమ్ముతూ దోవేవచ్చే ఒక కుంటిమనిషి, రవిని లేవదీశాడు. రవి దృష్టి చాకులమీద పడింది. లక్ష్మి

ఉన్న "ఏమైనా పరవాలేదు" అనే మాట గుర్తుకొచ్చింది. ఆనందంగా చాకులుకేసి చూస్తూ "ఎంత?" అని అడిగాడు.

"ఇది రూపాయి, ఇది అర్ధరూపాయి, ఇది పావలా" అని మూడు రకాలు చూపాడు.

తన దగ్గర ఉన్నది పావలాయే! పావలా ఖరీదైన చాకుతీసి, పరిశీలించాడు. ఫరవాలేదు; బాగానే వుందను కున్నాడు. "నేను తీసుకుంటా" అన్నాడు.

"డబ్బులు" చేయిచాచాడు.

రవి జేబులో చేయిపెట్టాడు. లక్ష్మి యిచ్చిన పావలా లేదు. మొగం వెల వెల పోయింది.

"నీకు యివ్వలేదూ?" అనుమానంగా అడిగాడు రవి.

"బావుంది..." వాడు నవ్వాడు. "చాకు యిటియ్యి" కోపంగా చూస్తూనే చేయిచాచాడు.

"నేనివ్వను!" బింకంగా అని గిర్రున తిరిగి జమిందారు యింటివేపు పరువెత్తాడు.

చాకులమ్మే వాడికి అసలే కాలుకుంటి; కుర్రవాడి ప్రవర్తన చాలా ఆశ్చర్యంగా తోచి కదలలేక అక్కడే నిలబడి నేలకేసి చూశాడు. రవి పడినచోట పావలా కని పించింది. చేత్తో తీసుకొని "బలేకుర్రాడు!" అని అనుకున్నాడు.

రవి జమిందారు హాలులో చేరేసరికి జనం చాలా మంది వెళ్ళిపోయారు. రాము అక్కడే కూర్చున్నాడు. లక్ష్మి

శాస్త్ర దగ్గరగావుంది. రవి రొప్పుకుంటూ రోజుకుంటూ రావడం దూరానున్న జమిందారు చూశాడు. ఆశ్చర్యంగా పైకిలేచాడు. మలినమైన గుడ్డలతోవచ్చే ఆ కుర్రవాణ్ని జమిందారు ఎప్పుడో ఎక్కడో చూసినట్లు గుర్తు. అదే ఆలోచిస్తున్నాడు.

"రామూ! యిప్పుడు వెళ్ళి కొనుక్కొచ్చా" అంటూ చాలా విజయాన్ని సాధించినవాడిలా మడతవిప్పిన ఆ చాకు రాముచేతులో పెట్టాడు.

ఆ చాకుచూసి ప్రక్కనున్న వాళ్ళంతా గొల్లున నవ్వారు. రాముకూడా నవ్వాడు. రవికి ఇదేమీ అర్థంగాక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఎవరబ్బాయివి?" ఈ గంభీరకంఠధ్వని విని అంతా అటు చూశారు. జమిందారు నిలబడి ఉన్నాడు.

రవి చూడ్డమేగాని సమాధానం యివ్వలేదు.

"నీ పేరు?" మళ్ళీ అడిగాడు జమిందారు.

"రవి" క్లుప్తంగా సమాధానం చెప్పి తల వంచుకున్నాడు.

ఈపేరు విన్న జమిందారు కాస్సేపు స్తంభించి పోయాడు. ధర్మయ్యకూడా మెల్లగా అక్కడికి వచ్చాడు.

"ధర్మయ్యగారూ...యీ అబ్బాయీ..." జమిందారు ఏదో అడగాలనుకుంటూనే ఇక అడగలేకపోయాడు.

"మా చెల్లెలుగారబ్బాయి" అని నెమ్మదిగా ధర్మయ్య అన్నాడు. ఈ మాటతో జమిందారుకి మరీ ఆశ్చర్యం కలిగింది.

"మీ చెల్లెలు పేరు?"

"శాంతమ్మ"

జమిందారు యిక మాట్లాడలేదు. సంశయ నివృత్తికి ముందున్న ఆందోళన ఆశ్చర్యం అతనిలో లేవు. మెల్లగా మ్లానహాసం చేసి "ఈ శుభసమయంలో వాకు బహూకరించాడేమిటి?" అని అన్నాడు.

"ఏదివ్వాలో కుర్రవాడికి తెలీక..." ధర్మయ్యమాట యింకా పూర్తికానిక్రితమే జమిందారు నవ్వాడు.

"విషయం తెలిసినా వెల్లడిచేయని శక్తి మీకుంటే; ఎంత కాలమైనా కుర్రవాడు, మీరు సుఖంగా జీవించ గలుగుతారు; వెళ్ళిరండి" ధర్మయ్య భుజంపై ఈ మాట లంటూ మెల్లగా చరిచి రాముని తీసుకొని లోపలకు వెళ్ళిపోయాడు జమిందారు.

ఈ మాటలు అసందర్భ అర్థరహితంగా ఉన్నట్లు విన్న వాళ్ళకు కనిపించినా – దానిలో ఏలాంటి విషపూరిత సత్యం దాగివుందో జమిందారుకీ, ధర్మయ్యకు మాత్రమే తెలుసు.

రవి, లక్ష్మితోబాటు ధర్మయ్య మెల్లగా నడిచి యింటికి చేరుకున్నారు.

# 14

ఎనిమిదేళ్లు గడచిపోయాయి. ఇప్పుడు ధర్మయ్య కుటుంబ జీవితంలో చాలా మార్పులొచ్చాయి. ఉపాధ్యాయ వృత్తి ఊడిపోయి రెండు సంవత్సరాలు కావస్తోంది. లక్ష్మి పెద్దమనిషై పెళ్ళికి సిద్ధంగా యింట్లో కూర్చొనిఉంది. చేతిలో డబ్బు నిలవలేని ధర్మయ్యకు, ఒక సంవత్సరంపాటు శాంతమ్మ దగ్గరున్న మొత్తం ఆ కుటుంబాన్నంతా కాపాడింది. ఇక శాంతమ్మదగ్గరకూడా ఏమీ లేదు.

రవి కూడా పెద్దవాడయ్యాడు. ఎనిమిదవ తరగతి వరకే ఆ పాఠశాలలో ఉంది. లక్ష్మి రవీ కూడా అంతవరకే చదివి, ధర్మయ్యతోబాటు ఆ పాఠశాలకు స్వస్తి చెప్పారు.

ధర్మయ్య వేరనే భావం శాంతమ్మకుగాని, రవికిగాని లేకపోవడంవల్ల, ఒకే కుటుంబంగా యింతకాలం జీవించడం వల్ల, శాంతమ్మను కష్టకాలంలో ధర్మయ్య కాపాడ్డంవల్ల, మొత్తం కుటుంబ బాధ్యతంతా రవిమీద పడింది.

ఉద్యోగం చేసి ధనాన్ని సేకరించగల విద్య రవిలో లేదు. అందుచేత ఒక సంవత్సరం స్థిరచిత్తం లేకుండా అనేక వృత్తుల్లో మారుతూవచ్చాడు.

మొదట్లో ఎప్పుడూ బట్టలు తెల్లగా ఉండే సున్నితమైన కార్మిక వృత్తి ఏదా అని ఆలోచించాడు. ఒక దర్జీ

వాని దగ్గర చేరాడు. పని చెప్పకుండా కాఫీలు మోసే కుర్రాడిగా రవిని ఉపయోగించడంతో రవికి కోపం వచ్చింది.

ఒకసారి రవి విసురుగా కాఫీ తీసుకవచ్చి, కటింగ్ బల్లమీద గిరాటు వేశాడు. బట్టలన్నీ కాఫీరంగుతో డాగులు పడ్డాయి. మేస్త్రీకి కోపం వచ్చి రవిని చెంపకాయ వేశాడు. రవి దగ్గరున్న కత్తెర తీసి, టైలరుకు చూపిస్తూ, "మరో దెబ్బ వేశావంటే; ఇదిగో" అన్నాడు. దర్జీ నోరావలించి చూశాడు.

"నేను పని నేర్చుకోడానికి వచ్చాను గాని, నీకు కాఫీలు మోయడానికి రాలేదు. కాఫీలు మోస్తేనే ఆ పని వచ్చేపక్షంలో ఈలాంటి వెధవపని నా కక్కర్లేదు" అని రవి తీక్షణంగా మాట్లాడి తిరుగుమొగం పట్టాడు.

కొంతకాలం వడ్రంగి పనిలో చేరాడు. కాస్త తెలివిగానే పనిచేస్తున్నాడు. రోజుకో రూపాయి సంపాదించే పనివాడు కూడా అయ్యాడు. కాని ఒకరోజు మేస్త్రీమీద చాలా కష్టం కలిగింది. వచ్చే రూపాయిలో పావలా కమీషను తీసుకోవడం ప్రారంభించాడు మేస్త్రీ.

ఒకనెల జీతంగా యిరవై రెండున్నర రవి చేతులో పెట్టాడు మేస్త్రీ.

"మిగతా ఏడున్నర" చేయిచాచి నిర్లక్ష్యంగా అడిగాడు రవి. ప్రక్కనున్న కుర్రాళ్ళు రవి ధైర్యానికి విస్తుపోయి చూస్తున్నారు.

"ఇది నాకు వస్తుంది" మేస్త్రి చెప్పాడు.

"ఎందుకని?"

"కష్టపడి పని నేర్చుకుంటాను."

"కష్టపడి చాలాకాలం ఉచితంగా కొన్నివందల రూపాయలు నీకు సంపాదించి పెట్టాను...ఇక యిలాంటివి పోసగవు. చేతిలో పడేయి" బిగ్గరగా కోపంగా అన్నాడు. మేస్త్రి ఏమనుకున్నాడో, మిగతా డబ్బు యిచ్చి "ఇక నా పనిలోకి రావద్దు" అన్నాడు.

రవి నిర్లక్ష్యంగా నవ్వి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడే చేతిమీదను కార్ఖానాలో చేరాడు. మలినమైన గుడ్డలు వేసుకొని మసన్లుకోయడం బాగు చేయడం మొదట్లో బాధగా తోచినా – అక్కడ ఉన్నవాళ్ళ హృదయంలో మలినం అంతగా లేకపోవడంవల్ల రవి నిలవగలిగాడు. కొద్ది కాలంలోనే ఒకరిద్దరితో గాఢమైన స్నేహం కూడా చేయగలిగాడు.

రవి ప్రవర్తన, రవితో పరిచయం ఉన్న ప్రతివాళ్లనూ మొదట్లో చాలా కంగారు పెట్టేది. ఎప్పుడూ కోపిష్టిగా ఉండే అతని మొగం, మాట్లాడే విషయంలో, ఒంపులూ సొంపులూ చేర్చక నిక్కచ్చిగా, నిర్లక్ష్యంగా మాట్లాడే విధానం. "అహంభావి"గా మొదట్లో నిర్ణయించుకొనేవారు. కాని కొద్దిరోజుల్లోనే, నీతివంతమైన నిష్కల్మషమైన అతని హృదయాన్ని చూసి, తమ అభిప్రాయం పొరపాటని సరిదిద్దుకొనేవారు.

ఇప్పుడు రవి పెద్దపనివాడే అయ్యాడు. నెలకో ఎన్నో రూపాయలు తీసుకవచ్చి శాంతమ్మచేతిలో పోస్తున్నాడు. ఏలాంటి దురభ్యాసాలూ అతనిలో లేవు. కుటుంబం తిండికి బాధపడే దుస్థితిని తప్పించిన రవికి, ధర్మయ్య మానసికంగా ఆశీస్సులు కురిపిస్తున్నాడు.

ధర్మయ్య ఇంకా పది సంవత్సరాలు పని చేయగల ఓపికా వయస్సూకూడా ఉన్నా, రెండు సంవత్సరాలకుముందే తన ఉద్యోగం హఠాత్తుగా ఊడిపోడానికి కారణం ఏవరో తనకు తెలుస్తున్నా, ఆ విషయం గురించి శాంతమ్మదగ్గర ఎప్పుడూ ప్రస్తావించలేదు. ప్రస్తావించి ఆమెకు బాధ కలిగించడంతప్ప మరేమీ ఉపయోగంలేదని అతనికి తెలుసు కాబట్టె నిర్లిప్తుడుగానూ ఉదాసీనంగానూ ఊరుకున్నాడు.

ఏ లోపంతో ఏవిధంగా ధర్మయ్య ఉపాధ్యాయవృత్తిని విరమించాడో వివరణగా శాంతమ్మకు తెలీకపోయినా—తన గురించే ఈలాంటి త్యాగానికి ధర్మయ్య తలపడి ఉంటాడని ఆమె ఊహించుకోగలిగింది.

అతని నిస్వార్థ, పరార్థజీవితానికి శాంతమ్మ ఎంతగానో బాధపడేది. అందుకే తన దగ్గరున్న డబ్బు అయాచితంగా కుటుంబ ఖర్చుకు వినియోగించింది. అతన్ని జీవితాంతం కాపాడే బాధ్యత తనకుందని గుర్తించింది.

జమిందార్ గంగాధరంలో క్రూరత్వం ఉందని ఎవరూ అనలేరు. అతను అతిగంభీరుడూ పరార్థ చింత

గలవాడని కూడా లోకులు చెప్పుకుంటారు. కాని రెండు సంవత్సరాలక్రితం ధర్మయ్యను ఉద్యోగాన్నుండి తిలోదకాలు యిప్పించడంలో, తప్పుటడుగులువేశాడని ఎవరన్నా అను కున్నా-అది తన లోపం కాదని ఆలోపం చేసింది ధర్మయ్యే అని గంగాధరం ఆత్మవిశ్వాసంలో ఉన్నాడు.

ఒకరోజు రాము కాస్త ఆలస్యంగా యింటికి చేరు కున్నాడు. గంగాధరం ఆలస్యానికి కారణ మడిగాడు.

"మాష్టారింటిదగ్గర్నే యింతవరకూ ఉన్నా" అని రాము సమాధానమిచ్చాడు. రాముని ఏలాంటి ఆకర్షణ ధర్మయ్య యింటికి లాక్కు వెళుతుందో, నిజంగా గంగాధరానికి తెలీదు. కాని శాంతమ్మను తల్లిగా గుర్తించే అవకాశాన్ని ధర్మయ్య కలగచేస్తున్నాడనీ, శాంతమ్మ అందుకే తన గ్రామంలో సుస్థిరంగా నిలచిపోయిందనీ జమిందారు ఊహించాడు.

"తరచు అక్కడికి వెళ్ళడం మంచిదికాదేమో" అని జమిందారు సూచించాడు. లోపలకు వెళ్ళబోతున్న రాము ఆశ్చర్యంగా తండ్రికేసి చూశాడు. "ఎందువల్ల?" అని కూడా విధేయతగా అడిగాడు.

ఈ మాటకు జమీందారు బాధాపూరితంగా వాడిన నవ్వు నవ్వి, సమాధానం యివ్వకుండా ప్రక్కకు మొగం పెట్టాడు.

ఆ నవ్వులో ఏలాంటి శక్తి ఉందో, రాము స్తంభించి పోయాడు. మెల్లగా కాస్సేపు చూసి లోపలకు వెళ్ళాడు. అయితే రాము అలా స్తంభీభూతుడు కావడానికి, తను అంతరంగికంగా గుప్తంగా దాచుకుంటున్న భావన తండ్రి ఏలా పసికట్టకలిగాడా? అనేదే అతని ఆశ్చర్యం భయంకూడా.

లక్ష్మిపట్ల తనకున్న ప్రేమాభిమానాలు ప్రస్తుతం ఎవరికీ తెలీకూడదని రాము నిర్ణయం. బాల్యంనుంచీ అన్యోన్యంగా అల్లుకుంటూవచ్చిన స్నేహలతిక ప్రాయం వచ్చే సరికి అనురాగలతగా హృదయాన్ని ఇంతగట్టిగా పెనవేయడం, ఆమెను రోజు కొక్కసారేనా ఏలాగైనా చూడాలనే కుతూహలం పొందడం మొదట్లో ఆశ్చర్యపడ్డాడు. కాని తర్వాత అలవాటుగా ప్రతిరోజూ మాష్టారుయింటికివెళ్ళి, ఏ తలుపు ప్రక్కనో ఉన్న లక్ష్మిని ఒక్కసారి ఛాయామాత్రంగా చూసి సంతృప్తితో లేచి చక్కగా వచ్చేవాడు.

మరునాడు గంగాధరం ధర్మయ్యకు ఉదయాన్నే కబురుచేసి తన విశ్రాంతి గదిలోకి తీసుక వెళ్ళాడు.

"ధర్మయ్యగారూ! నేను చాలామందికి సహాయం చేశాను. కాని ఎవర్నీ ఎప్పుడూ సహాయంగురించి అర్థించ లేదు. మీకు తెలుసుకదూ?" అని ధర్మయ్యను సూటిగా చూస్తూ అడిగాడు.

ఈ ప్రశ్నలో వ్యంగ్యం ఏమిటో ధర్మయ్య ఆలోచిస్తున్నాడు.

"మీారు నాకు ఒక సహాయం చేయాలి" ఈమాట శాస్త్రి బిగ్గరగా ధ్వనించింది. దీనిలో యాచనలేదు. కాని ఏదో పట్టుదల ఉన్నట్టు ధర్మయ్యకు స్ఫురిస్తూంది.

"చెప్పండి" వినమ్రంగా అన్నాడు ధర్మయ్య.

"మీా యింట్లో ఉన్న శాంతమ్మ..." అంటూనే గంగాధరం ధర్మయ్య మొగంలోకి చూసి ఆ భావాలు చదువుతున్నాడు.

"శాంతమ్మ" అని మళ్ళీ అడిగాడు. ధర్మయ్య నుదుటి విరుపులో ఒక ఆశ్చర్యం భయం కూడా కనిపించింది.

"నిజంగా మీాకు చెల్లెలేనా?"

"వరసకు నిజంగా చెల్లెలే. కాని దూరపు బంధువు" జమీందారు నవ్వాడు. ఆ నవ్వు కోపంతో మిళితమైన నవ్వు. "ధర్మయ్యగారూ! యుక్తిగా మాట్లాడుతున్నారే."

జమీందారన్న ఈ మాటవిని, దానిలో యుక్తి అనే ఉత్ప్రేక్షకుస్థానం ఎక్కడుందా అని ధర్మయ్య ఆలోచిస్తున్నాడు.

"స్వంత చెల్లెలుగా ఎప్పుడో చెప్పారే?" శాస్త్రి వెటకారంగా తల పంకించి అడిగాడు.

ధర్మయ్య స్వంతం · అనే పదం ఎప్పుడూ, ఎవరి విషయంలోనూ వాడటానికి అలవాటు పడలేదు. చిన్నతనంలో రవి చాకు యిచ్చినప్పుడు కూడా అలా అనలేదు.

"స్వాంతమని తమతో ఎప్పుడూ చెప్పినట్లు గుర్తు లేదే."

"పరాయిదానిపట్ల అంత బాధ్యత తమ కెందుకు?"

"పూర్తిగా పరాయిది కానందువల్లనే, ఆమె భర్తృ విహీనురాలు..." ఇంకా ధర్మయ్య ఏదో చెప్పబోతుండ గానే చటుక్కున "మీరు భార్యావిహీనులు"...అన్నాడు.

దీనితో ధర్మయ్య మొగం ముందు తెల్లబడి ఆ వెంటనే ఎఱ్ఱబడింది. అయితే జమిందారు దానిలో అపార్థముందని ఊహించి ఆ మాటనలేదు. ధర్మయ్య మొగం చూసిన మీదట ఆలోచనలేకుండా, ధర్మయ్య నైతికప్రవర్తన తెలిసి కూడా, ఈలా అన్నానే అనే పశ్చాత్తాపంకూడా కలిగింది.

"మీ రేమీ అనుకోవద్దు. మీరు పరిశుద్ధులే నాకు తెలుసు...కాని ఒక విధవా స్త్రీని యింటిలో పెట్టుకుంటే లోకం ఏమనుకుంటుంది?" అని ప్రశ్నించాడు జమిందారు.

ఈలాంటి మలినభూయిష్టమైన ప్రచారం తన్నెరిగిన ప్రజల్లో గాని, తన కుటుంబాన్ని పరిశీలించినవాళ్ళలోగాని జరగదనే నమ్మకం ధర్మయ్య కున్నది. అందుకే "ఆలాంటి ఆలోచన తమకు కలిగినందుకు బాధపడుతున్నా-నన్నెరిగిన ఎవ్వరూ అంత సులభంగా అనుకోలేరని నాకు తెలుసు" అన్నాడు.

ఈ నిరాడంబర పదాలతో కూడిన వాక్యాల్లోఉన్న భావం, తీవ్ర శరాఘాతంగా జమిందారు హృదయానికి తాకింది.

జమీందారు లేచాడు. "నేనంత తేలిగ్గా ఊహించే వాడిగా మీకు కనిపించడం... నేను బాధపడను. కాని వయసు మీదకొద్దీ ఉపాధ్యాయులందరికీ మెదడు బలహీన మౌతుందా అని విచారిస్తున్నా....." కాస్త అటుయిటు పచారుచేస్తూ చిన్నగావచ్చి ఆగి "సరే... స్వయానా చెల్లెలు కానప్పుడు మీ యింట్లో ఉంచుకోవలసిన బాధ్య తేముంది?" అని ప్రశ్నించాడు.

జమిందారు యీరోజు మాట్లాడే మాటల్లో, పెద్ద తనం ఎక్కడా స్ఫురించడంలేదు. యాభయ్యోపడిలోనే పంతుళ్ళకు మతి మందగిస్తే; తనకన్నా అయిదేళ్ళు మించి ఉండి అనేక బాధ్యతలు నెత్తిమీద ఉన్న జమీందారుకు నిజంగా మతే పోవాలేమో!

నిజంగా ఆలా జరగలేదుకదా అనే అనుమానంకూడా ధర్మయ్యకు కలిగింది.

"తమరు అనే మాట నాకర్థం కావడల్లేదు."

ఈ మాటంటూ ధర్మయ్య కూడా లేచాడు. దాని క్కారణం జమీందారు నిలచి ఉండటం కొంత కారణం కావచ్చు.

"కాదు. కాదని నాకు తెలుసు... కాని నేను మాట్లాడే భాష తెలుగని మీరు మర్చిపోవద్దు" ఈ మాటలు చాలా ఉద్ధృతంగా వచ్చాయి.

ఈ వాగ్వాదం వినేవాళ్లు ఎవరన్నా ఉంటే చాలా విచిత్రంగా కనిపిస్తుంది. పందుని అకులగుంపులో మధ్యపర్చి, లావుపాటి కొమ్మను రాళ్ళతో కొడుతున్నాడు జమిందారు. కొమ్మ నిశ్చలంగా నిలబడే వుంది. ఆ అమయ పండు కేమీ తగల లేదు. బహుశా తన్ను రాల్చడానికి ఒక బలిష్టుడు ప్రయత్నిస్తున్నాడన్న సంగతి కూడా దానికి తెలీలేదు.

సూటైన రాళ్ళతో కొమ్మ గంటులుపడకుండా ఉండ లేదు. అయితే తను ఆతిధ్యమిచ్చి పోషించిన పండును కాపాడ్డం కోసం ఏలాంటి దెబ్బలు తినడానికైనా సిద్ధంగానే వుందా వృక్షాను.

"మీరు ఆమెను యింట్లోంచి పంపించి వేయడానికి ఏమన్నా సంశయముందా?"

"నేరం లేకుండా పంపించివేసేంత పాపం నేనెందుకు చేయాలి?"

దీనితో జమిందారుకు కోపం వచ్చింది. "ఆమెను పంపించివేయాలని నేను అనుజ్ఞ యిస్తున్నా" తీవ్రంగా అన్నాడు. ధర్మయ్య జమిందారు కేసి చూశాడు. ధర్మయ్య మొగంలో అలాంటి మార్పు బహుశా జమిందారా క్రితం చూచి ఉండడు. "బాధగావుందా?" మళ్లీ జమిందారే అన్నాడు.

"బాధగానే కాదు...ఆలా చేయకూడని బాధ్యత కూడా ఉంది."

"ధర్మయ్యా!" ఎర్రగా చూస్తూ ఏకవచనంతో పిలిచాడు.

"అప్పను ధర్మయ్య అధర్మంగా ప్రవర్తించలేను." ధర్మయ్య ఆ పరిస్థితిలో అక్కడనుండి వెళ్ళిపోవడం మంచిదిగా తోచింది. వెనక్కి తిరిగాడు.

"ధర్మయ్యగారూ!" మళ్ళీ జమిందారు స్వరం తగ్గించి మర్యాదగా పిలచాడు. ధర్మయ్య ఆగాడు.

"గతాన్ని మరవడం మానవుల ధర్మమైతే, మీ ధర్మయ్య అనే పేరు అలాంటి అర్థంతోనే నిండిఉంటుంది..."

"మరువలేను. ఎవరన్నా బలవంతంగా మరపించాలని ప్రయత్నించినా—ఆ గుర్తు హృదయంలో గంటుపడి, లేని గొడవలు తీసుకవస్తుంది...క్షమించండి—మీరు చెప్పిన పని చేయలేకపోయినా—మీవుద్దేశ్యాన్ని గుర్తించిన ధర్మయ్య! మీ భావానికి వ్యతిరేకంగా వెల్లడిచేయడని గ్రహించండి శలవ్" ధర్మయ్య గది దాటి వెళ్ళిపోయాడు.

తాను ధర్మయ్యపోషణకు ఆధారంగా చూపిన బడి పంతులు ఉద్యోగం వేలుపెట్టి చూపి గతాన్ని విస్మరించ వద్దని హెచ్చరించబోతే, ఆ మరుపు అనే పదాన్ని ఆధారం గానే తనలో నిలిచిన కురుపును ఆ వేలుతోనే చూపించి, కనిపించని ఆ గాయాన్ని ఉందని వెల్లడి చేయనులే అని వ్యంగ్యోక్తితో భరోసాయిచ్చి వెళ్ళిన ధర్మయ్య తెలివికీ,

గంభీరతకూ, జమిందారు ఆశ్చర్యపోయాడు. పైగా తాను పని రహస్యంగా ఉంచాలని తలచాడో అది ధర్మయ్యకు తెలిసిపోయింది. అలాగే కుర్చీలో కూర్చుని ఆలోచనలో పడిపోయాడు.

మరునాడే ధర్మయ్య ఉద్యోగానికి భిన్నం ఏర్పడింది. గంగాధరంగారినుండి చిన్న లేఖ అందినది. "ఈయాభయ్యో సంవత్సరంలో మనస్సు స్థిమితంగా ఉండని మాట నిజం. పైగా పాతిక సంవత్సరాలు ఉద్యోగంచేసిన మీాకు ధర్మ ప్రకారం ఉచిత విశ్రాంతి నివ్వడం పాఠశాలాధికారులకు ధర్మం – ఆ ధర్మంతోనే తమరు యిక పాఠశాలలో విద్యాబోధన చేయవద్దని – చేయకూడదని – తెలియచేస్తున్నా." ఈ ఉత్తరం చూసిన ధర్మయ్య ఆశ్చర్యపడలేదు. కాని బరువుగా నిట్టూర్చాడు.

ఇందులో ఎవరికి మతిలేదో, భగవంతుడు అర్థం చేసుకోకుండా ఉండడని ధర్మయ్య నమ్మకం. అయితే ధర్మయ్య అధర్మంగా సంచరించడనే సంగతి వెల్లడి చేసిన దానికిగాను – ఇదికూడా ఒక ధర్మంగానే జమిందారు చూపిస్తూ లేఖ వ్రాయడంలో, అతని మేధాశక్తిని అభినందించలేదుగాని, తెలివి అనే పదార్థం ఉపకారానికి ఎంత పని చేస్తుందో – అపకారానికి కూడా అంతే చేస్తుందని అనుకున్నాడు.

ఈ పై సంఘటన జరిగిందల్లా సరిగ్గా రెండు సంవత్సరాల క్రితమే.

అప్పటికే రాము కాలేజీలో మొదటి సంవత్సరం చదువుతున్నాడు. తండ్రి ద్వారా ఆ మాట విన్నతర్వాత అంత తరచుగా ధర్మయ్య యింటికి పోవడల్లేదుగాని, ఎక్కడో ఒకచోట లక్ష్మిని చూడ్డం జరుగుతూనే వుంది.

ధర్మయ్యకు ఉద్యోగం లేకపోవడం గురించి రాము చాలా విచారించాడు. అయినా ఈ విషయంలో ఉదాత్తంగా తండ్రిని అడిగి సహాయం చేయగల ధైర్యం అతనిలో లేకపోయింది.



# 15

రవిలో ఈ మధ్య వచ్చిన విచిత్రమైన మార్పు యింటిల్లిపాదీ గమనిస్తూనేఉన్నారు. కాని అతనితో ఎక్కువగా మాట్లాడడానికి ఎవరూ సాహసించలేకపోతున్నారు. ఎంతో చనువుగా వుండే లక్ష్మికూడా అతనంటే ఒకవిధంగా భయపడుతూనే వుంది. కాని యింటి కంతటికీ ఆధారభూతుడుగా ఉన్న అతని మార్పునుగురించి తరచి అడగడం ద్వారా ఏలాంటి విపత్తు ఏర్పడుతుందో అనే అదురు శాంతమ్మకు కూడా లేకుండా పోలేదు.

ఆవేళ ప్రొద్దుతిరిగిన తర్వాత రవి భోజనానికి వచ్చాడు. లక్ష్మి చిరిగిన ధర్మయ్య చొక్కాను కుడుతూ వుంది. శాంతమ్మ కళ్ళజోడు పెట్టుకు భగవత్ గీతను పఠిస్తూ వుంది.

"ఇంత ఆలస్యమైందేం బాబూ?" అని పుస్తకం మూసి లేస్తూ శాంతమ్మ అడిగింది.

"అవును" ఇంతే సమాధానం ఇచ్చి, చొక్కా తీసి, భోజనం గదిలోకి వెళ్ళాడు.

శాంతమ్మ భోజనం పెట్టింది. ఆత్రంగా తింటూఉన్న రవిని దూరంగా ఉండి పరిశీలిస్తోంది.

"ఆదివారం కూడాను...పని లేదుగా"అని శాంతమ్మ అన్న వెంటనే, తలెత్తి చూశాడు.

"శాస్త్ర నమ్మదిగా తినమంటున్నా" అంది మెల్లగా.

"మజ్జిగ" అని అడిగాడు.

భోజనమై లేచిన తర్వాత చావిట్లో చేయి తుడుచు కుంటూ, శ్రద్ధగా చొక్కా కుడుతున్న లక్ష్మికేసి చూస్తూ నిలబడిపోయాడు.

"ఎల్లుండి నాన్నగారి తద్దినం."

"అయితే?" వెనక్కి తిరిగి చూశాడు.

"ఒక బ్రాహ్మణ్ణి పిలవాలి."

"ఎందుకమ్మా ఆ మూఢ నమ్మకాలు?" తీవ్రంగా చూస్తూ అడిగాడు. ఈలాంటి మాట రవినోటినించి రావడం యిదే మొదటిసారి. శాంతమ్మ స్తబ్ధంగా నిలబడిపోయింది. పనిచేస్తూ లక్ష్మి ఒకసారి రవికేసి చూసింది.

"మూఢ నమ్మకాలా?" కాస్సేపటికి తిరిగి అదేమాట అడిగింది శాంతమ్మ.

"అవును పరలోకంలో ఆయన ఆత్మ శాంతిస్తుందని ఇక్కడ బ్రాహ్మణుల బొజ్జలు నింపాలి...పరలోకంలో... ఆత్మ" అంటూ చొక్కాను దండెంమీదనుంచి తీసి, తొడుక్కుంటూ అన్నాడు.

"బావ దృష్టిలో దేవుడు కూడా లేడు—" అంటూ లక్ష్మి కుట్టిన చొక్కా తీసుకు లేచింది.

"ఉంటే నువ్వు చూపించగలవా?"

వెళ్ళే లక్ష్మిని చూస్తూ ప్రశ్నించాడు. లక్ష్మి వెనక్కి తిరిగి చూసింది గాని సమాధాన మివ్వలేదు. ఈ ప్రశ్న వేయడం ఎంత సులభమో సమాధానం అందజేయడం అంత కష్టమని లక్ష్మికి కూడా తెలుసు.

శాంతమ్మ గట్టిగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పులో రవి మార్పును గమనించిన ధ్వని ఉంది. బల్లమీద కూర్చుంది.

"రవీ!"

గుమ్మంలోనుంచి వెళ్ళిపోతున్న రవిని పిలచింది శాంతమ్మ. రవి ఆశ్చర్యంగా చూచి తల్లిదగ్గరగా వచ్చాడు.

"నేను చచ్చిన తర్వాత కూడా నువ్వు ఇదే పని చేస్తావుకదూ?" కంఠం గద్గదికంగా ధ్వనించింది.

ఇంత సులభంగా అన్న మాట తల్లికి ఏలాంటి బాధ కలిగించిందో కాస్త అర్థం చేసుకున్నాడు. కాని, తల్లితండ్రులు మగబిడ్డకు విశేష ప్రాధాన్యత యివ్వడంలో ఉండే మహత్తర సత్యాన్ని గాని, బ్రతికినంతకాలం బిడ్డల పోషణకు బాధపడి, దూషణ తిరస్కారాలకు సహిస్తూ, చచ్చిన తర్వాత కాస్త పిండోదకాలు విడుస్తాడనే నమ్మకంతో సంతృప్తితో జీవిస్తారనే ఊహగాని అతనికి కలుగలేదు.

వచ్చాడు, తల్లిదగ్గరగా కూర్చున్నాడు. "ఎందుకమ్మా అంత బాధపడతావ్?" అని అడిగాడు.

ఆమె కళ్ళు తుడుచుకుంది. "భగవంతుడంటే నీకు నమ్మకంలేదా?" అని అడిగింది.

"ఇదివరకు ఉండేది. యిప్పుడు లేదు."

"కారణం?"

"నిజాన్ని తెలుసుకున్నాను కాబట్టి."

శాంతమ్మ కోపంగా బల్లమీదనించి లేచింది. లోపలకు వెళ్ళబోతోంది. "అమ్మా!" అని పిలిచాడు రవి.

"నీలాంటి నాస్తికుడు నాకొడుకై పుట్టినందుకు, భగవంతుడు నాకేదైనా శాస్తి యిస్తే అనుభవిస్తాలే, వెళ్లు!" అని లోపలకు వెళ్ళిపోయింది.

రవి చాలా ఆశ్చర్యపడ్డాడు. భగవంతునిపట్ల తల్లికున్న ప్రగాఢ నమ్మకానికి, కాస్త కష్టం కూడా అనిపించింది. ఆధ్యాత్మికంగా, ఆస్తిక భావాలతో హిందూదేశం ఎంతో పతనమైందని ఈమధ్యనే గ్రహించిన రవి, ఈలాంటి మూఢ నమ్మకాలు తుడిచిపెట్టే బాధ్యత తనలాటి వాళ్ళమీదనే ఉందని కూడా తెలుసుకున్నాడు.

మంచంమీద కూర్చొన్న తల్లి దగ్గరకు రవి వచ్చాడు. శాంతమ్మ ఒకసారి చూసింది కాని మాట్లాడలేదు.

"నీకు తెలీదమ్మా! భగవంతుడి పేరు చెప్పి దేశాన్ని, ప్రజల్ని ఎంతో మోసం చేశారమ్మా" అన్నాడు.

శాంతమ్మ రవికేసి చూసింది. "ఎవరు మోసం చేశారు?" ఇదే ప్రశ్న ఆమె చూపులో ఉంది. కాని రవి అర్థం చేసుకోలేదు.

"కర్మ అనీ ధర్మమనీ, పేదవాళ్ళ కడుపుకొట్టి..."

"ఆగు—" శాంతమ్మ కష్టంగా అరచింది.

రవి ఇక మాట్లాడలేదు. "నేను మీ నాన్నగారి తద్దినం గురించి మాట్లాడానుగాని, ఈ ఉపన్యాసాలు నా క్కావాలని కాదు...సరే! నన్నిప్పు డేమీ మాట్లాడించకు వెళ్ళు."

రవి మంచంమీదనుంచి లేచాడు. తన ప్రాథమిక విజ్ఞాన ప్రచారం ఆమెపై ఏవిధంగానూ, ప్రసరించలేక పోయినందుకు కష్టంగానే వుంది.

"మూర్ఖుల్లో మార్పు రావడం కష్టం" మెల్లగా వినుగ్గా గొణుక్కున్నాడు.

శాంతమ్మ రవికేసి కోపంగా చూసింది. పదాల అర్థాన్నికూడా మరచి మాట్లాడే మస్థితివరకూ పోయాడే అని ఆమె కోపం; కాని, వెంటనే శాంతించి "నేనూ అదే అనుకుంటున్నాను" అంది.

ఆ పదంయొక్క భావం తనకే వర్తించే విధానంలో అనిన తల్లిమాటలకు రవి ఉరిమి చూస్తూ "దేవు డెక్కడు న్నాడు? న్యాయ మెక్కడుంది?...కష్టపడేవాళ్ళకు కూడు లేదు...మోసగాళ్ళదే రాజ్యమైపోయి ఊరుకుంది......" అతని కళ్ళల్లో ఆవేశం శాంతమ్మ చూసింది. మాటల్లో ఆవేదన కూడా ఉంది. అయితే రవిని నీచుడుగా మాత్రం

అపార్థం చేసుకోడు. నిష్కల్మషమైన అతని హృదయంలో పేదవాళ్ళ కేకలు! దుర్మార్గుల మోసాలు! ద్వంద్వయుద్ధం చేయ ప్రారంభించాయి. ఏది సత్యం? ఇదే అతని మనోన్వేషణ.

"మనుష్యుల పోకడకు దేవుడు బాధ్యుడు కాడు బాబూ!" అంటూ శాంతమ్మ మెల్లగా లేచి "దేవుణ్ని నిజంగా చూసినా నువ్వు నమ్మే స్థితిలో లేవు" అంది.

రవికి ఆశ్చర్యం కలిగింది. కోపంగా కూడా ఉన్నాడు. "నమ్మడం కాదు. నాకు కనిపిస్తే జుట్టుపట్టుకొని, నీపాలనలో న్యాయానికి శిక్ష ధర్మానికి దగా ఎందుకు జరుగుతుంది? మంచివాళ్లు కష్టజీవులు కూడు లేక మాడటం... మోసగాళ్లు సోమరిపోతులు తెగతిని గెలిచేయడం ఎందువల్ల?..."

శాంతమ్మ నవ్వు ఆపుకోలేకపోయింది. ధర్మయ్య కూడా వచ్చి నిలబడి రవి ఆవేశాన్ని చూస్తూ ఉండిపోయాడు.

"ఎందుకమ్మా నవ్వు?" తల్లిని చూస్తూ అడిగాడు. మళ్ళీ ధర్మయ్యను చూశాడు. ధర్మయ్యముందు ఎప్పుడూ అతను ఎక్కువగా మాట్లాడడు. తిన్నగా చావిట్లోకి వెళ్ళిపోయాడు. లక్ష్మి గుమ్మందగ్గర నిలబడి ఉంది.

"బావా" అని పిలవడంవల్ల ఆగిపోయాడు.

"బెల్ల మేలా ఉంటుంది?"

"తియ్యగా వుంటుంది."

"ప్రేమ అంటే..."

"అంటే?"

"దాని ఆకారం..."

"నా కర్థం కావడంలేదు!"

అగమ్యంగా చూస్తున్నాడు. లక్ష్మి నవ్వుతూ అంది "దేవుడు కూడా నీ కర్థం కాడులే వెళ్ళిరా!"

లోపలకు వెళ్ళిపోయింది. ఈ ప్రశ్నలో వ్యంగ్యం ఏమిటో అర్థం చేసుకోడానికి కాస్సేపు ఆలాగే నిలబడి పోయాడు. ముందు వేసిన ప్రశ్నకు ఇదే సమాధానంగా లక్ష్మి సూచించిందని అతను ఊహించుకోలేకపోయాడు. బైటకు వెళ్ళిపోయాడు.

గదిలోంచి ఈ మాటలు వింటూ ధర్మయ్య శాంతమ్మ అలాగే నిలబడిపోయారు. రవి బైటకు వెళ్ళిపోయినట్లుగా గుర్తించిన శాంతమ్మ ఒక్క నిశ్వాసం విడిచిపెట్టింది. ధర్మయ్య ఆమె కేసి చూశాడు.

"రవిలో ఈలాంటి మార్పు వస్తుందని నే ననుకో లేదు." శాంతమ్మ భయంగా చూస్తూ మెల్లగా అంది.

ధర్మయ్య ఆమె కేసి చూశాడు. ఏమీ సమాధానం చెప్పలేదు.

"అన్నయ్యా! రవి పాడైపోతాడేమో?" శాస్త్రి ఆత్రంగా అడిగింది.

"ఏంటమ్మల్లి?" ధర్మయ్య ప్రశ్నించాడు.

"దేవుడిమీద నాకే మాత్రం విశ్వాసం లేదు" అని మెల్లగా అంది.

ధర్మయ్య నవ్వాడు. ఆ నవ్వు ధ్వనించలేదు కాని సహజమైన నవ్వుగానే శాంతమ్మ గుర్తించింది.

"ఎవరో వెనకనుండి మనల్ని నడిపిస్తున్నారని కళ్లు మూసుకొనిపోతే; పాపమనే గోతిని గాని, పుణ్యమనే ఎత్తు గాని మనం పరిశీలించలేం, కాకుండా ఎప్పుడో ఒకప్పుడు పెద్ద అఘాతంలో కూడా పడిపోతాం. కాని భగవంతుడిచ్చిన ఇంద్రియ ధర్మాన్ని గుర్తించి కళ్లు తెరుచుక గమనిస్తే; గోతులూ గొప్పులూ స్పష్టంగా చూస్తూ – తోచిన మంచి దారినే నడుస్తాం" అని శాంతమ్మకేసి చూశాడు. ఈ ఉదాహరణలో ఏలాంటిభావం యిమిడుందో ఆమె ఆలోచిస్తున్నది. ధర్మయ్య వెళ్ళబోతూ ఆగి "నేను భగవంతుణ్ని నమ్మాను... కాని ఆయనకు ఆకార వికారాలు నేనేమీ అంటగట్ట లేదు...అయితే నా యిన్నేళ్ల జీవితానుభవం చెప్పింది మాత్రం ఒక ఛే–గుడ్డితనంతో కూడిన ఆస్తికత్వానికన్నా – విమర్శనతో కూడిన నాస్తికతయే చాలా మంచిదని..." మళ్లీ కాస్సేపు ఆగి తర్వాత ఆనందంగా నిట్టూర్చి "తాను లేడని వాదించినా – సత్యంకోసం ధర్మంకోసం వ్యథపడే బిడ్డలను.....భగవంతుడు హృదయ పూర్వకంగా క్షమి

స్తాడు...క్షమించడమే కాదు, అజేయమైన శక్తిని కూడా యిస్తాడు...కాని తాను వున్నాడని విశ్వసించి ప్రజలూ, పునస్కారాలు చేస్తూ తప్పును భగవంతునికే కప్పువ్రాసి, ఒప్పును తన గొప్పగా జమ కట్టుకొనే పిల్లల చేష్టలను ఎంతో కాలం సహించడు" ఈ మాటలని ధర్మయ్య వెళ్ళి పోయాడు.

శాంతమ్మ హృదయం కాస్త తేలికపడింది. ఎదురుగా కృష్ణుని పటం కనిపిస్తే, చేతులెత్తి "ఓ భగవాన్! అజ్ఞానంలో కళ్లు మూసిన బిడ్డను విజ్ఞానంతో విర్రవీగే బిడ్డను కూడా సమానంగా క్షమించు బాబూ" అంది.

కనుచీకటి పడే సమయంలో వారం రోజుల తర్వాత ఈనాడే ధర్మయ్యగారి వీధిగుమ్మం ఎక్కాడు రాము. సంజ దీపం వెలిగించి చావిట్లోకి తెచ్చిన లక్ష్మి గుమ్మంలో ఎవరో నిలబడినట్లుగా గుర్తించింది. దీపం బల్లదగ్గరున్న గూటిలో పెట్టి అలాగే చూస్తోంది.

"లక్ష్మీ" రాము పిలిచాడు.

సమాధానం యివ్వకుండా లక్ష్మి లోపలకు వెళ్ళి పోయింది. అలా జరగడం గురించి రాము ఆశ్చర్యపడలేదు. ఎక్కువ రోజులు లక్ష్మికి రాము కనిపించకపోతే; ఈలాగే జరుగుతుందని అతనికి తెలుసు. గదిలోకి వెళ్లాడు.

"మాస్టారు ఏరీ?" గదంతా పరికించిన మీదట ఈ ప్రశ్న వేశాడు రాము.

"దేవాలయానికి వెళ్లాడు" అని క్లుప్తంగా సమాధానం చెప్పింది. వారం రోజులనుంచి దేవాలయంలో పురాణ కాలక్షేపం జరుగుతూంది. వయస్సుమీరిన పెద్దలంతా, రాత్రి 9 గంటలవరకూ పురాణం వింటూ అక్కడే ఉంటున్నారు. అదే ఆలోచిస్తున్నాడు రాము.

"ఇన్ని రోజులుగా..." మాట పూర్తి కాలేదు. ఆ ధ్వని క్షోభతో నిండివుంది. రాము ఆశ్చర్యంగా అటు చూశాడు.

"నీకు తెలీదూ?"

ఏమిటన్నట్లు చూసింది లక్ష్మి.

"పరీక్షలుగా - సరే! మీ అత్తేది?"

"వంట చేస్తోంది."

రాము ప్రక్కనున్న కుర్చీమీద కూర్చున్నాడు. లక్ష్మి ఆలాగే నిలబడిఉంది. వాళ్ల యిద్దరి మనస్సులో ఏదో నిస్తబ్ధత ఏర్పడింది. మాట్లాడే విషయాలు చాలా ఉన్నాయని ముందు యిద్దరూ అనుకున్నా - ఇప్పుడు మాట్లాడే సంగతులే లేనట్లుగా ముభావంగా ఉన్నారు.

చిన్ననాటి చెలిమి, ఆట పాటలు ఇద్దరి మనస్సులో చిత్రరూపాలై చిరుగంతులు వేస్తున్నాయి.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ లక్ష్మినుండి బరువైన ఒక నిట్టూర్పు వచ్చింది. రాము ఆమెకేసి ఆలాగే చూస్తున్నాడు

"అత్తను పిలవనా?"

"అక్కర్లేదు."

వయోప్రాయంలో ఉన్న యువతీయువకులు జంటగా ఒకే గదిలో ఉంటే ఏలాంటి అపాయం వాటిల్లుతుందో రాముకి అంతుపట్టినట్లులేదు. లక్ష్మి మెల్లగా కదిలి చావిట్లోకి వచ్చింది.

"వెళ్ళిపోతున్నావేం?"

"పనేముంది" అని లక్ష్మి ఉదాసీనంగా సమాధానమిచ్చింది.

రాము ఆలోచనపరుడేగాని, అస్వతంత్రుడు. ఆసంగతి తనకేకాదు లక్ష్మికి కూడా తెలుసనుకుంటాడు రాము. కాని లక్ష్మి అలా ఎప్పుడూ ఊహించలేదు.

ఈరోజు ఆదివారం కావడంవల్ల రవి పెందలాడే యింటికి వచ్చాడు. గుమ్మం ఎక్కడంతో ఎదురుగా లక్ష్మి కనిపించింది.

"రవీ"

ఈ మాటవిని గదివేపు చూశాడు. రాము కనుపించాడు. సంతోషంగా దగ్గరకు వస్తాడని రాము ఊహించాడు. కాని అలా జరగలేదు. కనీసం తిరిగి పలకరించలేదు రవి. లోపలకు వెళ్ళిపోయాడు.

రాము ఆశ్చర్యంగా చూస్తూ లేచాడు. చావిట్లోకి వచ్చాడు.

"లక్ష్మీ! రవి మాట్లాడలేదేం?"

"వినిపించలేదేమో."

"చెప్పకు కామగా."

"నాకు తెలీదు." లక్ష్మి మెల్లగా అక్కడనించి వెళ్ళి పోయింది. రాము అలాగే నిలబడి ఆలోచిస్తున్నాడు.

రవిలో ఈ మార్పునకు కారణం అతని ఆలోచనకు తట్టలేదు. ధనికులపట్ల పెరుకుంటూ వచ్చిన రవిలోని కక్ష... పూర్తిగా గడ్డకట్టనూలేదు... నీటిరూపంలో పల్చగానూ లేదు...మధ్యస్థంగా మలినంతో కలిసి నిలిచిపోయి ఉంది.

బాల్యస్నేహితుడైన రాము అన్న అని రవికి తెలియకపోయినా, ధనికుని బిడ్డ అయినంతమాత్రాన్న అతను చేసిన నేరం ఏమిటో నిర్దుష్టంగా రవీ చూపించలేదు.

"అత్త పిలుస్తూంది" తిరిగివచ్చిన లక్ష్మి ఈ మాట అనడంతోనే ఆలోచన్నుండి తేరుకొని రాము బరువుగా పాదాలు వేసుకుంటూ గదిలోకి వెళ్ళాడు.

"ఏం బాబూ!ఎంత సేపయింది వచ్చి?" పెరటిగుమ్మంలో నిలబడి ఆనందస్వరంతో అడిగింది శాంతమ్మ.

"పది నిమిషాలవుతుంది" అని ముక్తసరిగా చెప్పి డ్రాయరు కేసి చూశాడు. రవి అప్పుడే తీసుకవచ్చి బల్లమీద పెట్టిన భౌతికవాదం, జీవపరిణామం పుస్తకాలు కనిపించాయి.

"ఈ పుస్తకాలు ఎవరివి?" అని అడిగాడు.

"రవి యిప్పుడే లేచాడు" అని లక్ష్మి సమాధానం చెప్పింది. రాము ఒక పుస్తకం తిప్పి చూస్తున్నాడు.

"నువ్వు చదవ దగ్గవి కావు"

స్నానానికి తుండు కట్టుకొని వచ్చిన రవి, రాముకేసి చూస్తూ అన్నాడు.

రాము ఆశ్చర్యంగా చూశాడు. "రాసేవాళ్ల ఉద్దేశ్యం అది కాదేమో" అన్నాడు.

"చూశాను కాబట్టి నా ఉద్దేశ్యం అది" అని తిరిగి సమాధానం అందుకోకుండానే దొడ్డివైపుకు వెళ్ళిపోయాడు.

"రవిలో చాలా మార్పువచ్చింది" పుస్తకం బల్ల మీద విడచి మ్లానంగా నవ్వి "వెళతానమ్మా" అని శాంతమ్మకేసి చూశాడు.

శాంతమ్మ మెల్లగా "వాడి తరహా మొదట్నుంచీ అంతేగా బాబూ! నువ్వేం అనుకోబోకు" అంది.

"మర్యాదనీ, స్నేహాన్నీ మరచిపోయే తరహా మంచిది కాదని రవికి తెలీదులే..." అంటూ ఒక్కసారి శాంతమ్మకేసి తీవ్రంగా చూస్తూ "అయినా నేను రవికి చేసిన లోపం?" అని ప్రశ్నార్థకంగా చూస్తూ నిలబడిపోయాడు.

శాంతమ్మ సమాధానమివ్వలేదు. క్రోధం క్షోభ అతని హృదయంలో నిండి, అవమాన భారంతో మండి పోతున్నట్లుగా శాంతమ్మ గుర్తించింది.

సమాధానం రాకపోవడంవల్ల "కాస్సేపటి వరకూ చూసి వెళతాను" అంటూ చావిట్లోకి తిరిగి వచ్చాడు.

లక్ష్మి వెనకాలనే వస్తుందని రాము గుర్తించాడు.

"నేను అంత ఎక్కువగా రాకపోవడం మంచిదేమో" అని తనలో గొణుక్కున్నాడు.

"రాముా" కాస్త బిగ్గరగా లక్ష్మి అంది. రాము వెనక్కు తిరిగి చూశాడు. లక్ష్మి కళ్ళల్లో నీళ్లు ఉన్నాయి.

"నిన్ను బాధపెట్టడం నా ఉద్దేశం కాదు. రేపు వీలుంటే వస్తా" అని అన్నాడు. లక్ష్మి ఎందుకలా అరచిందో యిప్పుడు ఆలోచిస్తూంది. కళ్లు తుడుచుకుంది. కాని సమాధాన మివ్వలేదు.

రాము మెట్లు దిగేసరికి ధర్మయ్య ఎదురుగా వచ్చాడు.

"వెళ్ళిపోతున్నావేం బాబూ?" అని సరళంగా అడిగాడు.

"వెళ్ళాలి" ఇంతకుమించి సమాధాన మివ్వలేదు.

ధర్మయ్య గుమ్మం ఎక్కి అలాగే రాముకేసి చూస్తూ ఉండిపోయాడు. కాస్సేపాగి లోపలకు చూశాడు. లక్ష్మి చావిట్లో ఉంది. ఆ వెనకాల రవి పట్టు తొడుక్కుంటూ నిలచి వెళ్లే రాముకేసి చూస్తున్నాడు.

# 16

మరునాడు శాంతమ్మ ఉదయాన్న ఏమీ ముట్టలేదు. ఒకసారి లేచి మళ్ళీ పడుకుంది. ఈరోజు లక్ష్మే ఇంటిపనులన్నీ చూస్తూంది. రవి ఉదయాన్నే ఖార్ఖానాకు వెళ్ళాడు.

తనగదిలో భగవత్గీతను పఠిస్తున్న ధర్మయ్య ఏదో శబ్దం కావడంవల్ల తలెత్తి చూశాడు. లక్ష్మి విసనకర్ర తీసుక వెళుతోంది.

"ఎవరికమ్మా?"

"పొయ్యి రాజటల్లేదునాన్నా. ఊదిఊది కళ్ళెంబట నీళ్ళుకూడా వచ్చాయి... విసురుదామని" అని గదిదాటి వెళ్ళింది లక్ష్మి. మళ్ళీ ధర్మయ్య వెనక్కి పిలిచాడు.

"శాంతమ్మ ఎక్కడ?"

"ఒంట్లో భారంగాఉన్నట్లుంది. ప్రొద్దున్నించీ లేవ లేదు" అని చెప్పింది. ఈమాట విన్న ధర్మయ్య చాలా ఆశ్చర్యపడ్డాడు.

"నా కెవరూ చెప్పలేదే" అని కూడా అడిగాడు.

"నాకూ తెలీదు నాన్నా" అని మళ్ళీ లక్ష్మి అంది.

"బాగుంది" అంటూ పుస్తకం ప్రక్కగా పెట్టి లేచాడు. లక్ష్మి వంటగదిలోకి వెళ్ళింది.

"శాంతమ్మా" అని మంచందగ్గరగా నిలబడి ధర్మయ్య పలకరించాడు.

"ఊఁ" అంటూ లేవడానికి ప్రయత్నించింది.

"పడుకోమ్మా ఫరవాలేదు" అన్నాడు. కాని శాంతమ్మ లేచి మంచంమీద కూర్చుంది.

ప్రక్కగా ముక్కాలిపీటమీద ధర్మయ్య కూర్చున్నాడు.

"ఏం? వంట్లో బావుండలేదా?"

"అబ్బే! ఏదో కొంచం భారంగా ఉన్నట్లుంది" అని దీనంగా సమాధానం చెప్పింది శాంతమ్మ.

"వైద్యుణ్ణి పిలవనా?"

శాంతమ్మ కాస్త కంగారుపడింది. "వద్దన్నయ్యా... నాకేమిటో మనస్సు బావుండక పడుకున్నా అంతే" అని నిజం చెప్పింది.

ధర్మయ్య శాంతమ్మ మొగంకేసి చూస్తున్నాడు. ఆమె ఉదాసీనవదనంలో తీరని వ్యథ గోచరించింది. మనస్సు బాగోలేకపోవడానికి కారణాన్ని ఊహిస్తున్నాడు.

"నువ్వు అలా ఊరుకుంటేలాభంలేదన్నయ్యా" అంది. ఈమాట ఎవరిగురించి అంటోందో ధర్మయ్యకు హఠాత్తుగా మాత్రం అర్థం కాలేదు. విస్మయంగా ఆమెకేసి చూస్తున్నాడు.

"నిన్న చూశావుగా వాడి ప్రవర్తన..." అని మళ్ళీ అంది. ధర్మయ్య గ్రహించాడు. రాము విషయంలో

రవి ప్రవర్తన చూడలేమగాని, విన్నాడు. అయితే ఆ స్వల్ప విషయం గురించి మా తృ హృ ద య ం ఇంత క్షోభతో నిండుతుంది అని అనుకోలేదు.

"పిచ్చితల్లి" అంటూ నవ్వాడు. మళ్ళీ ఈలా అన్నాడు "దానిగురించేనా నువ్వు మంచం పట్టింది?"

ధర్మయ్య ఈ విషయాన్ని ఇంత తేలిగ్గా చూస్తాడను కోలేదు. చినికి చినికి గాలివాన కావచ్చనే శాంతమ్మ నమ్మ కాన్ని అతడు అర్థం చేసుకోలేదు.

"నీకు తెలీదన్నయ్యా! రాము వాడికేం విషం పెట్టాడు? రామంటే ఎందుకు విరోధం పెంచుకోవాలి?... అప్పుడప్పుడూ వస్తూంటే నా మనస్సు కాస్త కుదటపడు తుంది. రవి ఈలా ప్రవర్తిస్తే రాము మన గుమ్మం ఎక్క గలడా?" ఈ కంఠస్వరంలో ఆత్రంతో బాటు ఆవేదనకూడా కలసింది.

ధ ర్మ య్య మాటలు వింటూనే ఆలోచిస్తున్నాడు. కాని ఏవిధమైన సమాధానం యివ్వలేదు.

మళ్ళీ శాంతమ్మ "రాము వాడి దృష్టిలో పరాయి వాడే కావచ్చు. అంతమాత్రాన్న కలవాళ్ళను విరోధులుగా చేసుకోవడం మంచిదంటావా అన్నయ్యా?" అని అడిగింది.

దానిక్కూడా ధర్మయ్య సమాధానం యివ్వలేదు.

"ఇంత కఠినుడయ్యావేమిటి...తండ్రి తద్దినం పెట్టనవే వాళ్ళు ఎవరన్నా ఉంటారా?"

ఈ ఆఖరిమాటలు గద్గదికంగా ధ్వనించాయి. శర్మయ్య లేచాడు. "సరే! మనసు బాగోనప్పుడు పడుకోవడంమంచిది. కాని నువ్వు యింత ఆందోళన పడేంత విపత్తు ఏమీ ముంచుకరాలేదమ్మా...నేనుండగా నీకా భయమేమీ అక్కర్లేదు"...అని తన ఆత్మవిశ్వాసాన్ని వెళ్ళడిచేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

మంచి ఎండలో రిపేరుకొచ్చిన మోటార్ సైకిలెక్కి రవి వచ్చాడు. కారు ధ్వని విని లక్ష్మి వెలుపలకు వచ్చి చూసింది. మళ్ళీ తిరిగి లోపలకు వెళ్ళింది.

రవికి స్వంతవాహనం లేనికారణంగా, ఒకసారి సైకిలూ, మరోసారి మోటార్ సైకిలూ, లేకపోతే కాళ్ళ నడకతోనూ యింటికిరావడం పరిపాటి.

చెమట తుడుచుకుంటూ వచ్చిన రవి "లక్ష్మీ" అని పిలిచాడు. లక్ష్మి గదిలోనించి వచ్చింది.

"అమ్మ లేవలేదూ?" అని అడిగాడు.

తెల్లవారుఝాము నాలుగుగంటలకే లేచి పనిపాటలు చూసుకునే శాంతమ్మ, ఈరోజు ఏడుగంటలవరకూ లేవక పోవడం పనిలోకి వెళ్ళేముందు చూశాడు.

"లేదు"

"సరే!" చొక్కా తీసి దండేనవేస్తూ "కాస్త అన్నం పెట్టు" అన్నాడు.

లక్ష్మి తిరిగి వెళ్ళిపోయింది. రవి తల్లి మంచం దగ్గరకు వచ్చాడు. చూసి శాస్త్రి ముందుకు వెళ్ళాడు. మళ్ళీ ఏం ప్రశ్న ఎదురౌతుందో వెనక్కి తిరిగి "అమ్మా" అని పిలిచాడు.

సమాధానం రాలేదు. రవి మళ్ళీ శాస్త్రి బిగ్గరగా "అమ్మా" అని పిలచి కాళ్లదగ్గర కూర్చున్నాడు. ప్రక్కగా ఒదిగి పడుకున్న తల్లి తలమీద చేయివేసి "ఒంట్లో ఏలా వుంది?" అని అడిగాడు.

"బాగానేవుంది" భారంగా వినిపించిందా కంఠం. లక్ష్మి అన్నంపెట్టి అక్కడ కొచ్చి నిలబడింది.

"ఏం లక్ష్మీ! అమ్మ ఈలావుందేం?" అమాయకంగా అడిగాడు. లక్ష్మి ఏదో చెప్పాలని నోరు తెరచింది. అంతలోనే తండ్రి గుమ్మం ఎదురుగా నిలబడ్డంవల్ల ఆగిపోయింది.

"నీలాంటి కొడుకుని కన్నవాళ్ళు ... అప్పుడప్పుడూ ఈలా ఉండటం అలవాటులే..." అన్నాడు ధర్మయ్య.

వెనక్కి తిరిగి ధర్మయ్యకేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆ వ్యంగ్యశరాఘాతం సూటిగా రవి హృదయానికే తగిలింది. తనగురించే తల్లి ఈలా వుందనే సత్యాన్ని వెంటనే గ్రహించాడు.

"నేను చేసిన తప్పేమిటండీ?" మంచంమీదనుంచి లేచాడు. మొదట్నుంచీ గురుభావంతో ధర్మయ్యను చూడ్డం వల్ల ఆ మర్యాదపదం వాడటం అలవాటైపోయింది.

"నీకు తప్పుగా తోచని ప్రతిదాన్ని ఒప్పని అనుకో వడంకూడా ఒక తప్పు... అయితే రాత్రి నీ బాల్య స్నేహి తుడికి కిచ్చిన ఆతిథ్యం చాలా ఒప్పైందే అంటావ్" ఈమాట సూటిగా చూస్తూ ప్రశ్నించాడు.

రవి నివ్వెరపడి మొదటచూశాడు. తరువాత ఆలోచిస్తున్నాడు.

"కని పెంచి పెద్దచేసిన తండ్రి తనువు చాలిస్తే; సంవత్సరానికి ఒక్కరోజు ఆయన్ని స్మరిస్తూ పిండాన్ని విడవడంకూడా తప్పంటావ్" ఈ మాటలంటూ ధర్మయ్య దగ్గరకు వచ్చాడు. శాంతమ్మ పండుకున్నదల్లా లేచికూర్చుంది.

"రవీ! ఇంటగెలచి రచ్చగెలవడం చాలా మంచిది... కాని యింటిల్లిపాదికీ బాధగలిగించే ఒక గొప్పను చూపించినా ఫలితంలేదు... తెలివి ఉంటే నువ్వు నమ్మిన సత్యాన్ని, సహనంగా సాత్వికంగా బోధించి పరివర్తన తీసుకురా! అంతే గాని, దౌర్జన్యంగా నువ్వు అమృత మిచ్చినా విషతుల్యమే అవుతుంది ఏమంటావ్?" ఈ ఆఖరి మాట గట్టిగా అన్నాడు. రవి మాట్లాడలేదు.

"నువ్వు దేశ మాతను కళ్యాణవంతంగా చేయదలస్తే; మాతృహృదయాన్ని బాధపెట్టమని ఎక్కడాలేదు..."

ఈ మాటలతో రవి కాస్త చలించాడు. ధర్మయ్య కేసి విమర్శనాయుతంగా చూస్తూ "ఇప్పుడు నన్ను మీరు ఏం చేయమంటారు?" అని అడిగాడు.

"నా తండ్రి తద్దినం పెట్టడానికి నీ కెందు కిష్టంలేదూ?"

"ఇష్టంలేదు" రవి కంఠం కాస్త కఠినంగా ధ్వనించింది. మాట అన్నతర్వాత, ఎందు కంత గట్టిగా అన్నానా? అని అతనే ఆశ్చర్యపడ్డాడు.

ఈమాటకు ధర్మయ్య మొగం వెలవెల పోయింది. ఈలాంటి సమాధానం వస్తుందని అత నెప్పుడూ ఊహించ లేదు. శాంతమ్మ ధర్మయ్యకేసి చూసింది.

"ఎందు కన్నయ్యా! నీ కా శ్రమ...వాడి చేతులు మీదుగా వచ్చే డబ్బుతో బ్రతికే స్థితి మనకు వచ్చింది...వాడు ప్రయోజకు డయ్యాడు...అందాకా వా డిష్టప్రకారం మనం నడవాలి...ఇంటి కెవరన్నా వచ్చినా వా డిష్టంతోనే రావాలి...వాడికి కష్టంగా ఉంటే కాని మాటన్నా పడి ఉండాలి..." శాంతమ్మ ఉద్రేకంగా అంటూ వచ్చిన మాటలు ద్వారా ఆమె కళ్ళల్లో నీళ్ళు, కంఠంలో రుద్ధత రవి ఎదురుగా ఉండి చూశాడు.

అతనికి మొదట్లో కోపంవచ్చింది. తరువాత ఆవేదన కలిగింది. రవి కళ్ళల్లోకూడా నీళ్ళు తిరిగాయి. మంచం దగ్గరగా చతికిలపడి, తల్లి కాళ్ళదగ్గర కూర్చొని "ఎందు కమ్మా మాటలతో నన్నీవిధంగా బాధపెడతావు. నా సంపాదనమీద బ్రతుకుతున్నారని నే నెప్పుడన్నా అన్నానా?... రాముతో మాటాడ లేదని నీకు కష్టం కలిగేటట్లయితే అతణ్ని

క్షమించమని కోరతాను" అంటూ కళ్ళు తుడుచుకొని లేచి ధర్మయ్యకేసి చూస్తూ "నాన్న పరలోకంలో ఉండి, మనం పెట్టే తిండికోసం చూస్తున్నాడని అమ్మకు నమ్మకముంటే; అది యీనాటి బ్రాహ్మలద్వారా ఆయన కందడమే జరిగితే ఆయన ముట్టనైనా ముట్టడని నాకు తెలుసు...ఇది ద్వేషంతో అనే మాట కాదు... శాస్త్రాలు సృష్టించిన సద్బ్రాహ్మణత్వం...సమసిపోయి చాలా కాలమైంది"...రవి కాస్సేపాగి మళ్ళీ మాట్లాడడానికి నోరు తెరచాడు. ధర్మయ్య గ్రహించాడు. ఈ మధ్యనే పుస్తకాల ద్వారా సంగ్రహించిన ఈ విజ్ఞానం ఉపన్యాసధోరణిలో ఎంత దూరంపోతుందో అతనికి తెలుసు.

"నీ ఉద్దేశం?" ధర్మయ్య తీక్షణంగా చూస్తూ అడిగాడు.

"నాన్న వయస్సులో ఉన్న పేదవాడికి, నాన్నను తల్చుకొని, కడుపారా తిండి పెడితే;..."

"ఆయనకు అందుతుందని నీకు నమ్మకముందా?" అని ధర్మయ్య వేసిన ప్రశ్నకు రవి మొదట్లో ఏదో అందామనుకొని, ఆ మాట అనడం ద్వారా తన నియమానికి ఎంత భంగం వస్తుందో గ్రహించి ఈలా అన్నాడు. "నమ్మకం విషయం అటుంచండి. నాన్న పేరుతో ఒకరోజయినా ఒక పేదవాడు సుఖమైన తిండి తినగలుగుతాడు. వాడి హృదయం

కృతజ్ఞతతో నిండిపోతుంది. మీ నమ్మకమే నిజమైతే కృతజ్ఞతాపూర్వకమైన ఆ సంతృప్తి నాన్నకు తప్పకుండా అందుతుంది.'' ధర్మయ్య నవ్వాడు. ఆ నవ్వులో సంతృప్తి ఉంది. శాంతమ్మ యింకా సంశయంతో అలానే చూస్తూంది. రవి దగ్గరగా ధర్మయ్య వచ్చి "అలానే చేద్దాం...అన్నం చల్లారిపోతోంది. వెళ్లి భోజనం చేయి'' అన్నాడు. తల్లికేసి చూశాడు రవి. ఆమె తలక్రిందకు వంచి ఏదో ఆలోచిస్తుంది.

"నేను వెళతానమ్మా''

"భోజనం?''

"నువ్వు?''

ఆమె మాట్లాడలేదు. రవి తల్లి చేయి పట్టుకున్నాడు.

"నువ్వు తింటేనే గాని నేను తినను.''

లక్ష్మి నవ్వుకుంటూ లోపలకు వెళ్ళిపోయింది.

శాంతమ్మ మెల్లగా లేచింది. మాతృ పుత్ర సంబంధంలో ఏలాంటి మధురత నిండిఉందో అని ఆలోచిస్తూ ఆనంద బాష్పాలు తుడుచుకుంటూ ధర్మయ్య వెళ్లే యిద్దర్నీ చూస్తూ నిలబడిపోయాడు.

చావిట్లో పంకాక్రింద కూర్చొని సిగరెట్టు పీలుస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్న రాముడుకు మోటర్ సైకిల్ ధ్వని వినిపించింది. మిట్టమధ్యాహ్నం ఎవరా వచ్చేదని తలతిప్పి చూశాడు.

రవి రెంటల్ సైకిల్‌కి స్టాండ్ వేసి, మెట్లు ఎక్కి గుమ్మందగ్గరగా వచ్చి నిలబడ్డాడు.

రాము ముందే గుర్తించడంవల్ల ఆలాగే కూర్చొని "రవీ! లోపలకి రావొచ్చు" అన్నాడు.

చిన్నతనంలో చూసిన ఆ భవంతిని పరిశీలిస్తూ రవి రాము దగ్గరగా వెళ్లాడు.

"కూర్చో"

రవి కూర్చున్నాడు. రాము ఆ రెండు మాటలు రవికి కాస్త ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆశ్చర్యమే కాదు, ఆలాంటి ఆహ్వానం లేకపోతే తన స్థితి ఏమయ్యేదో ఆలోచిస్తున్నాడు. నిన్న తాను చేసిన లోపం ఈ సంఘటనద్వారా, ద్విగుణీకృతమై అతని ఎదురుగా కనిపిస్తోంది.

రాము సిగరెట్టుటిన్ను చూపుతూ "తీసుకో" అన్నాడు.

"అలవాటు లేదు" రవి మాటలో నమ్రతా, సిగరెట్టు కాల్చని నియమం రాముకి సంతోషాన్ని కలిగించింది.

"ఈ మధ్య నువ్వు నేర్చుకోలేదూ?"

"లేదు"

సమాధానమిచ్చి మెదలకుండా కూర్చున్నాడు. వచ్చిన విషయాన్ని కదపడం అతనిలోని అభిమానం ఆమోదించడంలేదు.

"ఏమిటీ యింత ఎండలో వచ్చావ్."

రవి వెంటనే సమాధానం యివ్వలేదు. రాము ఆశ్చర్యంగా అలాగే చూస్తున్నాడు. రవి లేచాడు. "నీకు నా మీద కోపం వచ్చిందా?" అని అడిగాడు.

"లేదే" కూర్చునే సమాధాన మిచ్చాడు.

"నీకు లేకపోయినా అమ్మకు కోపం వచ్చింది; నా లోపం ఏదన్నా ఉంటే..." మిగతామాట పెగల్లేదు.

రాముకు అతని సిగ్గుతో నిండిన మొగం చూసి నవ్వొచ్చింది. నవ్వుతూ పైకిలేచి, రవి భుజంమీద చరుస్తూ "నీ తత్వం మొదటినించీ యింతే. తెలుసుండీ నే నెందుకు కోపం చేసుకుంటాను... ఈమాత్రం దానికి క్షమాపణ ఎందుకూ?" అన్నాడు.

రవి మనస్సు తేలికపడింది.

"సరే! వెళతాను. తప్పకుండా యింటికి వస్తూవుండు."

రవి వెళ్లి మోటర్‌సైకిలెక్కాడు, రాము అటే చూస్తున్నాడు.

"ఎవరూ?"

ఈ ధ్వని విని రాము వెనక్కు తిరిగి చూశాడు. మేడ మెట్ల మధ్యలో గంగాధరం గంభీరవిగ్రహం కనిపించింది. సిగరెట్ల టిన్ను తండ్రికి కనిపించకుండా దాచే ప్రయత్నంలో ఉన్నాడు.

"వచ్చిందెవర్రా?" మళ్లీ అదే ప్రశ్న వేశాడు గంగాధరం.

"ఒక స్నేహితుడు."

"పేరు వినకూడదా?" మెట్లు దిగుతూ అడిగాడు.

"రవి...అంటారు."

గంగాధరం రాముకేసి అలాగే చూసి వెనక్కి తిరిగి మేడ ఎక్కడానికి ప్రయత్నిస్తూ "రవా?" మళ్లీ రాముని చూసి "మోటర్ సైకిలుందా?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏదో రిపేరుకు వచ్చిఉంటుంది."

జమీందారు నవ్వాడు. ఆ నవ్వులో క్రితం ఉన్నంత బింకం లేదు. ఏదో కనిపించని మలినభావం ఆ నవ్వులో ఉంది. "మంచి స్నేహితుడ్నే సంపాదించావ్..." అంటూ తిరిగి మేడమీదకు వెళ్లిపోయాడు.

---

శాంతమ్మ భర్త పోయిననాటినుంచీ, ఏ సంవత్సరమూ ఆయన పోయిన దినాన్ని ఉపేక్షచేసి ఊరుకోలేదు. బిడ్డలు చిన్నవాళ్ళుగా ఉన్నప్పుడు తనే ఉదయాన స్నానంచేసి పిండోదకాలు విడిచిపెట్టేది. పవిత్ర భావంతో ఆ రోజంతా ఆయన నామాన్ని జపిస్తూ ఉపవాసంతో గడిపేది. ఆ దీక్ష ఆమెకు ఎంతో సంతృప్తినీ, మానసిక ఆనందాన్నీ కలిగించేది.

తరువాత ధర్మయ్య యింటికి చేరినాక, పురోహితుని పిలిపించి, చిన్నవాడుగా ఉన్న రవితోనే ఆబ్దికం పెట్టించేది. క్రితం సంవత్సరం వరకూ రవి ఈ విషయంలో ఆమె అభీష్టానికి ఎప్పుడూ వ్యతిరేకించలేదు. కాని నిన్నటిరోజు బ్రాహ్మణుని పిలవకుండా ఆ స్థానే మరొకరికి భోజనం పెట్టమనడం శాంతమ్మకు ఏమీ సంతృప్తిగాలేదు. కాని ఆ విషయంలో ఆమె వ్యతిరేకిస్తే విజయం ఎవరి పరమౌతుందో శాంతమ్మకు తెలుసు. అందుకే ఆమె ఏమీ మాట్లాడలేదు.

ధర్మయ్య మాత్రం ఆమె మానసిక సంశయాన్ని గుర్తించాడు. రవి చెప్పినదానిలో సత్యం లేకుండా పోలేదనీ, ఈ పద్ధతికూడా చాలా మంచిదేననీ ఆమెను ఒప్పించి, కొంతగా సంశయ నివృత్తిని చేశాడు.

పగలు పదిగంటలకల్లా అరవైఏళ్ళు పై దాటిన సుబ్బయ్యశాస్త్ర్యులు ఆహ్వానంమీద వచ్చి కూచున్నాడు. అతను కూడా ద్విజద్వేషి కావడంవల్ల, రవి విధానాన్ని అభినందిస్తూ, వంద సంవత్సరాలు బ్రతకమని దీవించి, సుష్టుగా భోజనంచేసి వెళ్ళిపోయాడు.

ఆరోజు శాంతమ్మ భోజనం చేయదు. రవికూడా సాయంత్రం ఫలహారంమట్టుకే తీసుకోవాలని శాంతమ్మ ఆదేశం. తిండికోసం బాధపడుతున్నా - రవి మూలుక్కుంటూనే ఆ నియమాన్ని ఆచరించడానికి నిర్ణయించుకున్నాడు. ఆరోజు పనిలోకి వెళ్ళకుండా చావిట్లో మంచంమీద కూర్చొని ఏదో పాత పుస్తకం చదువుతున్నాడు. అంతకు ముందే ధర్మయ్య వీధిలోకి వెళ్ళాడు. శాంతమ్మ లోపలనుంచి వచ్చిన అలికిడి విని రవి తల పైకెత్తాడు.

“రాముతో నిన్నను ఏమన్నా మాట్లాడేవా?” అని అడిగింది.

రవి ఆశ్చర్యంగా చూశాడు. ఈ సంగతి తల్లికి ఏలా తెలిసిందా అని ఆలోచిస్తున్నాడు.

“నిన్న నేను వెళ్ళిన తర్వాత రాము వచ్చాడా?”

“లేదే.”

“మరి నేను అక్కడకు వెళ్ళినట్లు నీ కెలా తెలుసు?”

శాంతమ్మకు రవి వెళ్ళిన సంగతి అసలు తెలేదు. అయితే రవి ప్రవర్తన మొదటినుంచీ తెలుసున్న శాంతమ్మ,

రవి మోటార్ సైకిలెక్కి జమీందారు యింటివైపునకు పోనివ్వడం చూసి బహుశా కడుపులో దాగిన కష్టాన్ని కడుక్కోడానికి రాము దగ్గరకే వెళుతున్నాడని ఆమె అనుకుంది. అందుకే అలా అడిగింది.

"వెళ్ళిఉంటావని అనుకొని అడిగాను...ఒక్కసారి ..." ఆమె మాట పూర్తిగాకుండానే, సమాధానం సక్రమంగా రావాలనే కోరికతో ప్రాథేయతగా చూసింది.

పుస్తకం మంచంమీద గిరాటువేసి విసురుగా లేచి "నే నంత చేతకానివాణ్ని కాను. ఎందుకు వెళ్ళాలి మళ్ళీ?" తీవ్రంగా చూస్తూ అడిగాడు.

ఈ హఠాత్తుతో దానికి ఆధారం ఏమిటో శాంతమ్మకు అంతుపట్టలేదు. కాస్సేపాలాగే చూసి "ఫలహారానికి పిలిస్తే బావుంటుందని" మృదువుగా చెప్పింది.

"ఎందుకు పిలవాలి?"

ఎందుకు పిలవాలో శాంతమ్మకు తెలుసు. ఆ సంగతి రవికి తెలవాలని ఆమె కోరికకాదు. కాని ఈరోజు రాము కూడా పితృపరమయ్యే ఫలహారంలో భాగస్థుడయితే, శాంతమ్మ హృదయం ఎంత ఆనందపూరితమౌతుందో రవికేం తెలుసు?

"స్నేహితుడు కాబట్టి" మెల్లగా సమాధానమిచ్చింది.

"పేదవాళ్ళకు గొప్పవాళ్ళకూ ఎక్కడా పొత్తు లేదమ్మా" అన్నాడు.

"అదేమిటి" విస్మయపూరితంగా ధ్వనించిందా కంఠం.

"అబద్ధం కాదమ్మా! ధనికులు పేదవాళ్లను చాలా తేలిగ్గా చూస్తారు...లేకపోతే నిన్న వెళ్ళి..." ఇంకా ఏదో చెప్పాలనే ఉద్దేశమున్నా - తాను పడ్డ ప్రాధేయత తన అభిమతానికి భిన్నమైనది కావడం ద్వారా ఏర్పడ్డ మానసిక క్లేశంతో ఇక మాట్లాడలేదు. వెలుపలకు వెళ్లిపోయాడు.

శాంతమ్మ రవి అసంపూర్తి మాటల్లో దాగిన పరిపూర్తి అర్థాన్ని గ్రహించుకోలేకపోయినా, ఏదో జరిగి ఉంటుందని మాత్రం ఊహించుకుంది. గుమ్మందిగి వెళుతున్న రవిని చూస్తూ అలాగే నిలబడి ఉంది శాంతమ్మ.

పళ్లెంలో పూలు వేసుకువచ్చిన లక్ష్మి శాంతమ్మ వెనక నిలబడి వెళ్ళే రవిని చూస్తూ "ఎక్కడికి వెళుతున్నాడు బావ" అని అడిగింది.

శాంతమ్మ వెనక్కి తిరిగిచూసింది. కాని ఏమీ సమాధాన మివ్వలేదు. వచ్చే సమాధానం కోసం కూడా లక్ష్మి చూడలేదు. చేతిలో పళ్లెం బల్లమీద పెడుతూ "కాసిన్ని పూలే దొరికాయి" అంది.

"ఒక పని చేసి పెడతావా లక్ష్మి" అనీ ఆతురతగా అడిగిన శాంతమ్మ కేసి, లక్ష్మి విస్మయంగా చూసింది.

ఈరోజు అస్తమానం ఒక పనేకాదు. ఇల్లు అలకడం దగ్గర్నుంచి, ఐగతుమైన చౌదరి ఛాయాచిత్రం దగ్గర ఉంచవలసిన పూలవరకూ కనీసం పది పనులైనా చేసి ఉంటుంది లక్ష్మి.

"ఇక నేను ఎక్కడికీ వెళ్ళలేను బాబూ" అంటూ వెళ్ళి మంచంమీద కూర్చుంది.

"మా అమ్మ కదూ"

శాంతమ్మ లక్ష్మి ప్రక్కను కూర్చొని లాలనగా అంది.

"ఏమిటూపని" కాస్త విసుగ్గా లలాటం చిట్లించి అడిగింది.

"రాముని ఫలహారానికి రమ్మనాలి" ఈమాట చాలా మెల్లగా అని అటూయిటూ ఒక్కసారి చూసింది. లక్ష్మి సిగ్గుగా తలవంచుకుంది. ఆ 'రాము' అనే పేరుద్వారా పొందిన అనుభూతి శాంతమ్మ గుర్తించే స్థితిలో లేదు. "ఏం లక్ష్మీ" మళ్ళీ హెచ్చరించింది.

"నేను వెళ్ళను బాబూ."

"సరే-" నిస్పృహగా నిట్టూర్చి శాంతమ్మ లేచింది. లక్ష్మి తలవంచుకొని తనలో నవ్వుకొంటూంది.

"రాము అంటే ఎందుకూ మీ యిద్దరికీ అంతకష్టం" గుమ్మంలోకి వెళ్ళబోతూ వెనక్కి తిరిగి శాంతమ్మ ప్రశ్నించింది. ఈ మాటతో లక్ష్మి భయంగా శాంతమ్మ కేసి చూసింది.

శాంతమ్మ ప్రశాంతవదనంలో, ఏదో తీరని ఆరాటం లక్ష్మి చూసింది. మెల్లగా లేచింది- "మా కష్టంమాట అటుంచు, రాము అంటే నీ కింత యిష్టమెందుకూ?" అని అడిగింది లక్ష్మి.

లక్ష్మి ఈలాంటి ప్రశ్న వేయగలదని శాంతమ్మ ఊహించుకోలేదు. చిన్నవయస్సులోఉన్న లక్ష్మిముందు తన ఆంతర్యం ఎక్కడ వ్యక్తమౌతుందో నన్న అదురుతో తప్పుకు వెళ్ళిపోవలసిన పరిస్థితి వస్తుందని ఆమె అనుకోలేదు. బలంలేని చిన్న నవ్వు నవ్వి శాంతమ్మ లోపలకు వెళ్ళి పోయింది.

"నేను నవ్వుతూ అన్నాలే అత్తా! రాము అంటే ఎవ్వరికీ కష్టంలేదు..." అంటూ సిగ్గుగా పమిట మెలిపెట్టు కుంటూ "నేను వెళ్ళి చెబితే బావుంటుందా?... ఏమను కుంటాడో" - అంది.

యుక్తవయస్సులో ఉన్న లక్ష్మికి యీ పని పురమా యించడంలో ఉండే భారం శాంతమ్మకు యిప్పుడు అర్థమైంది.

"ఎందుకూ కబురు పెట్టేరట"

ఈ మాట విని లక్ష్మి శాంతమ్మ వీధి గుమ్మంవైపు చూశారు. రాము గుమ్మందగ్గర నిలబడి ఉన్నాడు.

"రా బాబూ లోపలకు రా" వచ్చే ఆనందాన్ని అదుముకుంటూ ఆహ్వానించింది శాంతమ్మ.

రాము లోపలకు వచ్చాడు. లక్ష్మి గదిలోకి వెళ్ళి తలుపుప్రక్కను నిలబడింది.

"ఎవరు చెప్పారు?" అని అడిగింది శాంతమ్మ. రాము తలుపుచాటునుంచి కనిపిస్తోన్న లక్ష్మి పమిటకేసి చూస్తూ ఉండటంవల్ల వెంటనే ఈమాటను అర్థంచేసుకోలేకపోయాడు. కాస్సేపటికి "ఆ - ఇంకెవరు రవే" అంటూ, జేబులో సిగరెట్టుపెట్టె తీశాడు.

"ఇప్పుడే వస్తా" అంటూ శాంతమ్మ లోపలకు వెళ్ళింది. రాము సిగరెట్టు తీశాడు. "లక్ష్మి" అని మధురంగా పిలచాడు.

తిరుగు సమాధానం రాలేదుగాని, తలుపు రెక్క కదిలింది.

"అగ్గిపెట్టె" అన్నాడు.

లక్ష్మి తలుపుప్రక్కనుంచి మెల్లగా లోపలకువెళ్ళి అగ్గిపెట్టె తీసుక వచ్చింది. కాస్త దూరంగా ఉండి గిరాటు వేసింది. మంచం క్రిందుగా పడింది. రాము కాస్త కష్టంగా చూశాడు. "నిర్లక్ష్యంగా యిచ్చేది ఏదైనా నాకక్కర్లేదు" అని మొగం వీధి వేపునకు పెట్టాడు.

లక్ష్మి మెల్లగా నవ్వుకొని, క్రిందపడిన అగ్గిపెట్టె తీసి "ఇదిగో" అని సన్నగా అంది.

చేయి చాపుతూ క్రీగంటగా చూస్తూ "ముందే ఈ మర్యాద కాపాడుకుంటే" అంటూ అందుకున్నాడు.

"సిగరెట్లు తీయగా ఉంటాయా ?"

"తీయగా ఉంటే కాల్చడ మెందుకూ ?"

"ఏమిటీ దాని రుచి!"

"అర్థం కాదులే –" ఒక అగ్గిపుల్లగీసి అంటించాడు. సిగరెట్టుపొగ నిర్లక్ష్యంగా విడిచాడు.

"అనుభవించినదాని ఫలితం..."

"నువ్వే చెప్పు" దర్జాగా కాలు ఊగిస్తూ అడిగాడు.

"గుండె జబ్బుటగా" కాస్త భయంగా మొగంపెట్టి అడిగింది. ఆమె మొగంచూసిన రాముకు నవ్వొచ్చింది.

"ఆ జబ్బు అనుభవించేది నేనేగా."

ఈ మాటకు లక్ష్మి మొగంలో మార్పు వచ్చింది. "అలవాటు మాన్పుకోలేవా ?" ఆమె మాటలో తీవ్రతకు రాము ఆశ్చర్యపడ్డాడు.

"నామీద నీకింత శ్రద్ధ ఎందుకూ ?"

ఈ మాటకు ఆమె సమాధానం చెప్పలేకపోయింది. ఆమె మొగంలో సిగ్గురేఖలు రాము స్పష్టంగా చూడ గలిగాడు.

"సరే ప్రయత్నిస్తాను" అంటూ కాల్చే సిగరెట్టు వీధివేపునకు విసిరేడు. "అయితే పూర్తిగా మానగలనని హామీ యివ్వలేను సుమా – నీ కిష్టంలేనిపని నీ ఎదురుగా మాత్రం చేయను" అన్నాడు.

"కాదు. మానడమే చాలా మంచిది" అంది లక్ష్మి.
'ఏమిటో ఈ అధికారం' అనుకున్నాడు రాము మనస్సులో,
పైకి మాత్రం "చెప్పడం సులభమే" అన్నాడు.

తరువాత మాట మనస్సులోనే లక్ష్మి పూర్తిచేసు
కుంది. చేయడం మాత్రం ఎందుకు కష్టమో ఆమెకు అర్థం
కాలేదు. కాస్సేపు నిశ్శబ్దంగా లక్ష్మికేసి చూస్తూ వుండి
పోయాడు రాము. ఆమె వంచిన తల కాస్త ప్రక్కగా
త్రిప్పి రాము కళ్లకేసి చూసింది. ఆ కళ్ళల్లో కనిపించిన
ఏదో కాంతి ఆమె హృదయాన్ని పులకింపచేసింది. ఒక్క
సారి కంపించింది. కదలి గదిలోకి వెళ్ళబోయింది.

రాము లేచి ఆమె చేయి పట్టుకొని "మాట"
అన్నాడు. ఆమె వెనక్కి తిరిగి చూసింది. "రామూ" అధి
కారంతో కూడిన తీవ్రమైన ధ్వనితో ఆ మాట నిండివుంది.
రాము వెంటనే చేయి విడచిపెట్టాడు. ఆమె గదిలోనికి వెళ్ళి
పోయింది. తాను చేసిన పొరపాటునకు వెంటనే నాలుక
కరుచుకొని మంచంమీద చతికిల బడ్డాడు రాము.

తరువాత శాంతమ్మ తీసుకువచ్చిన ఫలహారాన్ని రాము
ఆప్యాయంగా అరగించలేకపోయాడు. అన్యమనస్కంగా
కొంచం మాత్రమే తినగలిగాడు.

శాంతమ్మ అతని వైఖరిని ఆశ్చర్యంగా చూస్తూ
"ఏం బాబూ విడిచిపెట్టావ్?" అని అడిగింది.

"అబ్బే! ఇంతకముందే తిన్నా-" అంటూ లేచాడు. ఆ తిన్నవస్తువు ఏమిటో శాంతమ్మకు తెలీదు.

లక్ష్మి అప్పుడే కాఫీ తీసుకువచ్చింది.

"కాఫీ" శాంతమ్మ లక్ష్మి చేతిలో గ్లాసు తీసుకో బోతూ అంది. రాము ఒకసారి లక్ష్మికేసి చూశాడు. కాని ఎక్కువసేపు చూడలేకపోయాడు. "అక్కర్లేదమ్మా వెళతాను" అని మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా రాము వీధిలోకి వెళ్ళాడు.

లక్ష్మి చేతులో గ్లాసు అలాగే ఉండిపోయింది. వెనక నుంచి వచ్చే రవిని కూడా రాము చూడలేదు. రవి చావిట్లోకి వచ్చాడు. టిఫిన్, లక్ష్మి చేతిలో కాఫీ చూశాడు.

"ఒంట్లో బాగోలేనట్లుంది" అంది శాంతమ్మ.

"వాళ్ళు తినే తిండిలో ఇదో లెక్కా" అన్నాడు రవి. లక్ష్మి మాత్రం ఏమీ మాట్లాడలేదు.

"ఇట్లా యివ్వు" రవి లక్ష్మి చేతిలో గ్లాసు తీసుకున్నాడు.

"తాగేవాళ్ళు లేకపోతే బాధపడాలి" అంటూ గ్లాసు నోటిదగ్గర పెట్టుకోబోయాడు రవి.

"బుద్ధి ఉందా లేదా?" అన్న తల్లిమాట విని తాగ బోయే గ్లాసును క్రిందకు దింపాడు.

శాంతమ్మ రవి చేతిలో గ్లాసు అందుకొని "రాత్రి వరకూ ఏమీ ముట్టుకోలేదని తెలీదూ?" అంది. రవి మాట్లాడకుండా మంచంమీద కూర్చున్నాడు.

లక్ష్మి నవ్వింది. ఆ నవ్వులో ఏదో తృప్తి ఉంది. రవి లక్ష్మికేసి కోపంగా చూశాడు. "నీకు నవ్వుగానే ఉంటుంది" అన్నాడు. ఆకలి అతని కళ్ళలో స్ఫురించింది.

"నీ గురించి నవ్వలేదులే" అంటూ లోపలకు వెళ్ళింది లక్ష్మి.

ఎవరిగురించి నవ్విందో శాంతమ్మ అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు.

# 18

రాము రాత్రి చాలాసేపటివరకూ నిద్రపోలేదు. నిద్ర పోవాలని ప్రయత్నించినా, లక్ష్మిపట్ల తానుచేసిన అసహజ దౌష్ట్యానికి అతని విజ్ఞానం శాస్త్రహీనమైనట్లుగా, అయాచిత పరాభవంతో రాము హృదయం తుత్తునియలై, సిగ్గుతో, వ్యథతో ఎన్నిసార్లో లక్ష్మిని మానసికంగా క్షమాభిక్ష వేడుకున్నాడు. అయినా హృదయంలో నిండినభారం ఏమీ తగ్గ[illegible]

ఉదయం తొమ్మిదిగంటలకుగాని మంచంమీదనుంచి లేవలేదు. లేచి డ్రాయరుమీదవున్న బిగ్‌బెన్‌చూసి ఆశ్చర్య పోయాడు. రాత్రి బహుశా మూడుగంటలకు నిద్దరపట్టి ఉంటుందని ఊహించాడు.

కాలకృత్యాలుతీర్చుకునేసరికి పదిగంటలుపై దాటింది. ఈ రోజు కాలేజీకి వెళ్లాలనే సంగతి గుర్తున్నా— వెళ్లాలనే ఉత్సాహం అతనిలో లేదు. ఉదాసీనంగా రీడింగ్ రూంలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు.

ఎవరో గదితలుపుతోసిచూసి తిరిగి వెళ్లిపోతున్నట్లుగా, వెనుతిరిగి చూడకుండానే అతనికి స్ఫురించడంవల్ల "ఎవరు?" అని పిలచాడు.

"నేను బాబూ"

వెనక్కి తిరిగి చూశాడు మల్లయ్య.

"ఏం?"

"అయ్యగారు చూసి రమ్మన్నారు."

ఈ మాటతో రాము మొగం వెలవెల పోయింది. ఏ విధమైన సమాధానం తండ్రికిస్తే బావుంటుందో అనే ఆలోచనలో ఉన్నాడు.

"నువ్వు" అంటూనే మల్లయ్య నిలచిన స్థలంకేసి చూశాడు. మల్లయ్య లేడు. ఎప్పుడు వెళ్లాడో గమనించలేదు.

మల్లయ్య ఆ యింట్లో నౌకరు. జమిందారు నమ్మిన బంటుల్లో ఇతడు ముఖ్యుడు.

మల్లయ్య మాటల్లో హాస్యం తొణికిస లాడుతున్నా—నటనలో ఆడంబరమున్నా గంగాధరం మాత్రం ఆ మాటలకు కాస్త విలువ యివ్వడం సహజమైపోయింది.

కొద్ది రోజులనుంచి మల్లయ్య రాముని పరీక్షగా పరిశీలించడమూ, "ఎక్కడికి బాబూ?" అని పలకరించడమూ, ఒకటి రెండుసార్లు ధర్మయ్యగారి వీధి ప్రాంతంలో కనిపించడమూ, రాము ఏ విధంగా అతను పత్తేదారుడు ఉద్యోగం తండ్రినుంచి పొందాడో ఊహించుకోలేకపోయాడు. మల్లయ్య తిరిగివచ్చాడు. కాస్త వక్రంగా చూస్తూ "అయ్యగారు పిలుస్తున్నారు" అన్నాడు.

"ఎందుకు?" ఆ ధ్వని చూచి మల్లయ్య తృళ్లిపడ్డాడు. మల్లయ్య సమాధానం ఇవ్వలేకపోయాడు. రాము లేచి గంగాధరం కూర్చొనే మేడ పై భాగానికి వెళ్లాడు.

"కాలేజీకి పోలేదేం?" అని అడిగాడు గంగాధరం. విసురుగా వెళ్ళిన రాము తండ్రిని చూడ్డంతోనే చల్లబడి నిలబడిపోయాడు. ఆ ప్రశ్నకు వెంటనే సమాధానం యివ్వలేదు.

"పరీక్షలు దగ్గరకొస్తున్న సంగతికూడా మరచావా?" ఈ ప్రశ్నకూడా జమిందారే వేశాడు.

దీనిక్కూడా రాము సమాధాన మివ్వలేదు. సమాధానం తప్పకుండా అందుకుంటాననే హామీకూడా గంగాధ

వానికి లేదు. దానికి కారణం అయివాడు ప్రశ్నలకు రాము నించి పొందే సమాధానం మొదట్నించీ ఒక్కటిగానే ఉంటుందనే సంగతి ఆయనకు తెలుసు.

"ఇంతకాలం చదువ్రా ఈ పరీక్షకోసమే అనే సంగతి మరచిపోవద్దు...బి. ఎ. పేసయితే నువ్వు ఉద్యోగం చేయా లనే కోరిక నాలో లేదు. కాని పదిమందిలో విజ్ఞుడుగా నిలబడి ఈ గంగాధరం పేరు ప్రతిష్టలు నిలబెట్టగల యోగ్యత సంపాదించినవాడవు కాగలుగుతావని నా నమ్మకం" అన్నాడు.

అప్పటికే గంగాధరం చుట్ట పీలుస్తున్నాడు. ఈ ఆఖరి మాట అని గట్టిగా పొగపీల్చి విడచాడు. దట్టమైన తెల్లటి చిన్న మేఘాలుగా ఆ పొగలు ఆకారాలుదాలుస్తూ, మెల్లగా కదిలిపోతున్నాయి. గంగాధరం అటే చూస్తూ కాస్సేపటి వరకూ మాట్లాడలేదు. రాము కూర్చోలేదు. ఆ పొగకేసే నిశ్శబ్దంగా చూస్తున్నాడు. "కూర్చో" అంటూ ధ్వనిలేని మ్లానహాసంతో రాముకేసి చూశాడు.

రాము కూర్చున్నాడు.

"ఒంట్లో బావుండలేదా?"

"బాగానే వుంది."

ఈ సమాధానానికి గంగాధరం ఆశ్చర్యపడ్డాడు. రాము మనస్సు అబద్ధం చెప్పడానికి యిష్టపడలేదు. ఈ

అలస్యానికి కారణాన్ని వ్యక్తీకరించడం నిజమే కావచ్చు. కాని అది చెప్పడం ద్వారా వచ్చే అపాయం రాము గుర్తించకుండా ఉండలేదు.

"మరి కాలేజీకి పోలేదేం?"

"ఆలస్యంగా లేచా."

"కారణం?" ఇది జమిందారు ప్రశ్న. ఈ ప్రశ్న ద్వారా ఆశించేది "ఒంట్లో బాగుండలేదు" అనేదే అని జమిందారు ఊహించాడు. కాని అది కాదని రాము చెప్పడం వల్ల దీనికి సమాధానం ఏ రూపంలో వస్తుందో గంగాధరం కాసేపు నిశ్శబ్దంగా నిరీక్షించాడు.

"మందు..."

మెల్లగా మల్లయ్య ఒక అర్నున్సుగ్లాసు, సరసపరిల్లా సీసా ఎదురుగా ఉన్న టీపాయ్ మీద పెట్టాడు.

రక్త పరిశుద్ధికోసం, చాలా రోజులుగా ఈలాంటి మందు జమిందారులు వాడ్డం రాముక్కూడా తెలుసు.

రాముమీదనుంచి, మందుమీద దృష్టి ప్రసరించి, ఔన్సుగ్లాసులో మందు పోసుకుంటూ "రామూ" అన్నాడు.

రామూ చూశాడు.

గంగాధరం మందు గ్లాసులోపోసి త్రాగలేదు. రాము కేసి తీక్షణంగా చూస్తూ "నువ్వొక జమిందారు కొడుకువనే సంగతి మర్చిపోతున్నావ్" ఈ తీవ్రతకు కంఠధ్వనికి రాము

విస్తుపోయాడు. మొదట వేసిన ప్రశ్నలకూ - ఈ ఒక్క ప్రశ్నకూ ఏలాంటి పొత్తుఉందో రాముకి అర్థం కావటల్లేదు.

గంగాధరం మందు తాగి కాస్సేపు కళ్లుమూసి, మళ్లీ ఎర్రటికళ్ళతో రాముని చూసి "అయినవాళ్లింటికీ, కాని వాళ్లింటికీ వెళ్ళడంలో నీ హోదా ఎంత దిగజారిపోతూందో నువ్వు అర్థం చేసుకుంటే; అలా చేయలేవు" అంటూ కుర్చీ మీదనుంచి లేచి, శ్రద్ధగా భయంగా వింటున్న మల్లయ్యకేసి చూస్తూ "మందు తీసుకవో" అన్నాడు.

రాము మందుబుడ్డీ గ్లాసుతీసి, మల్లయ్యకేసి అనుమానంగా చూశాడు. మల్లయ్య దొంగచూపుతో రాముని చూసి వక్రంగా పెదాలపై నవ్వు రప్పించి వెళ్ళిపోయాడు.

రాముకూడా కుర్చీమీదనుంచి లేచాడు; తండ్రికేసి సంశయంగా చూస్తూ "నే నెక్కడికి వెళుతున్నాను?" అని అడిగాడు.

దీనికి గంగాధరం వెంటనే నవ్వాడు.

"నువ్వు వెళ్లలేదనే నమ్మకం నీకుంటే; సంతోషమే కాని, ఉత్తరోత్తరా అలా వెళ్ళడం మంచిది కాదనే ఉద్దేశాన్ని తండ్రిని కాబట్టి, నా బిడ్డ శ్రేయస్సుకోరి సలహా యివ్వడం తప్పా?" వెనక్కి తిరిగి విచిత్ర ముఖ భంగిమతో రాముకేసి చూశాడు.

రాము మొగంలో సంశయం అలాగే ఉండిపోయింది.

"సరే! ఈ రోజులాగ రేపుకూడా వృధాచేయకు. తప్పక కాలేజీకి వెళ్లు."

రాము అమటుగుండా కాస్త తేలికపడింది. మెల్లగా మెట్లుదిగి క్రిందకు వెళ్లిపోయాడు. జమిందారు అలాగే చూస్తూ మళ్లీ ఒకసారి బాధగా నవ్వుకున్నాడు.

ఆ రోజు అంతా రాము మనస్సు ఏమీ బావుండ లేదు. మనశ్శాంతికోసం ఎంత ఆరట్లాడినా ఏమీ లాభం లేకపోయింది. మధ్యాహ్నం భోజనం అయిన తర్వాత కాలేజీకి వెళదామని బుద్ధిపుట్టి డ్రైవర్ని పిలచి "కారు తీసుకరా" అని చెప్పాడు. డ్రైవరు కారు తీసుకువచ్చి గుమ్మం ఎదురుగా పెట్టాడు.

పుస్తకాలు తీసుకొని ఏదో ఆలోచిస్తూ కాస్సేపు అలాగే ఉండిపోయాడు. ఒంటిగంటకూడా దాటుతోంది. కాలేజీ టైం దాటిపోతుందనే ఉద్దేశంకొద్దీ డ్రైవరు హారన్ కొట్టాడు.

పుస్తకాలు డ్రాయరుమీదేఉంచి, తిరిగి వెలుపలకు వచ్చి "కారు షెడ్‌లో పెట్టు" అన్నాడు రాము.

డ్రైవరు ఆశ్చర్యంగా చూశాడు.

"నీకే చెప్పేది, యీవేళ కాలేజీకి పోను" అని తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

డ్రైవరు యథాప్రకారం కారు తీసుకుపోయి షెడ్‌లో పెట్టేశాడు.

సాయంత్రం నాలుగుగంటలకు బట్టలు మార్చుకొని రాము మైక్ బయలుదేరాడు. ముందుగా ధర్మయ్యగారింటికి వెళ్లాలనే నిర్ణయంతోనే బయలుదేరాడు. కొంత దూరం వెళ్లిన తర్వాత తండ్రి అన్నమాటలు గుర్తుకువచ్చాయి. ఎటూ వెళ్లకుండా కాస్సేపు నిలబడిపోయాడు. వెనక్కి తిరిగి ప్రక్క వీధిలోఉన్న తన బంగాళాకు బయలుదేరాడు. బంగాళాలోకి వెళ్లాడు.

పూలతోటలో ఉన్న ఆ బంగాళా, జమిందారు కేవలం విహారంకోసం వచ్చినప్పుడు కూర్చోడానికి కట్టించింది. కాని రెండుసంవత్సరాలనుంచి జమిందారు ఆరోగ్యం అంతగా బావుండని కారణంగా రావడల్లేదు. రెండుమూడురోజులకు ఒకసారిమాత్రం రాము ఆ బంగాళాకు రావడం పరిపాటైంది.

బంగాళా వెనుకభాగాన ఉన్న మంచినీటిబావిని, ధర్మయ్యగారున్న వీధివాళ్లు కొందరు వాడుకుంటున్నారు. ఆ బావినీటిగురించి ఒక మంచివదంతి జమిందారు వాచా ద్వారానే ప్రచారంలోకి వచ్చింది. గంగాబొండాల నీటితో సమానమైన రుచితోఉండి, ఏ రోగాన్నీ దరికి చేరనీయని మహత్తరమైన ఓషధులగుణంతో నిండిన జలమని జమిందారే మొదటిసారి పదిమంది పెద్దలదగ్గరన్నాడు. ఆమాట ఆధారంగానే ఆ నూతినీరు రెండుమూడు వీధులవాళ్ళు రోజూ వాడుకోవడం ఆరంభించారు. యీ రోజుకుకూడా గంగాధరం ఆ నూతినీటినే వాడతాడని ప్రతీతి.

కుళాయిలనుండి వచ్చే జలసౌకర్యానికి అలవాటుపడ్డ ప్రాణులు రానురాను బంగాళానూతికి రావడం అలవాటు తగ్గించారు. అయినా ధర్మయ్యలాంటి పెద్దలు మరో నలుగురు తప్ప ఆ నూతిసేటిని మరెవ్వరూ అంతగా వాడుతున్నట్లుగా కనిపించరు.

కనుచీకటి పడుతోంది. సంపెంగ పొదలచాటునున్న రాతిచప్టాపై కూర్చున్న రాము బరువుగా నిట్టూర్చాడు. కాస్సేపు ఆకాశంకేసి చూశాడు. పంచమీ చంద్రుడు కని పించాడు. అక్కడక్కడా నక్షత్రాలుకూడా కనిపిస్తున్నాయి.

తోటమాలి నాగన్న రాముదగ్గరగా రావడం రాము గమనించలేదు. రాము పలకరిస్తాడని నాగన్న మెదలకుండా కొంతసేపు నిలబడ్డాడు. కాని పరాధీనతగాఉన్న రాము నాగన్నను చూడనేలేదు.

"చాలా ప్రొద్దుపోయింది" నాగన్న మెల్లగా అన్నాడు.

"అయితే –" ఈ ప్రశ్న రాము వేశాడు. కాని దానిలో అర్థం అసంబద్ధంగా ఉందని రాము ఆలోచించలేదు.

"ఇంటికి వెళ్లడం మంచిది బాబూ" మళ్ళీ ననుకుతూ సమాధానమిచ్చాడు.

"నాపైన నాకు శ్రద్ధ ఉందిలే–నీపని నువ్వు చూసుకో" అని శాస్త్ర గదురుకున్నాడు. ఆ కనుచీకట్లోకూడా నాగన్న

మొగం ఈ నూటుకు వెలవెలపోయినట్లు రాము చూడ గలిగాడు. నాగన్న మెల్లగా బంగాళా ప్రక్కగా ఉన్న తన పూరిగుడిసెలోకి వెళ్ళిపోయాడు.

'నాపై నాకు శ్రద్ధ ఉందిలే' అనే మాటలో ఎంత సత్యముందో రాము తరువాత ఆలోచించాడు. నిజంగా యీరోజు తనపైనుండే శ్రద్ధను ఎవరో కబళించినట్లుగానూ, ఈ దినమల్లా ఉదాసీనంగా – పరాధీనతగా గడపినట్లుగానూ, గుర్తించాడు. "ఎందుకావ్యథ–" "ఎవరిగురించీబాధ" అని నెమ్మదిగా గొణుక్కుంటూ లేచాడు. ఈలాంటి దౌర్బల్యానికి లోనుకావడం చాలా తప్పనికూడా మనస్సులోఅనుకున్నాడు. తొందరగా రెండడుగులు ఎదరకు వేశాడు. మైకం వదలించు కోడానికి వేసిన మనస్సుయొక్క చిరుగంతు, మొదట్లోనే గప్పున కొట్టిన సంపెంగపువ్వు వాసనకు స్తంభించిపోయింది.

రాము ఆలాగే నిలబడి ఆ మసకవెలుతుర్లలో పువ్వు కోసం పరిశీలిస్తున్నాడు. విప్పారిన పువ్వు కొమ్మ చిటారున కనిపించింది. కొమ్మవంచి పూవుకోయాలనే ఉద్దేశంతో చెట్టుమొదటకు వెళ్ళి, పలవ అందుకున్నాడు.

"రామూ ఏమిటూ పని?" అని కోమలంగా వినిపించిన కంఠాన్ని గుర్తించి, పలవ వొదలి వెనక్కి తిరిగిచూశాడు.

"చెట్టుక్రింద లే—" ఈ మాట కాస్త కఠినంగా వినిపించింది.

రాము ఏదో అపాయాన్ని సూచించే ఆ ధ్వనివల్ల, కంగారుగానే చెట్టుదాటి యువతులకు వచ్చాడు.

లక్ష్మి నూతినుండి తీసిన బాల్చీ నీటిని. బిందెలో పోసుకుంటూవుంది. రాము దగ్గరగా చేరాడు.

"ఎందుకూ పిల్చావ్ ?"

"పిలవలేదే - చెట్టుక్రింద తిమ్మన్నాను"

"కారణం"

"ఆమాత్రం తెలీదు. చీకటి పడిన తర్వాత సంపెంగ చెట్టుక్రిందకు పోవచ్చా ?"

"ఎందువల్ల ?"

లక్ష్మి నవ్వింది. ఈ నవ్వు చాలా నిష్కపటంగానూ, మనోహరంగానూ వుంది. "ఎందువల్లా - చీకటి పడిన తర్వాత పాములు చేరవూ ?" అని నీటితో నిండిన బిందెను వయ్యారంగా చంకను ఇముడ్చుకుంది.

"పాములు చేరితే" ఈ మాటకూడా 'తానతందాన' లాగునే వుంది.

లక్ష్మి నవ్వబోయి ఆగింది. కోపంగాకూడా మొగం పెట్టింది. "ఏమిటీ బొత్తిగా అలా తయారయ్యావ్" అంది.

రాము కంగారుగా తన్ను తనే ఒకసారి చూసుకున్నాడు.

"ఎక్కువ చదువువల్ల మతి మందగిస్తుందేమో; మతి పోయే చదువు చదివేదాని కన్నా మానుకోవడమే మంచిది రామూ" అని ఆమె మెల్లగా నడుస్తోంది.

"లక్ష్మీ" రాము పిలిచాడు.

లక్ష్మి ఆగి వెనక్కి తిరిగి చూసింది.

"నిన్న నీకు బాధకలిగించాను కదూ" ఈ మాట వ్యథగా భారంగా ధ్వనించింది. లక్ష్మి ఆశ్చర్యంగా చూసింది. నిన్న జరిగిన స్వల్ప విషయంగురించి యిప్పటివరకూ రాము ఎంతో బాధపడుతున్నట్లు గుర్తించింది.

"ఛీ! అదేం లేదే..." అని ఎంతో తేలిగ్గా నవ్వి "మరి అప్పుడు ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారూ?" తలవంచి నేల చూపులు చూస్తూ అంది.

చూడకుండా చేయిపట్టుకుంటే ఫరవాలేదన్నమాట అందామనుకున్నాడు రాము. కాని ఆమాట ఎంత మోటుగా ఉంటుందో వెంటనే గ్రహించాడు.

"ఇంత ఆలస్యమైందేం?" రాము అడిగాడు.

"ఈరోజు నువ్వు యింటికి రాలేదేం?" అంది లక్ష్మి. రెండూ ప్రశ్నలే కావడంవల్ల సమాధాన మివ్వడం ఒకళ్ళకూ దక్కలేదు. కాని ఒకరు రాకపోడానికి, మరొకరి రాక ఆలస్యమైందనే ధ్వని ఉందని రాము గ్రహించాడు.

రాము అటూయిటూ చూశాడు. మెల్లగా లక్ష్మి దగ్గరకు వెళ్ళాడు. లక్ష్మి కాస్త భయంగా వెనక్కి తగ్గింది.

"లక్ష్మి! నిజంగా నువ్వు..." ఇంతకు మించి రాము మాట్లాడలేకపోయాడు. కంఠం కంపించింది.

లక్ష్మి గ్రహించింది. తనలో తనే నవ్వుకుంది. ఆ మందహాస చంద్రికలు, ఆ స్వల్ప చంద్రకాంతిలో రాముకు గోచరంకాలేదు. ఎదుట ఏదో వస్తువును చూసినట్లు కంపించింది లక్ష్మి. మెల్లగా కదిలి వెళ్ళిపోతోంది.

చైతన్య విహీనంగా రాము చాలాసేపు అలాగే చూస్తూ నిలబడిపోయాడు. ఏదో నీడ తన ప్రక్కగా వచ్చి నిలవడం చూశాడు. తలెత్తాడు. మల్లయ్య వక్ర హాసం చూశాడు.

"ఎందుకొచ్చావ్ ?"

"బాబుగారు చూసి రమ్మన్నారు"

"సరే! నువ్వెళ్ళు"

ఉద్ధృతంగా ధ్వనించిన ఈ మాటకు మల్లయ్య త్రుళ్ళిపడి, ముందుగా వెళ్ళిపోయాడు. రాము బరువుగా అక్కడ నుంచి కదలాడు.



# 19

రాత్రి మల్లయ్య జమిందారు గంగాధరానికి పవిత్రంగా చెప్పి తన ఉద్యోగధర్మంలో కృతకృత్యుడవ్వాలని ప్రయత్నంచేశాడో తెలీదుగాని, ఉదయం లేచిన దగ్గర్నుంచి జమిందారు మొగం కోపోద్దీపితంగానే వుంది.

తొమ్మిదిగంటలకల్లా రాము పుస్తకాలు తీసుకొని కారుదగ్గరకు వచ్చేముందు గంగాధరం ఎదురువచ్చాడు. తండ్రి ఏదన్నా ప్రశ్నిస్తాడనే ఉద్దేశంతో అలాగే నిలబడి పోయాడు. కాని గంగాధరం మాట్లాడకుండా ఒకసారి ఆపాదమస్తకం రాముని చూసి తిరిగి వెళ్లిపోయాడు.

ఈ ప్రవర్తన రాముకి ఆశ్చర్యం కలిగించినా దాని గురించి ఆలోచించదలచ లేదు. గుమ్మంలోకి వచ్చి ఆగిన కారు ఎక్కి తలుపు వేసుకుంటూ చావిట్లోకి ఒకసారి చూశాడు.

జమిందారు కోపంగా పట్టుదలగా రాముకేసి చూస్తున్నాడు. ప్రక్కన మల్లయ్య నిలబడి ఉన్నాడు. రాము సాలోచనగా అలా చూస్తూ ఉండగానే కారుకదలిపోయింది.

జమిందారు మల్లయ్యద్వారా పెట్టిన కబురు అందుకొని, ధర్మయ్య సుమారు పదిగంటలకు జమిందారు యిల్లు చేరుకున్నాడు.

హాలులో ఎవరూ లేనికారణంగా ధర్మయ్యా అలాగే నిలబడిపోయాడు.

"కూర్చోండి"

జమిందారు మేడమెట్లు దిగుతూ ధర్మయ్యానుచూసి ఈ మాట అన్నాడు. కాని జమిందారు దగ్గరకువచ్చే వరకూ ఆయన ఆజ్ఞ పరిపాలించలేకపోయాడు ధర్మయ్యా.

జమిందారు వచ్చి సోఫాలో కూర్చుని, విమర్శనాయుతంగా ధర్మయ్యాను చూస్తూ "తొందరగా వెళ్లిపోవాలా?" అన్నాడు.

"లేదే!"

"అయితే కూర్చోడానికి ఆలస్యం దేనికి?"

ధర్మయ్యా ఎదురుగా ఉన్న మరో కుర్చీలో కూర్చున్నాడు.

మొదట్లో కూర్చుంటూ ఎందుకు కబురుపెట్టారు అని అడగాలనుకున్నాడు ధర్మయ్యా. కాని జమిందారు మొగంలో ఏదో యీర్ష్యను రూపించే చూపు ధర్మయ్యాను ఆ ప్రశ్నను వేయించనివ్వలేదు.

"ఏలా వున్నారు?"

"తమ దయవల్ల ఈలా ఉన్నాను."

ధర్మయ్యా సమాధానం వ్యంగ్యంగా ఉండి, జమిందారు దయాహీనచర్యను వేలెట్టి చూపింది. చిరిగిన చొక్కాను వేసుకొని, పేలికలుగా ఒక మూల వేలాడుతున్న ధర్మయ్యా తలపాగా కూడా కనిపించింది.

"ధర్మానికి దయ అవసరం లేదేమో!" ఎంతో తెలివిగా ధర్మయ్య సుభాషితాన్ని గుర్తుకు తేవడానికి జమిందారు వేసిన ప్రశ్న.

ధర్మయ్య మొగంలో ఏమీ మార్పు కనిపించ లేదు. శాంతంగా ఈలా అన్నాడు. "దయాపూరితమైన దానినే ధర్మమంటారు."

"ధర్మప్రకారం నడిచే ధర్మయ్యగారు ... శాస్త్ర ధర్మాన్ని కూడా విస్మరించినట్లుగా ఈమధ్య వింటున్నా."

ఈ మాటకు ధర్మయ్య ఆశ్చర్యంగా చూశాడు. "ఎవరు చెప్పారు?" అని అడిగాడు.

"మీ ఆచరణ"

"అంటే?"

"అష్టవర్షా భవేత్ కన్య..." అని నవ్వాడు జమిందారు. ఈ వ్యంగ్య బాణాఘాతం ధర్మయ్య హృదయాన్ని తాకింది. వయసువచ్చిన పిల్లను ఇంట్లో పెట్టుక కూర్చొని, 'ధర్మప్రకారం నడుస్తున్నానని డంబాలు కొడుతున్నావే' అనే భావం జమిందారు మాటల్లో ఉంది. కాని ధర్మయ్య వెంటనే తేరుకున్నాడు. తేలికగా నవ్వి తల పంకించి ఊరుకున్నాడు. ఆ నవ్వు జమిందారు వ్యంగ్య శరావేగాన్ని తిరిగి జమిందారుకే అందజేసింది.

"ఎందుకా నవ్వు?"

"తమ నవ్వులో అర్థం"

"వయసు రానిముందే పిల్లకు పెళ్ళి చేయడం శాస్త్ర సమ్మతం కదూ!" సూటిగా చూస్తూ జమిందారు అడిగాడు.

"శాస్త్రసమ్మతాన్ని ధర్మసమ్మత మనరు... ధర్మ శాస్త్రం వేరు శాస్త్రధర్మం వేరు" అని ధర్మయ్య సమాధాన మిచ్చాడు.

ఈ సమాధానానికి జమిందారు ఆశ్చర్యపడలేదు గాని, అహంభావంతో ఉరిమిచూశాడు. "ఏమిటి మీరనేది" కోపంగా అడిగాడు.

"ఔను బాబూ! శాస్త్రాలు మానవ సృష్టి ... ఒక కాలంలో శాస్త్రసమ్మతమైన నిర్ణయాలు మరోకాలంలో అశాస్త్రీయాలౌతాయి. కాని ధర్మం అలా కాదని నా ఉద్దేశం......ధర్మం అనే పదోత్పత్తి మానవులు సర్వదా ధరించే ఒక ధర్మ కవచాన్నిబట్టి పుట్టింది. దానికి మార్పు లేదు. దానికి ఆడ మగా విచక్షణా, పేదా గొప్ప విభేదాలు బహు తక్కువ... దైవ ప్రేరితమైన ధర్మం ముందు అహంభావంతో సృష్టించిన కొన్ని శాస్త్రాలు హారతి కర్పూరం కావలసిందే...మీరు..."

"ఆగండి" జమీందారు బిగ్గరగా అరచాడు.

ఉద్రేకంతో ఎర్రబడ్డ జమీందారు మొగం చూసిన ధర్మయ్య ఆగిపోయాడు.

"మీరు అన్యాయాన్ని సమర్థిస్తున్నారు."

"మీ అపోహను కాదంటే; కోపంవస్తుంది."

"పోనీ. యిప్పుడు చెప్పండి. పుష్పవతి అయిన రెండు సంవత్సరాల వరకూ మీ అమ్మాయికి పెళ్ళి చేయక పోవడానికి కారణం?"

ఈ ప్రశ్నతో ధర్మయ్యకు బాధకలిగింది.

"నా యిష్టం" అని సమాధానం యివ్వాలను కున్నాడు కాని, నాలుక చివరకు వచ్చి కూడా ఆగిపోయాడు. ఉద్రేకం తగ్గించుకొని మెల్లగా ఈలా అన్నాడు "తమరు ఏ భావంతో అడుగుతున్నారు?"

"సద్భావంతోనే—"

"అయితే వినండి, మరో సంవత్సరం వరకూ అమ్మా యికి పెళ్లిచేయడం ధర్మంకాదు."

"ఏమిటీ?"

"అవును. మీరు మాట్లాడే అష్టవర్షా భవేత్ కన్య అనే పదం అంధకాలంనాటిది"

"అంధకాలం?"

"కాకపోతే ఏమిటి? పురాణ గాథలు మీరు విశ్వ సిస్తారు కదూ?....మరి సీత, సావిత్రి గాథలు కల్పితాలు కావంటారు కదూ? వాళ్ళ పెళ్ళిళ్లు ఎప్పుడయ్యాయి? ఏలా చేసుకున్నారు?" ఈ ప్రశ్నలు వేసి సమాధానం కోసం జమీందారు కేసి క్షణంసేపు చూశాడు. సమాధానం రాలేదు.

ధర్మయ్య మళ్ళీ ఆరంభించాడు "అందుకే అంధకాల మన్నాను. అటు పురాణాలకాలం గాక, ఇటు ప్రస్తుతకాలం గాక మధ్యగా ఆడవాళ్ళను మానవులుగా గుర్తించని చెడు కాలం ఒకటి గడిచిపోయింది. దాన్నే నేను అంధకాల మంటాను" అని కాస్త శ్వాస పీల్చుకునేవరకూ ఆగి ఏదో గుర్తువచ్చినట్లుగా 'వినండి' అన్నాడు ధర్మయ్య. తీవ్రంగా ఆలోచిస్తున్న జమిందారు ధర్మయ్యకేసి శ్రద్ధగా చూశాడు.

"సహగమనంకూడా ఒకనాడు శాస్త్రసమ్మతమై, ధర్మంగా ప్రచారం పొందిందే కదూ?"

"అవును."

"ఇప్పుడు?"

జమిందారు సమాధాన మివ్వలేదు. ధర్మయ్య తార్కికశక్తిముందు జమిందారు మలిన క్రోధావేశం స్తంభించి పోయింది. "సహగమనం ధర్మంగా శాసించిన శాస్త్రకారులు అష్టవర్షా భవేత్ కన్య అని సందేశాన్నివ్వడానికికూడా ఏమీ సంశయించరు... బాలిక కన్యగా మారి ఆలోచించుకునే శక్తి వచ్చేవరకూ, ఆమె ఆమోదం లేనిదే పెళ్ళి చేయడం అధర్మమంటాను."

"బాగుంది. అయితే మీ అమ్మాయి ఆమోదాన్ని అడగడానికి ఎప్పుడన్నా అభిలషించారా?"

"లేదు"

"ఆడపిల్ల తనకు తానై తండ్రిదగ్గర పెళ్ళికావాలని కోరడం ఎక్కడన్నా విన్నారా?"

ఈ మాటకు ధర్మయ్య మనస్సులో ఒక ఆలోచన స్ఫురించింది. అనుమానంగా జమిందారుకేసి చూశాడు. జమిందారు లేచాడు. "మీరు చెప్పింది అసత్యం అని నేను అనలేను. కాని వయస్సువచ్చిన ఆడపిల్లల ప్రవర్తన..." అంతటితో ఆగిపోయాడు. ధర్మయ్య ఆశ్చర్యంగా చూస్తూ లేచాడు "ప్రవర్తన" మళ్ళీ అదేమాట రెట్టించి అడిగాడు ధర్మయ్య.

"అబ్బే! మరేంలేదు. లక్ష్మి చాలా యోగ్యురాలు, అది నేను కాదనను. కాని ఆలస్యంచేస్తే ఆడపిల్లల ప్రవర్తన ద్వారా అనేక కుటుంబాలు కళంకితమైన సంగతి మీకు తెలుసు." అంటూ గంగాధరం ధర్మయ్య దగ్గరగా వచ్చి, భుజంమీద చేయివేసి "కావలసినవారల్లో మీరొకరు. అందుకే కబురుపెట్టాను..." అంటూ మెల్లగా భుజంమీద చరచి "మంచి సంబంధం చూడండి. ఏదన్నా సహాయం కావాలంటే; నేనున్నానుగా...వెళ్ళిరండి."

ధర్మయ్య ఆలోచిస్తూనే మెట్లు దిగాడు. ధర్మయ్యపట్ల జమిందారుకు కలిగిన ఈ అయాచిత ఆదరణకు కారణమేమిటో ధర్మయ్యకు అర్థం కాలేదు.

పరిస్థితుల కనుగుణ్యంగా ప్రమాదం లేకుండా - అపాయంలో కూడా ఉపాయాన్ని ఆలోచించి, హావభావాలతో ఎదుటి వ్యక్తుల మనోనిశ్చయాలను కూడా

మరిపించగల సమర్థత ఒక కొందరిలో ఉండటం సహజం. అసలు విషయాన్ని మభ్యపెట్టడంవల్ల వచ్చిన లాభాన్ని గుర్తించిన జమిందారు; తెలివిగానే వ్యవహారాన్ని నడిపించ గలిగానని సంతృప్తిగా నిట్టూర్చి, మళ్ళీ సోఫాలో నే కూర్చుండిపోయారు.

జమిందారుయింటికి వెళ్ళిన ధర్మయ్య కోసం, శాంతమ్మ లక్ష్మికూడా కనిపెట్టుక కూర్చున్నారు. రవి యింకా రాలేదు.

వీధి చివరన ధర్మయ్య కనుపించగానే, గుమ్మంలో కూర్చున్న లక్ష్మి శాంతమ్మ లోపలకు వచ్చారు.

ధర్మయ్య వచ్చాడు. శాంతమ్మ అతని మొగం పరిశీలనగా చూసింది. కొంచెం కంగారుకూడా పడింది. "ఏం జరిగింది?" అని ఆతురతగా ప్రశ్నించింది.

ధర్మయ్య శాంతమ్మకేసి చూశాడు. ఆమె ఆందోళనను తగ్గించాలని నవ్వాడు. కాని ఆ నవ్వు ఆనంద సహితంగా లేదు. అయితే అనుకున్నంత అపాయం ఏమీ లేదని శాంతమ్మ కాస్త ఊరటపడింది.

లక్ష్మి వంటగదిలోకి వెళ్ళిపోయింది. ధర్మయ్య గదిలోకి వెళ్ళి, తలపాగా తీసి దండెంమీద వేస్తూ 'శాంతమ్మా' అని పిలచాడు.

శాంతమ్మ గదిలోకి వచ్చింది.

"అలా కూర్చో" అన్నాడు.

"ఏమిటన్నయ్యా అది" కూర్చోకుండానే అడిగింది.

"మరేమీ కంగారుపడకే-కూర్చో" అన్నాడు మళ్ళీ. శాంతమ్మ కుర్చీ ప్రక్కగా ఉన్న మంచంమీద కూర్చుంది. ధర్మయ్య కుర్చీమీద కూర్చొని "అమ్మాయికి పెళ్లి చేయడం మంచిదికదూ" అన్నాడు.

కాదని శాంతమ్మ ఏలా అనగలదు? కాని జమిందారు యింటికి వెళ్లి రావడంలోనే, ఇంత హఠాత్తుగా ఈ నిర్ణయం జరగడం శాంతమ్మకు ఆశ్చర్యం కలిగింది.

"మంచిదే; కాని గంగాధరంగారూ..."

"అదే! ఏదో డబ్బుకూడా సహాయం చేస్తానన్నాడు."

శాంతమ్మ సంతృప్తిగా నిట్టూర్చింది. "శుభస్య శీఘ్రం" అనుకుంది మనస్సులో.

"శాంతమ్మా" అని మళ్లీ ధర్మయ్య పిలచాడు. దగ్గరే ఉండగా మరోసారి యిలా పిలవడం శాంతమ్మకు క్రొత్తే అనిపించింది. ధర్మయ్యకేసి చూసింది. ఏదో చెప్పాలనే ప్రయత్నం అతని మొగంలో కనిపిస్తోంది. పిలచినంత వేగంగా కారణాన్ని చెప్పలేకపోయాడు. కాస్సేపు శాంతమ్మ అలాగే చూసి "ఏమిటి?" అని అడిగింది.

"నువ్వు మరోవిధంగా అనుకోకపోతే-" అర్థోక్తిలోనే ఆగిపోయాడు.

"ఎందుకు దాస్తావ్ అన్నయ్యా! అదేమిటో - చెప్పకూడదూ?" అని నిష్కపటంగా అడిగింది.

"మరేం లేదమ్మా! రవికీ లక్ష్మికీ యీడూ జోడూ— యోగ్యమైన సంబంధం కోసం పడి ఊళ్ళు తిరిగేదానికన్నా— నీ కిష్టమైతే వాళ్ళిద్దరికీ పెళ్ళి చేద్దామని ఉంది."

ఆనందాశ్చర్యాలతో శాంతమ్మ మొగం విరిసి పోయింది. ఈలాంటి ఊహ చాలా కాలం క్రితం శాంతమ్మకు కలిగింది. కాని యోగ్యమైన లక్ష్మిని మోటుపనిచేసే కార్మికుడికి కట్టబెట్టమంటావా? అని ధర్మయ్య అంటాడేమో ననే అనుకోడ్డే ఆ ఊహ అలాగే ఉండిపోయింది.

"అంతకన్నానా అన్నయ్యా! నీ కిష్టమైతే అలాగే కానియ్యి" అంది. కంఠం సంతోషంతో నిండిపోయి మాట బరువుగా వచ్చింది. కళ్ళల్లో ఆనందబాష్పాలుకూడా నిండాయి.

పెద్ద లిద్దరూ ఇక్కడ ఒక చిన్న పొరపాటు చేశారనే సంగతి తలుపుచాటునించి ఈ మాటలువిన్న లక్ష్మి బాధతోనూ బాధ్యతగానూ గుర్తించింది. ఆ ఉభయుల యిష్టాలూ లక్ష్మికి అయిష్టమనే సంగతి ఆ యిద్దర్లో ఎవరు గ్రహించినా యింత అల్పసంతోషులు గాకపోదు రేమో.

ధర్మయ్య ఎదురుగా చూశాడు. తలుపు చాటున లక్ష్మి ఉన్నట్లుగా గుర్తించాడు. శాంతమ్మకేసి చూసి, సంతోషవదనంతో "అదుగో" అన్నట్లు సంజ్ఞగా చూపించాడు.

"లక్ష్మీ!" అని పిలిచాడు ధర్మయ్య.

లక్ష్మి వచ్చింది. ఆమె మొగం చూడగల అవకాశం లేకపోయింది. తల వంచుకొనే లోపలకు వచ్చింది. కుర్చీ దగ్గరగా వచ్చి నిలబడింది.

"చూడమ్మా" తలపైకెత్తే ప్రయత్నం చేశాడు ధర్మయ్య. అతని చేతిపై కన్నీటి బొట్టు పడింది.

"ఏమిటదీ?" కంఠం కాస్త కంపించింది.

శాంతమ్మకూడా ఆశ్చర్యంగా చూసింది.

"నా కిష్టంలేదు నాన్నా" అని కళ్లు తుడుచుకొని గదిలోనించి వెళ్ళిపోయింది.

అప్పుడే గుమ్మందగ్గరగా వచ్చి నిలబడ్డ రవి ఈ మాటలు విన్నాడు. కాని ఎవరి గురించి ఆమె ఈలా అందో, అతను అర్థం చేసుకోలేదు.

మంత్రముగ్ధులై అలాటే చూస్తున్న ధర్మయ్య శాంతమ్మలు రవిని చూసి మరీ విస్తుపోయారు.

"ఏమిటమ్మా అది?" రవి మెల్లగా లోపలకు వచ్చి అడిగాడు. ఈ అపాయాన్నుండి తప్పించుకోగల అవకాశం ఏదా అని శాంతమ్మ ఆలోచిస్తోంది. ధర్మయ్య తలవంచుకునే ఉన్నాడు.

రవి ఈ వాతావరణాన్ని గుర్తించిన కాస్సేపటికి ఏదో ఊహ అతని తల్లో మెరిసింది. అదే కావచ్చునికూడా నిర్ణయించుకున్నాడు.

"లక్ష్మీ" అని గట్టిగా పిలిచాడు.

ఆ పిలుపు విన్న లక్ష్మి ముంగిట్లో వెళ్ళడానికి జంకింది. అతని కోపాన్ని ఎరిగిన లక్ష్మి వెళ్ళకుండా ఉండటం మంచిది కాదనుకుంది. మళ్ళీ గదిలోకి వచ్చింది.

"ఏమిటీ నువ్వన్నావ్ ?" ఆలోచనగా ప్రశ్నార్థకంగా అడిగాడు. లక్ష్మికూడా మాట్లాడలేదు.

రవి నవ్వాడు. ఇదే రవి బిగ్గరగా నవ్వడం. అంతా ఆశ్చర్యంగా రవి కేసిచూశారు.

"అర్థం చేసుకున్నాను ... నా ఉద్దేశమే ముందు తీసుకొనిఉంటే మరీ కంగారు పడేవారు...లక్ష్మిని భార్యగా చేసుకోవాలనే పాపిష్టి తలంపు నాలో ఉందని మీరెలా అనుకోగలిగారు...అది జన్మలో కానిపని" అని లక్ష్మి కేసి చూస్తూ "లక్ష్మీ! నువ్వు చాలా నచ్చావ్ ... ఉన్నమాట చెప్పడానికి ఆలస్యం చేసేవాళ్ళంటే నాకు చాలా అసహ్యం!" అంటూ తిరిగి గుమ్మందగ్గరకు వెళ్ళి "దేనిగురించి మీరంతా ఆలోచిస్తారూ! నాకు ప దే ళ్ళ దా కా పెళ్ళవసరంలేదు - సరా!...ఇక లక్ష్మిగురించా! సంబంధం చూడండి. అప్పో సప్పో చేసి, ఆ మూడుముళ్ళూ వేసేద్దాం. అయితే అదైనా లక్ష్మి యిష్టపడితేనే" అంటూ చావిట్లోకి వచ్చాడు.

ధర్మయ్య శాంతమ్మ, రవి మాటలు విని మరీ విస్తుపోయారు.

"ఓ - లక్ష్మీ! పెళ్ళిభోజనాలు తరువాత ... ఆకలే స్తోంది" అని పిలచాడు రవి.

లక్ష్మి గదిలోనుంచి, రవికి అన్నం పెట్టడానికి వెళ్ళింది.

# 20

రాము రెండురోజులవరకూ మళ్ళీ ధర్మయ్యగారింటికి వెళ్ళలేదు. వెళదామని మనస్సు ఆరాటపడుతున్నా తను లక్ష్మి రెండుసార్లు ప్రవర్తించిన విధానం చాలా లజ్జాకరంగానూ, అవమానపూరితంగానూ ఉండి బాధపడసాగేడు.

తనకు తెలీకుండా ఈ రెండురోజుల్లో ఈ ఊహే అహోరాత్రాలు మానసికంగా సంచారంచేసి, లక్ష్మిపట్ల ఒక గౌరవభావాన్ని ఒక అపురూప నవ్య శోభను రాము హృదయంలో ప్రతిష్ఠింపచేశాయి. ఆమెను చూడాలనే కుతూహలాన్ని అడ్డుపెట్టే అధికారం రాములో ఉండేశక్తులన్నీ కేంద్రీకరించినా ఫలితం లేకపోయింది.

కాలేజీనుంచి వచ్చిన తర్వాత సుమారు ఆరుగంటలకు బట్టలు మార్చుకొని, వీధిలోకి వెళ్ళడానికి మెట్లుదిగుతున్న

రాముని జమీందారు చూశాడు. హాలులోనుంచి బిగ్గరగా దగ్గుతూ వెలుపలకు వచ్చాడు.

రాము వెనక్కి తిరిగి చూడకపోయినా, తండ్రి దగ్గు విని గమనాన్ని మందగింపచేశాడు.

"ప్రొద్దుగ్రుంకబోయేముందు ఎక్కడికీ ప్రయాణం?" అని అడిగాడు గంగాధరం.

రాము ఆగిపోయి "ఏమీ తోచక..." అని తల వంచి మెల్లగా అన్నాడు.

"చీకటి పడిందంటే గోతులూ గొప్పులూ కనిపించవు ...ఎక్కువగా తిరగడం అంత మంచిదికాదు" అని చెప్పి లోపలకు వెళ్ళిపోతున్నాడు.

రాము కాస్సేపు అలాగే నిలబడిపోయాడు. జమీందారు అభిమతాన్ననుసరించి ఆగిపోదామనే బుద్ధి రాముకి పుట్టలేదు. తిన్నగా గేటు తీసుకొని వెలుపలకు వెళ్ళిపోయాడు.

గంగాధరం హాలులో నిలబడే వెళ్ళే రాముకేసి చూస్తూ వుండిపోయాడు. ఈ తిరస్కారభావం జమీందారు మనస్సును వ్యథపెట్టింది.

శుక్రవారం లక్ష్మీపూజచేసి పళ్లెంతో ఫలహారాన్ని తీసుకొని భర్తకోసం అన్వేషిస్తూ పార్వతమ్మ అక్కడికే వచ్చింది.

"ఏమిటలా చూస్తున్నారు?" అని మెల్లగా అడిగింది.

పరధ్యాన్నంగా ఉన్న గంగాధరం చలించి భార్య కేసి తిరిగి చేతులు నమ్రతగా ఎదుటకు చాచి, ఫలహారాన్ని అందుకొని కళ్లకద్దుకొని నోట్లో వేసుకున్నాడు. వెళ్లి సోఫాలో కూర్చున్నాడు.

భర్తనుంచి సమాధానం రాకపోవడంవల్ల తిరిగి ఆమె వెళ్లిపోయింది.

గంగాధరంలో తీవ్రతను ఆలోచన ద్వారా ఏర్పడ్డ ఆ తాత్కాలిక దీక్షలో బహుశా పార్వతమ్మ మాటకూడా విస్పష్టంగా వినిపించలేదేమో; రాముగురించి వారంరోజుల ముందువరకూ ఒకేవిధమైన ఆలోచన అతన్ని బాధించింది. ఆ ఆలోచన ద్వారానే, ధర్మయ్య తిరస్కృతివల్ల ఏర్పడ్డ తీవ్రభావం ధర్మయ్యకు శిక్షనిచ్చింది.

శాంతమ్మ రాముకు తల్లిగా తెలీకూడదనే పట్టుదలతోనే ఇంతకాలం బాధపడ్డాడు. కాని దానికన్నా మించిన ఒక విపత్తు జమీందారు కుటుంబంలో ఏర్పడే దుస్థితి వస్తుందని, గంగాధరం కలలోకూడా ఊహించలేదు. పేదబాలిక రాము పొరపాటు ద్వారా కోడలయ్యే ఘోరాన్ని జమీందారు ఏ విధంగానూ క్షమించదలుచుకోలేదు. సోఫాలోనించి లేచాడు.

"మల్లయ్యా."

"బాబూ."

"అలా బైటకు వెళదాం నడు."

"డ్రైవర్ని పిలవనా?"

"అక్కర్లేదు. నడిచే వెళ్తాం."

మల్లయ్య చాలా ఆశ్చర్యపడ్డాడు. అధికారి ఆజ్ఞ కాదనే అధికారం తనకు లేదని తెలుసు. మెల్లగా జమీందారు వెనకాల బయలుదేరాడు.

రాము ధర్మయ్య గుమ్మం ఎక్కేసరికి శాంతమ్మ చావిట్లో ఒంటరిగా కూర్చొని ఉంది. రాముని చూచి శాంతమ్మ లేచింది.

"కూర్చో బాబూ" అంది.

రాము బల్లమీద కూర్చున్నాడు. అతని కళ్లు లక్ష్మి గురించి వెతుకుతున్నాయి.

"ఎక్కడా రావడల్లేదేం బాబూ?"

"పరీక్షలు దగ్గరకొస్తున్నాయి కద్దూ" అంటూ ధర్మయ్య ఉండే గదివేపు చూసి "మాష్టారెక్కడ?" అని అడిగాడు.

"ఊరెళ్లారు."

రాము ఆశ్చర్యపడ్డాడు. ధర్మయ్య పొరుగూరు పోవడమనేది ఎప్పుడూ రాము వినలేదు. "ఏవూరు?" అని ఆత్రంగా అడిగాడు.

శాంతమ్మ సమాధానం చెప్పలేదు.

వంట చేస్తూ రాము రాక ఆశ్చర్యపోయిన లక్ష్మి ఈ మాటలన్నీ శ్లాఘన వచనాన్ని ప్రక్కగా పెట్టి శ్రద్ధగా వింటూంది.

"లక్ష్మి కనిపించదే!" ఈ ప్రశ్నకూడా ఆత్రంగానే ధ్వనించింది.

"వంటచేస్తోంది" అని శాంతమ్మ సమాధానం చెప్పిన మీదట రాము లేచాడు. "అలా పోతానమ్మా" అన్నాడు.

లక్ష్మి వంటగదిలోనించి వచ్చింది. రాముని చూసింది. పలకరించాలనే కుతూహలం ఆమెలో లేదు.

మందహాసహీనమైన ఆమె శుష్కవదనాన్ని ఆ కను చీకట్లో రాము సరిగా పరికించలేదు.

రాము మనస్సు మాత్రం ఒంటరిగా—తాను యిక్కడ పరాయివానిగా నిలబడ్డాననే భావాన్ని పదేపదే స్ఫురింప చేస్తోంది. శాంతమ్మకూడా కూర్చోమన లేకపోయింది.

రాము గుమ్మంవరకూ వెళ్ళి "ఆ- మరచా-మాష్టారు ఎక్కడికి వెళ్లారూ?" అని మళ్లీ అడిగాడు.

శాంతమ్మకూడా లేచింది: "ఒక్క ఊరని ఏముంది? ఎక్కడ మంచి సంబంధం ఉందని తెలిస్తే అక్కడకల్లా వెళ్ళి చూస్తూ వుంటాడు" అని సమాధాన మిచ్చింది.

"సంబంధం?" రాము ఆశ్చర్యంగా ఆలాగే నిలబడి ప్రశ్నించాడు. లక్ష్మి అక్కడ ఉందేమోనని చూశాడు. లక్ష్మి లేదు.

"ఆఁ మన లక్ష్మికి సంబంధంకోసం వెళ్లాను" అని శాంతమ్మ చెప్పింది.

ఈ మాట పిడుగుపాటులా రాముకి స్ఫురింపచేసింది. కాలు కదపలేడు. మళ్లీ ఏమీ ప్రశ్నించలేడు. అలాగే నిలబడిపోయాడు.

"వెళ్లడం నీకు తెలీదా బాబూ!" అని కాస్త ఆశ్చర్యంగానే అడిగింది శాంతమ్మ.

లక్ష్మి వంటగదిలోకూడా లేదు. రాముకి కనిపించకుండా గోడకు జారగిలపడి నిలబడి ఉంది. ఆమె మొగంలో విరక్తి, వైరాగ్యభావాలు నిస్సత్తువగా దీపిస్తున్నాయి.

రాము ఒక క్షణంపాటు నిలబడి, ఊర్ధ్వశ్వాసను విడచి శాంతమ్మ మొగంలోకి చూశాడు. ఆమె అతని వైఖరిని మసకవెలుగుల్లో గమనించలేకపోయింది.

"బాబూ! నువ్వు చేసే ఈ ఉపకారాన్ని మీామాష్టారు జన్మలో మర్చిపోలేరు" అంటూ అతని సమాధానంకోసం చూసింది. రాము అలాగే గుడ్లు వప్పజెప్పి చూస్తున్నాడు.

మళ్లీ శాంతమ్మ ఈలా అంది "మీ నాన్నగారితో చెప్పి లక్ష్మి పెళ్లికి సాయం చేయడం అన్నయ్యకు ఎంతో ఆనందం గలిగించింది."

"ఔను" అని హీనంగా, బాధగా తల పంకిస్తూ అన్నాడు.

పొయ్యిమీద కాగే ఎసరు పొంగి, మండే పొయ్యిని ఆర్పిన ధ్వని శాంతమ్మకు వినిపించింది.

"ఎక్కడున్నావే లక్ష్మీ" అంటూ ఖంగారుగా వంట గదిలోకి శాంతమ్మ వెళ్లింది.

అయాచితంగా - చేయని కృషికి - ఫలానికీ వచ్చే అభినందనలను తట్టుకుంటూ "ఔను" అని అనలేకుండా ఉండలేకపోయాడు రాము.

ఆ ధ్వని నూతినుండి వినిపించినంత హీనంగా ఉన్నా- తదేకదీక్షతో చాటునుండి సమాధానంకోసం చూస్తున్న లక్ష్మి చెవినుండి కాగి దేదీప్యంగా మెరుస్తూ కరిగినసీసంలా సాగిపోయి ఆమె హృదయాన్ని తూట్లుపరిచింది. అందుకే పొయిమీద పొంగి అగ్నిలో కృంగిన జలంయొక్క శృంగభంగ కోలాహలపుధ్వని కూడా ఆమె చెవులకు సోకలేదు.

"లక్ష్మీ" చేతులతో ద్వారబంధాన్ని పట్టుకొని లోపలకు వంగి, చైతన్య విహీనంగా ఉన్న లక్ష్మిని చూస్తూ రాము పలకరించాడు.

కళ్లు తెరచి చూసింది.

"ఏమిటిది?"

"ఏముంది?"

"నువ్వు చెప్పనక్కర్లేదా?"

"నేను మగవాణ్ణి కాదే" అంటూ గోడదగ్గర్నుంచి కదిలి రాము ఎదురుగా వచ్చి "నా నేరం ఏమిటి? నా

కెందుకూ చెప్పు? నాకు తెలీకుండా అన్నీ ఏర్పాట్లూ చేసి తెలీనట్లుగా పలకరించడానికివచ్చావా?.. నాతో మాట్లాడకు వెళ్ళిపో!'' హృద్వేగంతో వచ్చే ఈ మాటలని ఉబికివచ్చే దుఃఖాన్ని అదుముకోనేశక్తి లేక కారే కళ్ళనీళ్లను రెండు చేతులతో కప్పుకొని ప్రక్కకు తిరిగింది.

శాంతమ్మ వంటగదిలోనుంచి వచ్చి ఈ దృశ్యం చూసింది. ఏదో చెప్పాలని గుమ్మంలో కాలుపెట్టిన రాము శాంతమ్మను చూసి, నిర్విణ్ణుడైపోయాడు.

''నేను తోట్లోకి వెళుతున్నా'' అని ఖంగారుగా అస్పష్టంగా అని రాము గిరున తిరిగి వెళ్ళిపోయాడు.

శాంతమ్మ ఆశ్చర్యానికి అంతులేదు. మెల్లగా లక్ష్మి దగ్గరకు వచ్చి ''లక్ష్మీ'' అని పిలిచింది.

లక్ష్మి కళ్లుతుడుచుకొని, శాంతమ్మను తప్పుకొని లోపలకు వెళ్ళడానికి రెండడుగులు వేసింది.

''ఏమిటి లక్ష్మీ!'' అని శాంతమ్మ వెనకనించి అనడంలో లక్ష్మి కొయ్యలా నిలబడిపోయింది.

''నేను నీకు పరాయిదాన్ని కాదుగా... అదేమిటో వినకూడదూ?''

లక్ష్మి ఉద్ధృతంగా వెనక్కి తిరిగింది. శాంతమ్మ హృదయంలో శిరస్సు ఉంచి ''అత్తా'' అని బావురుమంది.

శాంతమ్మ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. బలహీనమైన నవ్వు కళ్లనీళ్లతోనే నవ్వింది. లక్ష్మి శిరస్సు స్పృశిస్తూ "తప్పమ్మా! అందనిపండుకి ఆశపడకూడదు" అని మృదువుగా అంది.

"అందనిపండు" అంటూ అగమ్యంగా కళ్లనీళ్లతో అలుక్కుపోయి కనిపించే శాంతమ్మ మొగాన్ని చూసింది లక్ష్మి.

"అలాంటి అదృష్టాన్ని నేను కూడా చూడాలను కున్నాను ... కాని ..." గద్గదికంగా అంటూ శాంతమ్మ కళ్లనీళ్లు తుడుచుకొంది. శాంతమ్మలో దాగిన అనురాగ పూరితమైన ఈ ఆశయానికి అర్థమేమిటో లక్ష్మి తెలుసుకోగల స్థితిలో లేదు. తాను పొందిన హఠాత్ ఉద్భూతానుభూతికి తిరిగి శాంతమ్మకు మొగం చూపలేక తిన్నగా తండ్రి గదిలోకి వెళ్లి మంచంమీద వాలిపోయింది లక్ష్మి.

"తోటలోకి వెళుతున్నా" అని ఆత్రంగా అస్పష్టంగా రాము అన్నమాటల్లో అర్థం లేకుండా పోలేదని లక్ష్మికి తెలుసు. అనేక మార్లు తాను తోటలో కనిపించాలని కాంక్షించే రామునకు ఈ సంజ్ఞాపూర్వక వాచకం అలవాటై పోయింది. అందుకే రాము మెల్లగా వెళ్ళి తన స్థానంలో కూర్చున్నాడు.

తనకు తెలీకుండా యింత గ్రంథం జరగడంలో ఉండే కారణాన్ని పర్యవలోకనం చేయ ప్రారంభించాడు.

గంభీరమైన తండ్రి విగ్రహంముందు, భావస్ఫూరితమైన ఆయన మాటలముందూ రాము ఎప్పుడూ తలెత్తి ఎరగడు. మాట్లాడే సంకల్పంకూడా ఎప్పుడూ కలగలేదు. కాని గౌరవంగా భావించే తండ్రి తలపెట్టిన ఈ దుశ్చర్యకు రాము మనస్సులో ఒక క్రోధం ఆవహించింది.

పెద్దల యందు చూపే వినయానికి కూడా ఒక హద్దంటూ లేకపోతే; భావిని కాంక్షించే ప్రతిజీవి తప్పక భగ్నపడే దుస్థితికిరావడంలో ఆశ్చర్యంలేదని గ్రహించాడు.

మల్లయ్య రాకలో వుండిన మహత్తర సత్యాన్ని తెలుసుకొని అరికాలును బాధగా ఒక్కసారి రాసుకున్నాడు.

అనురాగపూరితమైన తన హృదయంలో అధిష్టించిన పవిత్రమైన లక్ష్మీవిగ్రహాన్ని తొలగించుకునే దుస్థితి పరిస్థితులే కల్పిస్తే, ప్రాణంపోవడమే అంతకన్నా సుఖమైన గమ్యమని ఊహింపసాగాడు.

ఎండుటాకుల గలగలధ్వనులవల్ల రాము ఆలోచన్నుండి తేరుకున్నాడు. ప్రక్కను చూశాడు.

చెట్లగుబురునుండి చీల్చుకువచ్చే చంద్రకాంతిలో ఎవరో తనవేపే వస్తున్నట్లు గుర్తించాడు. లేచాడు.

వెంటనే ఆకులధ్వని ఆగిపోయింది. వచ్చేవ్యక్తి నిలబడిపోయాడు. మొదట్లో లక్ష్మిగా భ్రమించిన రాము, నిస్పృహగా నిట్టూర్చాడు. మల్లయ్య అని వెంటనే గ్రహించాడు.

మామూలు స్థానంలో కూర్చొన్నాడు. క్రిందభాగాన్ని చూశాడు. కొబ్బరికమ్మ కాళ్ళదగ్గరగానే వుంది.

మళ్ళీ ఆకులు కదలాయి. రాము చూడ్డానికి ఏమీ ప్రయత్నించలేదు.

కాస్సేపటికల్లా మల్లయ్యనీడ తన ఎదురుగానిలబడింది. రాము కళ్ళలో క్రోధం మెరసింది. కాళ్ళదగ్గరవున్న కమ్మ తీసుకొని, లేచి బలంగా మల్లయ్యపై విసరాడు.

"బాబోయ్" అని మల్లయ్య అరచాడు.

మరోదెబ్బకొట్టి, కమ్మ ప్రక్కగా విసరి, మల్లయ్య చేయిపట్టుకొని "గ ట్టి గా అ ర వ కు" అని తనే బిగ్గరగా అరచాడు రాము.

మల్లయ్య వొణుకుతూ నిలబడిపోయాడు.

"ఎందుకొచ్చావ్ ?"

మల్లయ్య సమాధాన మివ్వలేదు. ఒణుకుతూ అర్థం గాకుండా ఏదో చెప్పబోతున్నాడు.

వాడి దుస్థితిచూసిన రాము మనస్సులో క్రోధమంతా అదృశ్యమైపోయి ఆ స్థానంలో జాలి, కరుణ వెంటనే చేరుకున్నాయి. తాను చేసిన పని ఎంత నీచమైందో వెంటనే గ్రహించగలిగాడు. వేదనగా మల్లయ్యకేసి చూశాడు.

మల్లయ్య ఇంకా వణుకుతూనే వున్నాడు. తలతో ఓ ప్రక్కకు చూపించడానికి ప్రయత్నిస్తున్నాడు. రాము ఆ

సంజ్ఞను అర్థం చేసుకోలేను. జేబులో చేయిపెట్టి వెతగ్గా అయిదురూపాయలనోటు దొరికింది.

"తీసుకో — నాన్నగారితో చెప్పకు" అని చెమ్మగిల్లినకళ్ళతో చేతిలో పెట్టాడు రాము.

కొద్దిదూరంలో చూత్రిప్రక్కనుంచి జమిందారు యివన్నీ గమనించాడు. కాని రాము ఎదురుగా రాలేదు. ఈ మాటలన్నీ విన్న జమిందారు రాము ఎదురుగా వస్తే; తన విలువను వెలకు పెట్టినట్లుగా వుంటుందని తెలుసుకుని ప్రక్కనున్న నాగయ్యచెవిలో ఏదోచెప్పి, ఆ వెన్నెల వెలుగులో జమిందారు నడిచి వెళ్ళిపోయాడు.

మల్లయ్య డబ్బుతీసుకొని తగిలిన దెబ్బలు చేతితో తడుముకుంటూ అక్కణ్నుంచి కదిలాడు.

మల్లయ్య వెళ్ళినతర్వాత రాము తన ఆవేశానికి తనే చాలా పశ్చాత్తాప పడ్డాడు. రాము జీవితంలో మరోజీవిని బాధపెట్టడం ఇదే ప్రారంభమనుకున్నాడు. కాని కనిపించని గాయాన్ని మరోజీవి హృదయంలో కలిగించాననీ ఆ జీవి రెండురోజులనించి నిద్రాహారాలుమాని క్షోభిస్తోందని రాముకేం తెలుసు?

గడియారం చూచుకున్నాడు. తొమ్మిదిగంటలయింది. లక్ష్మి వస్తుందనే ఆశ రాములో అంతరించింది. లేచి స్తబ్ధతగా నిలబడి కాస్సేపు బావికేసి తీక్షణంగా చూశాడు. మెల్లగా కదిలి గేటుదగ్గరకు వెళ్ళాడు.

"బా బు గా రూ" అంటూ వెనుకనించి నాగన్న పిలచాడు. రాము ఆగి చూస్తున్నాడు. నాగన్న దగ్గరగా వచ్చాడు.

"రేపటినించి తమరు రావడానికి వీలుండదు" భయ పడుతూ, ఇంతకుముందే మల్లయ్యకు జరిగిన సన్మానాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ మెల్లగా అన్నాడు.

"ఎందువల్ల ?"

"రేప్పొద్దున్నే- దొరగారు గేటుమూసేస్తున్నారు"

"అదే - ఎందుకని ?" మరీ దిగ్గరగా అడిగాడు.

"నాకేం తెలుసు బాబూ! రేప్పొద్దున్నుంచి నన్ను కూడా ఇంటిదగ్గర పనిలోనే వుండమన్నారు ... అసలు ఈ తోట్లోకి ఎవరూ రాడానికి వీల్లేదని చెప్పారు."

"ఎప్పుడు ?"

"ఇంతకుముందే"

తీరా చెప్పినతర్వాత నాగన్న పొరపాటైందని నాలుక కరుచుకొని భయపడ్డాడు. ఇంతకుముందే అనడంలో రాము భయాశ్చర్యాలతో నిలబడిపోయాడు. నాగన్నకు మాత్రం ఈ ఆజ్ఞ జమిందారుద్వారా ఎప్పుడు లభ్యపడిందో ఇతరులకు చెప్పేవిధానం మాత్రం గంగాధరం చెప్పలేదు. "సరే" అని గట్టిగా గాలి విడుస్తూ గేటుదాటి చురుగ్గా నడుస్తూ యింటి వేపునకు వెళ్ళిపోయాడు.

# 21

పెళ్ళిన పదిరోజులకు ఒక మంచి సంబంధాన్ని స్థిర పర్చుకొని తిరిగి వచ్చాడు ధర్మయ్య—.

పదిమైళ్ళదూరంలో ఉన్న ప్రక్క గ్రామంలో కులీన మైన చౌదరీ కుటుంబంతో ఇంత పేదస్థితిలో వియ్యమందడం ధర్మయ్యకు కష్టమైనా–జమిందారిచ్చిన భరోసాతో అయిదు వందల రూపాయలు కట్నమివ్వడానికికూడా వెనుతీయ లేదు.

ఒక శుభముహూర్తాన పెళ్ళికొడుకు కోరికమీద లక్ష్మిని చూపడానికి ధర్మయ్య ఆమోదించే వచ్చాడు.

రవి యీ విషయం విని ఎంతో ఆనందపడ్డాడు. అయితే డబ్బువిషయం గురించి అతని మనస్సులో ఆందోళన లేకుండా పోలేదు.

లక్ష్మితో క్రితం ఉన్నంత చనువుగా ఉండలేక పోతున్నాడు. "లక్ష్మి" అని అధికార పూర్వకంగా పిలచే ఆ పిలుపులో ఒక సౌమ్యత ఏర్పడింది.

లక్ష్మిలోకూడా విచిత్రమైన మార్పు రవి గమనించాడు. ఆమె ప్రతి విషయంలో ఉదాసీనంగా ఉంటూ, పనులు చేయడంలో అంతగా శ్రద్ధలేక, అస్థిరమైన ఈ యింట్లో నాదనే వస్తువు లేదనేభావంతో ఉన్నట్లుగా రవికి కనిపించింది. బహుశా భవిష్యత్తులోకన్న యిల్లు విడుస్తామనే కన్యల మనః

పరిస్థితి ఈలా మారుతుంది కాబోలని తనకున్న పరిజ్ఞానంతో స్థిరపర్చుకున్నాడు. భోజనందగ్గర కూర్చున్న రవి, వంట గది వైపు చూస్తూ—"చారు" అని పిలిచాడు.

వంటగదిలో నుంచి కళ్ళు తుడుచుకుంటూ వచ్చిన లక్ష్మి, మజ్జిగపాత్ర తీసుకవచ్చి రవిదగ్గర పెట్టింది.

దూరంగా పాతచీర కట్టుకుంటున్న శాంతమ్మ లక్ష్మి చేతిలో మజ్జిగపాత్ర చూసి ఆశ్చర్యపడింది.

రవికూడా మొదట్లో ఆశ్చర్యంగానే చూశాడు. తరువాత మెల్లగా నవ్వుకున్నాడు.

ఆ నవ్వునకు అర్థమేమిటో లక్ష్మి గ్రహించలేక పోయింది. రవికేసి చూసింది.

"నే నడిగింది ఏమిటి?" అన్నాడు రవి.

చేతిలో పాత్రచూచుకొని "ఏమడిగావూ?" అంది.

"చారు కదూ?" అంటూ నవ్వాడు.

"ఇదికూడా అవసరమేగా!" అని క్రిందపెట్టింది. ఆ నవ్వులో ఆమె పాల్గోలేదు. ఇదే మరొకప్పుడైతే, ఆమె చేసిన పొరపాటునకు తప్పక ఆమెకూడా నవ్వొచ్చేదే.

లక్ష్మి చారుకోసం లోపలకు వెళ్ళిన తర్వాత రవి తల్లికేసి చూస్తూ "లక్ష్మికి పెళ్ళిమాట విన్నదగ్గర్నుంచీ— మనస్సు అంతా అత్తారింటిదగ్గరే ఉంటున్నట్లుంది" అన్నాడు.

శాంతమ్మకూడా ఏమీ సమాధాన మివ్వలేదు. మనస్సులో మాత్రం "మనస్సు ఒకచోట మనువు ఒకచోట ...పగవాళ్ళకైనా ఈలాంటి శిక్ష యివ్వకు భగవాన్" అనుకొంది.

మరొకనాడు పొలంలోనుంచి వచ్చిన ధర్మయ్య తన గదిలో కాలుపెట్టి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి పోయాడు.

లక్ష్మి తలగడలో తలదూర్చి వెక్కి వెక్కి ఏడవడం కళ్ళారా చూశాడు. కంగారుగా మంచందగ్గరకు వెళ్ళి మంచంమీద కూర్చుని "లక్ష్మీ" అని పిలిచేవరకూ లక్ష్మి తండ్రి వచ్చినట్లుగా గుర్తించలేదు. తృళ్ళిపడి లేచి కళ్ళు తుడుచుకొని గదిలోనుంచి వెళ్ళబోయింది. కాని ధర్మయ్య ఆపుచేశాడు.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్!" అని అడిగాడు.

లక్ష్మి ఏం సమాధానం చెబుతుంది. "అబ్బే! ఏమీ లేదు నాన్నా!" అని తలవంచుకొంది.

ధర్మయ్యకూడా లేచాడు. "నా దగ్గర దాస్తావెందుకమ్మా ... ఏమిటి చెప్పవూ?" దగ్గరగా వచ్చి అడిగాడు.

"అందనిపండు" అన్న శాంతమ్మ మాట లక్ష్మికి గుర్తువచ్చింది. ఆశిస్తే మనస్సులో మలినం వెళ్ళడికావడం తప్ప ఫలితం లేదనుకుంది.

"ఏమి టన్నయ్యా!" అంటూ శాంతమ్మకూడా గదిలోకి వచ్చింది. శాంతమ్మను చూసిన లక్ష్మి సిగ్గుతో తలను మరీ క్రిందకు దించుకుంది.

బాధగా - బాధ్యతగా శాంతమ్మకేసి తిరిగి "నేను వచ్చేటప్పటికి లక్ష్మి వెక్కి వెక్కి ఏడుస్తోందమ్మా!" అన్నాడు.

శాంతమ్మ నవ్వింది. ఈ నవ్వు శ్రేయోభిలాషిత్వాన్ని కాంక్షించే నటనా పూర్వకమైందిగా ధర్మయ్య గ్రహించ లేదు.

"తల్లిలోటు లేకుండా పెంచిన తండ్రిని విడిచి అత్తింటికి వెళ్ళడమంటే; ఆడబిడ్డకు ఎంత బాధ" అంటూ లక్ష్మి దగ్గరగా వచ్చి తలపై చేయివేసి "తలుచుకున్నప్పుడల్లా కళ్ళ నీళ్ళు వస్తాయి ... ఊరుకోమ్మా" అంది.

ఈ మాట విన్న మర్మంలేని ధర్మయ్య హృదయం ఒక్కసారి తల్లడిల్లిపోయింది. పై కండువాతో కళ్లనీళ్ళు తుడుచుకుంటూ "తప్పమ్మా! పెళ్ళయ్యి వెళ్ళేటప్పుడు కదా బాధపడాలి ... నిన్నుమాత్రం విడిచిపెట్టి నేనుండగలనా అమ్మా!" అని ఊరడించాడు.

లక్ష్మి మెల్లగా అక్కడనించి వెళ్ళిపోయింది. ధర్మయ్య కండువా దండెంమీద వేసి మంచంమీద కూర్చు న్నాడు. శాంతమ్మకూడా ఆ గది విడవడానికి ప్రయత్నించే ముందే ధర్మయ్య ఈలా అన్నాడు "రేపు మూడుగంటలకు వస్తారట."

"ఎవరూ?" శాంతమ్మ అడిగింది.

"పెళ్ళికొడుకూ మరో యిద్దరు పెద్దలూనూ"

"ఇదేమిటి!" శాంతమ్మ ఆశ్చర్యంగా అని "పెళ్ళి కొడుకు రావడమేమిటి?" అంది.

"లక్ష్మిని చూడ్డానికి..." శాంతమ్మలో ఆశ్చర్యం అలాగే ఉండటం చూసి "ఇదేం కొత్త కాదమ్మా! ఇప్పుడు పెళ్ళిళ్ళన్నీ అలాగే జరుగుతున్నాయి" అన్నాడు ధర్మయ్య.

ధర్మయ్యకు సంతృప్తికరమైన ఈ వార్తకు శాంతమ్మ అంత ఆశ్చర్య పడవలసిన అవసరం లేదనుకుంది.

ధర్మయ్య ఏదో ఆలోచిస్తూ పైకిలేచి ముహూర్తం కూడా రేపే నిశ్చయిస్తారు" అని కూడా అన్నాడు.

"ఈ విషయం గంగాధరంగారికి తెలుసా?"

"ఇప్పుడే ఎందుకూ?" అమాయకంగా అడిగాడు ధర్మయ్య.

"నీకు తెలీదన్నయ్యా!" మెల్లగా అంది. ధర్మయ్య ఆశ్చర్యంగా చూశాడు.

"ఉదయాన్నే వెళ్ళి వారినికూడా రమ్మని పిలువు."

ఈ మాటకు ధర్మయ్య నవ్వాడు. తనకు తెలీదని నిరూపించిన శాంతమ్మ తెలివి ఇంత ఘనంగా ఉందేమో అనుకున్నాడు.

"జమీందారు మనయింటికి రావడమా?" అన్నాడు.

"అబ్బే! నేను చెప్పేది నీకర్థం కావడంలేదు" అని, గుమ్మంవైపు ఒకసారి చూసి "ఈ గౌరవం ఆయన కివ్వడం చాలా మంచిది. ఆయన రాకపోయినా రాము రావడానికి అభ్యంతరం ఉండదుగా. పైగా రేపు డబ్బు యిచ్చే బాధ్యత ఆయనపై నున్నప్పుడు చెప్పకుండా ముహూర్తం పెట్టడం మంచిదంటావా" అని ప్రశ్నార్థకంగా మొగంపెట్టింది.

మగవాళ్లు ఎంత తెలివైనవాళ్ళని మురిసినా—పెళ్ళిళ్ళ విషయాల్లో ఆడవాళ్ళు సూచించే సౌలభ్య మార్గాలకు—ఆ ముదుపు మరచి, తమ అనాలోచితానికి నివ్వెరపడ్డం కూడా సహజమేమో; శాంతమ్మ చెప్పిన పద్ధతికి ధర్మయ్య ఎక్కువ కాలాన్ని వినియోగించకుండా వెంటనే ఆమోదించాడు.

జమిందారు ఉదయ స్నానమైంతర్వాత గదిలో బట్టలు వేసుకుంటున్న సమయంలో మల్లయ్య రావడం ఎదురుగా ఉన్న అద్దంలో చూశాడు.

"ఏమిరా?"

"ధర్మయ్యగారు వచ్చారు"

జమిందారు వెనక్కి తిరిగాడు. "అబ్బాయి లేచాడా?" అని అడిగాడు.

"లేదనుకుంటానండి"

"ఛా!" ఆ సమాధానానికి వచ్చిన కోపంతో ముందు ఆలా అని తర్వాత వెళ్లే మల్లయ్యను చూసి "మాట" అని

పిలిచాడు. మల్లయ్య వెనక్కి తిరిగి చేతులు నలుపుకుంటూ అభినయిస్తున్నాడు.

"వారిని కూర్చోమని చెప్పి నువ్వు వెళ్ళి డాక్టర్ని పిలుచుకురా" అన్నాడు. మల్లయ్య వెళ్ళిపోయాడు. హాలులో కూర్చున్న ధర్మయ్య గంగాధరం రావడం చూసి లేచాడు.

"కూర్చోండి! ఏమిటి విశేషం?" అంటూ జమిందారు సోఫాలో కూర్చున్నాడు.

"ఈరోజు ముహూర్త నిశ్చయానికి పెళ్ళిపెద్దలు వస్తున్నారు" అన్నాడు ధర్మయ్య. ఈ మాటకు జమిందారు మొగంలో ఆనందం వ్యక్తమయింది.

"భేష్! పట్టుదలంటే అలా వుండాలి" అని ఒక పొగ క్తను అయాచితంగా విసరి "శుభం! ఏర్పాటుచేయండి" అన్నాడు.

"మీరుగూడా..."

"ఎక్కడికి?"

గంగాధరం ప్రశ్నకు ధర్మయ్య వెంటనే సమాధాన మివ్వలేదు. లాంఛనప్రాయంగా - శాంతమ్మ అభిప్రాయాను గుణంగా అడగాలనే ఉద్దేశంతప్ప, అది ఎంతవరకూ సఫలీ కృతమవుతుందో ధర్మయ్యకు తెలుసు. అందుకే ఆ మాట పూర్తిచేయనూలేదు. బలంగా ధ్వనించనూ లేదు. కాని జమిందారు ధర్మయ్య ఉద్దేశాన్ని సులభంగానే గ్రహించాడు.

"నేనెందుకూ?" అన్నాడు.

"మీరు రాగల అవకాశం ఉండదని నాకు తెలిసినా-కావలసినవారు కావడంవల్ల అడగడం నాధర్మం" అన్నాడు.

ఈ ధర్మం అనే పదానికి జమిందారు మెదడులో గతం ఒక్కసారి స్ఫురించింది. తనలో ఒక్కసారి నవ్వుకున్నాడు. ఎందుకు నవ్వాడో ధర్మయ్య కూడా తెలుసుకున్నాడు. జమిందారు ఎదుట ఆ పదం వాడ్డం మంచిది కాదనుకున్నాడు.

"కావచ్చు - పెళ్లి కేలాగూ రావడం తప్పదుగా" అన్నాడు జమిందారు.

"రాము రావడం మీకు అభ్యంతరం లేకపోతే..." అనే ధర్మయ్యమాట పూర్తి కాని క్రితమే జమిందారు ఈలా అన్నాడు "వాడికి వంట్లో అంతగా బాగుంటల్లేదు."

"ఏం?"

ధర్మయ్య ప్రశ్నకు జమిందారు ఏం సమాధానం చెబుతాడు. కారణం కొంతగా తెలుసున్నా- పూర్తి కారణం కూడా అది కాదేమో అనే నమ్మకంకూడా జమిందారుకు లేకుండా పోలేదు.

"పరీక్షలుకదూ రేయింబవళ్లు మేలుకుంటే; కాస్త ఆరోగ్యం పాడైంది"

"కాలేజీకి వెళ్లడల్లేదా?"

"లేదు" అంటూ జమిందారు లేచాడు. "నాకు పనుంది...చాలా సంతోషం. ముహూర్తం పెట్టినతర్వాత

కనుపించండి'' అని చెప్పి, ధర్మయ్య ఏం చెప్పినా వినగల పరిస్థితిలో లేనట్లుగా వెళ్లిపోయాడు.

ధర్మయ్యకు రాముని చూడాలని, పలకరించాలని ఉంది. కాని ఆ విశాలభవంతిలో ఏగదిలో రాము ఉంటాడో, ఎవర్ని అర్థించి రాముని చూడాలో అర్థం కాలేదు. కాస్సేపు అలాగే చూసి తిరుగుమొగంపట్టాడు ధర్మయ్య.

ధర్మయ్య తిరిగివచ్చిన తర్వాత ఈ విషయం శాంతమ్మతో చెప్పడం గదిలోఉన్న లక్ష్మి వింది. కాని ఆమె ఏమీ ఆందోళన పడలేదు.

శాంతమ్మ మనస్సు మాత్రం ఈ వార్త విన్న తర్వాత ఆందోళన పడింది "ఏలావుందో'' అని ధర్మయ్య నడిగింది.

ఈవేళ పనిలోకి వెళ్లకుండా ముహూర్త నిశ్చయ శుభవార్తకోసం కూర్చున్న రవి "పేపరు చూస్తూ ఆ - జమిందార్ల రోగాలు చాలా విచిత్రంగా ఉంటాయి లేమ్మా'' అన్నాడు.

"నువ్వూరుకో'' అంది శాంతమ్మ.

నాకెందుకూ అన్నభావంతో రవిచూసి, మళ్లీ వార్తా పత్రిక చదవడంలో మునిగిపోయాడు.

"ఏదో కాస్త నలతగా ఉండి ఉంటుంది. సాయంత్రం మళ్ళీ వెళతాగా'' అన్నాడు ధర్మయ్య.

గదిలో వంటరిగా కూర్చున్న లక్ష్మిదగ్గరకు శాంతమ్మ వచ్చింది.

"నువ్విలా ఉండటం మంచిదికాదమ్మా" అని లక్ష్మిని మందలించింది.

ఇదేమి టన్నట్లు లక్ష్మి ఆశ్చర్యంగా చూసింది.

"ఒకళ్లగురించి మరొకళ్లు క్షోభపడితే ఊరికేపోదు లక్ష్మీ!" అని దగ్గరగా కూర్చొని మెల్లగా "విన్నావా? రాముకి నీరసంగా ఉందట. నువ్వు సంతోషంగా ఉంటే..." అంది. లక్ష్మి అంతవరకూ ఏమీ మాట్లాడలేదు. మధ్యను శాంతమ్మకు ఈబాధ దేనికో లక్ష్మికి అంతుపట్టలేదు. లక్ష్మి తీక్షణంగా చూసి "నువ్వనేది ఏమిటత్తా" అని కాస్త విసుగ్గా అడిగింది.

శాంతమ్మ ఆస్వరం విని కాస్త జంకింది. సమాధానం మాత్రం ఏమీ యివ్వలేదు. లక్ష్మి బరువుగా నిట్టూర్చి, తడి నిండిన కళ్ళతో "నేను నాశనమైనా రాము సుఖంగా ఉండాలని భగవంతుణ్ణి ఎప్పుడూ కోరుతున్నా... ఆయనకు అపకారం కలగాలనేకోరిక నాకెప్పుడూ లేదత్తా!" అంటూ తలవంచుకొని ఉద్వేగంతో వచ్చే దుఃఖాన్ని ఆపుకొనే ప్రయత్నమంతా వేళ్ల తో మెలివేసే పమిటచెంగుమీద చూపుతూంది.

"ఛీ! ఊరికే అన్నాను" అంటూ శాంతమ్మ లక్ష్మి కళ్లనీళ్లు గోటితో మెల్లగా మీటుతూ ఊరడించింది.

యౌవనదశలో మానవుడు కల్పించుకునే ఊహాపూరిత ఆశయసౌధాలు చాలా విచిత్రంగానూ, కంటక రహితంగానూ కనిపిస్తాయి. ఆశయానికి విరుద్ధమయ్యే ఆటంకాలతో కూడిన కోణాన్నుంచి ఏనాడూ చూడ్డానికి ఉత్సహించడు. ఉత్సహించకపోయినా సూచనాప్రాయంగా కనుపించే ఆ నీడలు దేదీప్యమానంగా వెలిగే తన ఆశయ జ్యోతిముందు నిలబడలేక పారిపోతాయి.

ఎంతోకాలం కష్టపడి రేయింబవళ్లు యోచనాపూర్వక కృషితో సృష్టించిన ఆ గాలిమేడలు, ఆచరణలో కష్టసాధ్యమై అతి స్వల్పకాలంలో కావలసినవాళ్లు రేపిన గాలి దుమారంలో ఛిన్నాభిన్నమై కొట్టుకపోతుంటే; ఆ ధూళిలో ఉక్కిరిబిక్కిరైన నిర్మాత, క్షోభతోనూ వ్యధతోనూ కర్తవ్యశూన్యుడై ఖిన్నుడుగా నిలబడిపోతాడు. శారీరకంగానూ, మానసికంగానూ చాలా దెబ్బ తింటాడు. మళ్ళీ తేరుకోడానికి కొన్నిరోజులుపట్టినా మామూలుమనిషిగా మాత్రం లేవడు. ఈ కొద్దిరోజుల్లో ఎంతో వయస్సు గడచిపోయినట్లుగానూ– ఆ వయస్సు యిచ్చిన నూతనానుభవంతో ఇక ఈలాంటి గాలిమేడగాక, పునాదిబలమైన పెద్దభవంతినే ఆచరణపూర్వకంగా కట్టాలనేపట్టుదలతో నిలబడతాడు. అయితే

ఈ నూతనంగా తలపెట్టిన కృషికి లోగడ జరిగిపోయిన పనులకూ చాలా వ్యత్యాస ముంటుందనుకుంటాడు. ఇంతకూ విచిత్ర మేమంటే; ప్రేక్షకులకు ఇదికూడా మరో రంగుతో కల్పించే గాలిమేడగా గోచరించినా - ఆ అనుభవజ్ఞుడు మాత్రం ఒప్పుకోడు.

పై నుదహరించిన యథాతథ విషయమే రాము జీవితంలో జరిగింది. అయితే పగిలిన అద్దంలోకూడా ప్రతిబింబం కనిపిస్తుంది. పగలకముందు ఒక్కే ఆకారం ... ఇప్పుడు నాలుగైదుముఖాలు వికార రూపంలో కనిపించడంకూడా సహజం.

తాను అనారోగ్యంగా ఉన్నానని తెలిసిన లక్ష్మి, ఎంతమంది అటకాయించినా ఆగదనీ, తన్నొకసారి తనివి తీరాచూసి, కళ్లనీళ్లతో కాలు కదుపుతుందని ఊహించాడు. కాని ఈ విషయం ఆమెకు ఎంతకాలానికి తెలుస్తుందో అతను అంచనా వేయలేకపోయాడు.

చాలారోజులకు ఈనాడే అయిదు గంటలకు ఆహారం తీసుకొని రాము తన గదిలో కూర్చొని ఉన్నాడు. ఏదన్నా ఆలోచిద్దామన్నా - ఆలోచించ గల ఓపిక కూడా లేదన్నట్లు నిస్త్రాణగా వాలు కుర్చీలో కూర్చొని పిచ్చిగా పైన తిరిగే పంకాకేసి చూస్తున్నాడు.

ధర్మయ్యను తీసుక వచ్చిన మల్లయ్య గుమ్మం వెలుపల నుండే "బాబుగారూ" అని పిలిచాడు.

రాము తల ప్రక్కకు త్రిప్పి చూశాడు. "రండి" అని మెల్లగా క్లిష్టంగా ధర్మయ్యను ఆహ్వానించాడు.

ధర్మయ్య రాముని ఆశ్చర్యంగా చూస్తూ "ఏలా వుంది" అంటూ వచ్చి మరో కుర్చీమీద కూర్చున్నాడు.

"బాగానే వుంది" అంటూ నవ్వు వదనాన్ని ప్రక్కకు పెట్టుకున్నాడు. ధర్మయ్యలో మొదట కలిగిన ఆశ్చర్యం అతని మొగంమీద ఇంకా ముద్రపడిపోయి అలాగు నేవుంది. ఈ కొన్నిరోజుల్లో రాము గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు.

"అసలు జబ్బు ఏమిటి బాబూ!" అని ధర్మయ్య అడిగాడు. ఆ సంగతి ఎవరికి తెలుసు? డాక్టరే అంతుపట్టలేక పోయాడు. రాము సమాధానమివ్వలేదు. అతని పెదాల మీద చిన్న నవ్వు విరక్తిగా వెల్లవైంది.

"నిన్నను నాన్నగారిదగ్గరకొచ్చేవరకూ నాకీ సంగతి తెలీనే తెలీదు" అన్నాడు మళ్ళీ ధర్మయ్య. ఈమాటకు రాము ఆశ్చర్యంగా ధర్మయ్యకేసి చూశాడు. జమిందార్లయింట్లో జంతువుకి అనారోగ్యంగా ఉన్నా అరక్షణంలో ఊరంతా పాకిపోవడం సహజమని తెలుసున్న రాము వారం రోజులు మంచంమీదఉన్నా అభిమానులకు కూడా తెలీలేదనడంలో ఆశ్చర్యపడకమానలేదు. అయితే రోగం ఉనికి తెలిసిన జమిందారు ప్రమాదం లేనిదానికి ప్రచారం అనవసరమని ఊరుకొని ఉంటాడని రాముకేం తెలుసు?

"లక్ష్మికి మంచి సంబంధమే కుదిరింది"

"ఊఁ"

"నిన్నటిరోజునే ముహూర్తం కూడా నిశ్చయించాం"

"........."

"అల్లుడు స్కూల్ ఫైనల్ వరకూ చదివాడు"

ఈసారి ధర్మయ్య తీక్షణంగా రాముకేసి చూశాడు. రాము ఆ మాటలు వినడంలేదని తెలుసుకున్నాడు. ఈలాంటి పరధ్యానం రోగలక్షణమేమో అని కూడా గ్రహించాడు. ధర్మయ్య కుర్చీమీదనుంచి లేచి "వెళతా బాబూ" అన్నాడు.

ఈసారి రాము లేచిన ధర్మయ్యను చూసి "వెళ్లిరండి" అన్నాడు. ఈ నిర్లక్ష్యమైన వీడ్కోలు ధర్మయ్యకు చాలా అసహజంగా వుంది. రాము ఆకారంతోబాటు మనస్సుకూడా శుష్కించిందేమో అనుకుంటూ గుమ్మం దాటాడు ధర్మయ్య.

"మాస్టారూ?" అని మళ్ళీ రాము పిలిచాడు.

ధర్మయ్య వెనక్కి తిరిగి వచ్చాడు. ఈసారి రాము కూడా అంతగా ఓపిక లేకపోయినా కుర్చీమీదనుంచి లేచాడు. "పెళ్ళి ఎప్పుడన్నారూ?" అని అడిగాడు.

పెళ్లి ఫలానాఅప్పుడని రాము పరధ్యానంగా ఉన్నాడనే ఉద్దేశంతో ధర్మయ్య చెప్పలేదు. చెప్పిఉంటాడని రాము ఊహించాడు.

"పదిహేనురోజులుంది"

"మంచిది. పెళ్లి బాగా చేయండి" అన్నాడు. ఈ మాటలో తీరని వ్యథ ధ్వనించింది. ధర్మయ్య రాముకేసి అలాగే చూస్తున్నాడు. రాముకళ్లల్లో నీళ్లు తిరగడంకూడా ధర్మయ్య చూశాడు. రాము మళ్లీ ఈలా అన్నాడు "లక్ష్మి అదృష్టాన్ని కళ్లారా చూడగల యోగ్యతుంటే; తప్పకుండా పెళ్లికి నేనుకూడా వస్తాను" మెల్లగా కళ్లు తుడుచుకుని ధర్మయ్య అక్కడుండగానే రాము గది విడచాడు.

వచ్చినదగ్గర్నుంచి రాము ప్రవర్తనలో విశేషాన్ని ధర్మయ్య చూడగలిగాడు. కాని రోగంద్వారా కళ్లనీరు కార్చే దౌర్బల్యంకూడా రాములో కలిగిందంటే ధర్మయ్య చాలా విచారించాడు. మెల్లగా అతనుకూడా గది విడిచి వెళ్లిపోయాడు.

చాలామంది తమ పిరికితనమనే లోపాన్ని మభ్యపెట్టుకోడానికి, ఇతర్లు ఉన్నమాట చెప్పలేనివారుగా ధైర్యవిహీనులుగా చిత్రించడం పరిపాటి! ఇప్పుడు రాము దృష్టిలో లక్ష్మి చాలా నేరస్థురాలుగా నిర్ణయించబడింది. అయితే సమాజం స్త్రీలకిచ్చిన వరాల్లో సిగ్గు చాలా పెద్దవరం! ఈ వరాన్ని వరునిగురించి చర్చ వచ్చినప్పుడే రహస్యంగా గుర్తుపర్చుకోనకపోతే; సాటివాళ్లల్లో "సిగ్గుమాలినది" అనే అయాచితమైన బిరుదు పెళ్లికాని ఆడదానికి సంప్రాప్తిస్తుందని రాముకు తెలీదు.

ఇక లక్ష్మిపెళ్లి వారంరోజులే ఉంది.

ఈరోజు రవితోపాటు ధర్మయ్య జమిందారు అంద జేయబోయే ఆర్థిక సహకారం గురించి వచ్చి హాలులో కూర్చున్నాడు.

మేడపైన కాఫీ తీసుకుంటున్న జమిందారుకి ఈ కబురు అందడంతోనే ముహం చిట్లించి "ఇంకా వారంరోజులుందిగా; అప్పుడే ఏం తొందరొచ్చింది" అని మెల్లగా గొణుక్కున్నాడు.

అరగంటదాటినతర్వాత మేడదిగి వచ్చిన జమిందారుని చూసి ధర్మయ్య లేచాడు. కాని ఈ నియమానికి రవి పెద్ద విలువ యివ్వలేదు.

జమిందారు సోఫాలో కూర్చుంటూ "ఇతనెవరూ?" అని ప్రశ్నించాడు.

ధర్మయ్య కూడా కూర్చున్నాడు. "మా చెల్లెలిగా రబ్బాయి" అని అన్నాడు.

"పేరు రవికదూ?" అని మళ్లీ జమిందారు అడిగాడు.

"అవును" అని రవే సమాధాన మిచ్చాడు.

"మిషనులో మేస్త్రీగా పనిచేస్తున్నది నువ్వేనా?"

"అవును" రెండోసారికూడా అదే సమాధాన మిచ్చాడు రవి. వచ్చినపని విడచి అనవసర ప్రసంగం చేయడం రవికంతగా యిష్టంలేదు. అయితే ఉద్రేకపూరితంగా ఉన్న సత్యాన్ని వెళ్లడిచేసే, వ్యక్తులు జమిందారు దృష్టిలో నిలబడి ఉంటారనే రహస్యం రవికి గుర్తులేదు.

"సరే! మీరువచ్చినపని?"

జమిందారువేసిన ఈ ప్రశ్నకు ఆశ్చర్యపడ్డ ధర్మయ్య వెంటనే సమాధాన మివ్వలేకపోయాడు.

"లక్ష్మి పెళ్లివిషయంలో మీరు చేస్తానన్న సాయం కోసం వచ్చారు" అని ప్రక్కనున్న రవి సమాధానం చెప్పాడు.

రవిని తీసుకవచ్చేముందు ధర్మయ్య చాలా సంకోచించాడు. పిల్లిని చంకపెట్టుక వెళ్ళినట్లుగా ఉండకుండా చేయాలని భగవంతుణ్ణి కూడా ప్రార్థించాడు. అయితే రవి ఇచ్చిన ఈసమాధానానికి ధర్మయ్య రవిని పేచీకోరుగాముందు ఊహించడం మంచిది కాదేమో అనికూడా అనుకున్నాడు.

"అలాగే! అన్నమాట ప్రకారం తప్పకుండా యిస్తాను..." అంటూ రవితో చెప్పి, ధర్మయ్యకేసి దృష్టి మరల్చి "పెళ్లి యింకా ఎన్నిరోజులుంది?" అని అడిగాడు జమిందారు.

"వారంరోజులు"

"నేనివ్వవలసిన డబ్బుకి ఇప్పుడేం కంగారొచ్చింది?" ఈ మాటకు ధర్మయ్య అగమ్యంగా చూశాడు. రవికి బాధ కలిగింది. "కంగారుకదండీ! డబ్బులేనిదే ఏపనీ జరగదు... వెయ్యి రూపాయలు ఖర్చు కనిపిస్తోంది" అన్నాడు రవి.

"వెయ్యిరూపాయలు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకు వెంటనే ఎవరున్నుంచీ సమాధానం రాలేదు. జమిందారు నవ్వాడు. రవి, ధర్మయ్య ఆశ్చర్యంగా చూస్తూనే వున్నారు.

"ధర్మయ్యగారూ! లక్ష్మిపట్ల లక్ష్యం లేకపోతే; లక్ష్యంగా డబ్బుకూడా మన దగ్గర ఉండదు. పేదవాళ్ళు ఎక్కువమంది కావడం ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టక పోవడం వల్లనే అనే సంగతి అనుభవమున్న మీరుకూడా గుర్తించకపోవడం నాకు చాలా ఆశ్చర్యంగానే వుంది... మాలాంటివాళ్ళే ఈ పెళ్ళివిషయాల్లో ఎంతో క్లుప్తంగా ఖర్చుపెట్టడానికి చూస్తారు ... ఒక్క ఆడపిల్ల పెళ్ళికి ఒక్క వెయ్యిరూపాయలు" జమిందారు అర చేతులు నలుపుకుంటూ మళ్ళీ నవ్వి పెదవి ఒక్కసారి విరచాడు.

ఈ మాటల సందర్భమూ, ఈ అభినయ విశేషమూ రవికి చాలా ఖేదభావాన్ని కలిగించాయి. "ఈ రోజుల్లో వెయ్యి రూపాయలంటే; చాలా తక్కువనుకుంటాను" అన్నాడు మెల్లగా రవి.

"ఏమిటి?" అని తలెత్తి ఎర్రగా చూశాడు జమిందారు.

ఇది కలహం గాకుండా ఉండగలందులకు ధర్మయ బిక్కుబిక్కుమంటూ, యిష్టదేవుణ్ని మనస్సులో ప్రార్థిస్తున్నాడు.

"జమిందార్ల పెళ్ళిళ్ళు నేను చూడకపోయినా, చెప్పుకోవడం విన్నాను. ఈ వెయ్యిరూపాయలూ గాలికి ఎగిరిపోయే సెంట్లకుకూడా సరిపోవనే సంగతి మీకు కూడా తెలుసు" అన్నాడు. ఈ మాటకు జమిందారు కోపం చూప లేదు. జమిందార్ల గొప్పతనాన్ని వెళ్ళడిచేసే ఆ వాక్యం ద్వారా ఒక సంతోషాన్నికూడా పొందగలిగాడు. అందుకే మళ్ళీ ఒక్కసారి నవ్వి "ఊc తరువాత" అని రవిని హెచ్చరించాడు.

ధర్మయ్య ఒకసారి ఆందోళన రహితంగా నిట్టూర్చాడు.

"మీారన్నట్లుగా ఆడపిల్లకు ఏదోవిధంగా పెళ్ళి చేయాలంటే; ఒకోసారి డబ్బుకూడా అక్కర్లేదు."

"ఏమిటదీ?" జమిందారు సంశయంగా అడిగాడు.

"ముసలివాళ్ళకూ, అంగవిహీనులకూ, అందమైన ఆడపిల్లను అర్పిస్తే; వాళ్లే డబ్బు సాయం చేయొచ్చు. కాని మేష్టారు అమ్మాయికి అనుకూలదాంపత్యం కావాలని చూశారు. అందుకే వెయ్యిరూపాయలు చాలా తక్కువే అంటున్నాను."

"అబ్బా! చాలా తెలివైనవాడవే!" అనే భావం వెల్లడయ్యేటట్లుగా తల క్రిందకువంచి కోరగా రవికేసి చూశాడు జమిందారు. "కట్నం ఎంత?" అని అడిగాడు.

ఈసారి ధర్మయ్య సమాధాన మిచ్చాడు "మంగళ సూత్రధారణ సమయంలో అయిదువందలు లాంఛనంగా యివ్వాలని చెప్పారు"

"దాని పేరు?" జమిందారు అడిగాడు.

"ఎక్కువ కట్నాలు తీసుకోకూడదని ప్రభుత్వం శాసనం పెట్టింది కదండీ! నల్లబజారుకి మారుపేరు ధర ఎక్కువని కదూ? ఇదీ అంతే!" అని రవి నిర్లక్ష్యంగా - తేలికగా సమాధాన మిచ్చాడు.

"సరే! సంతోషించా" అంటూ కుర్చీమీదనుంచి లేచాడు. రవి సులభంగా అన్నమాట జమిందారు కింత ఆగ్రహం కలిగిస్తుందని రవి అనుకోలేదు. కాని ధర్మయ్యకు మాత్రం ఆ మాట ఉపయోగించడంలో చాలా కంగారే పుట్టింది. జమిందారు కేవలం భూములమీదనే ఆధారపడ లేదనీ, రహస్యంగా ఒకటి రెండు పెద్ద వర్తకాలు చేస్తున్నట్లుగా ధర్మయ్యకు తెలుసు.

"నే నెంత సహాయం చేస్తానని మీ రనుకున్నారు?" ధర్మయ్యను చూస్తూ తీవ్రంగా అడిగాడు.

ధర్మయ్య లేచి నిలబడ్డాడు. రవి అలాగే కూర్చొని "అంటాను" అని సమాధాన మిచ్చాడు.

"వట్టిది. నేను యింత యిస్తానని మీతో ఏమీ అంకె చెప్పలేదు. అంకె చెప్పలేదని అబద్ధం ఆడ్డంకూడా నా ఉద్దేశం కాదు. ఒక వంద రూపాయలకు మించి నేను సాయం చేయలేను...ఉండండి" అంటూ జమిందారు తొందరగా పైకి వెళ్ళిపోయాడు.

ధర్మయ్య కళ్ళల్లో నీళ్ళు తిరగడం ప్రక్కనున్న రవి గమనించాడు. కుర్చీమీదనుంచి లేచాడు.

"మాష్టారూ" అని ఆతురతగా ప్రశ్నించాడు.

"నాయందు దయయుంచి నువ్వు మాట్లాడకు బాబూ!" ఈ మాట గద్గదికంగానూ; ఉద్రేకపూరితంగానూ ధ్వనించింది. రవి నిర్విణ్ణుడై పోయాడు.

"మాట్లాడక కూర్చుంటావా? కూర్చో! లేదా యింటికి వెళ్ళిపో!" అని కూడా ధర్మయ్య అన్నాడు.

రవి మాట్లాడకుండా నిలబడిపోయాడు. జమీందారు చేతిలో వందరూపాయలనోటుతో మెట్లు దిగడం ధర్మయ్య చూసుకొని కళ్ళు తుడుచుకొన్నాడు.

"తీసుకోండి" వచ్చిన జమీందారు ధర్మయ్యకు యివ్వబోయాడు. ధర్మయ్య మనస్సు వ్యధాపూరితమైంది. లక్ష్మికి జరగబోయే పెళ్ళి గుర్తుకువచ్చింది. జమీందారుతో ధర్మమీమాంసతో విరోధపడ్డం ఎంత అపాయకరమో ఆ స్వల్ప కాలంలోనే తెలుసుకున్నాడు.

"తమ దగ్గరే ఉంచండి"

"ఏం?"

"ఒక్క విషయం తమరు ఆలోచించాలి... నా అనే వాళ్లు ఈ గ్రామంలో మీరుతప్ప నాకు అన్యులెవరూ లేరని తెలుసు... తమ ప్రోత్సాహంతోనే ఈ పెళ్ళికి ప్రయత్నించాననే సంగతికూడా మీకు తెలుసు..."

"మీ అమ్మాయికి పెళ్ళిచేయడం నాకు ఉపకారంగా భావిస్తున్నారా?"

దీనిలో ఎంత సత్యముందో ధర్మయ్యకు ఏం తెలుసు? కాని ఆ మాటకు కూడా ధర్మయ్య బాధపడలేదు. మెల్లగా ఈలా అన్నాడు "ఎంతమాట ... కాని ఈ స్వల్పకాలంలో ఎవర్ని అర్థిస్తే ఫలితముంటుందో చెప్పండి! చేతిలో ఒక కానీకూడా లేదు ... మీ మీదనే ఆశ పెట్టుకొని..."

"బావుంది... నేనన్నమాటకు నాకు వెయ్యి రూపాయలు జరిమానా వేస్తున్నారన్నమాట"

"మీ రాలా అంటే"

"ఏలా అనాలి? మీకు వెయ్యిరూపాయలిస్తే; నాకు తిరిగి వచ్చేదారి?"

ఈ మాటకు ధర్మయ్య యిప్పుడే ఆలోచించాడు. జమిందారు ఎందుకు డబ్బు యివ్వడం గురించి వెనుకాడుతున్నాడో తెలుసుకున్నాడు. "నా యిల్లు తనఖా పెడతాను" అని బాధగా అన్నాడు.

"ఆ యింటిమీద అయిదువందల కంటే ఎక్కువ యివ్వలేను."

రవి కోరగా కోపంగా జమిందారుకేసి చూస్తున్నాడు.

"మీ కిష్టమేనా?"

ధర్మయ్య ఏమీ సమాధానమివ్వలేదు. తల మాత్రం పంకించి ఊరుకున్నాడు.

జమిందారు గుమాస్తాను పిలచి, విషయాన్ని చెప్పి, తెచ్చిన వందరూపాయలూ ధర్మయ్యకు యివ్వబోయాడు.

"తనఖా వ్రాసుకున్న తర్వాత మొత్తం యిద్దురుగాని" అన్నాడు ధర్మయ్య.

"ఇది ఉచితంగా ఇద్దామనుకుంటున్నాను"

అసలే మండిపోతున్న రవికి ఈమాట మరీ కష్టంగా తోచింది.

"ఆ వంద ఏ పూ రి కొం ప మీ ద న్నా తనఖాకి యివ్వండి"

"వయస్సుకుమించి మాట్లాడుతున్నావ్ ర వీ!" కోపంగా అన్న జమిందారుమాటకు రవి ఏదో సమాధానం యివ్వబోతుంటే; ధర్మయ్య రవిని చూస్తూ "రవీ! నువ్విక్కడనించి వెళ్ళిపోవడం చాలామంచిది" అని బిగ్గరగా అన్నాడు.

"ఔను. నేనూ అదే అనుకుంటున్నాను" అని చెప్పి రవి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

జమిందారు వందరూపాయలనోటు తీసుకొని, మేడపైకి వెళ్ళిపోయాడు.

ధర్మయ్య కాస్సేపు నిలబడి గుమస్తా గదిలోకి వెళ్ళడానికి రెండడుగులు వేసే సరికి, రాము తన గదిలోనుంచి బైటకు రావడం చూశాడు. రాము తిన్నగా ధ ర్మ య్య దగ్గరకు వచ్చాడు.

"ఆ అయిదువందలూ నే నిస్తాను. మీరు నిశ్చింతగా లక్ష్మి పెళ్ళి చేయండి" అని మెల్లగా తన గదిలోకి వెళ్లిపోయాడు.

అప్పట్లో ధర్మయ్య స్థితి ఆ మొగం ప్రత్యక్షంగా చూసినవాళ్ళకుగాని అర్థంకాదు. ఆనందబాష్పాలు కండువాతో తుడుచుకుంటూ, సంతోషంగా నిట్టూర్చి, రామును మనస్సులో దీర్ఘాయుష్మంతుడవు కమ్మని దీవించి గుమస్తా గదిలోకి వెళ్ళాడు.

# 23

ఈ వారంరోజులూ జమిందారు తనఖామీద యిచ్చిన అయిదువందల రూపాయలతో వివాహకార్యక్రమాలు శాంతమ్మ సలహాలతో సక్రమంగానే జరిపించగలిగాడు ధర్మయ్య.

పెళ్లి యీరోజు రాత్రికే; ఎరుగున్నవాళ్ళకు భోజన ఏర్పాట్లుకూడా చేశాడు. రెండువందల విస్తళ్లు సంతుష్టిగా లేచాయి. ధర్మయ్య అంటే ధర్మమూర్తిగా భావించే పాటక జనం కూడా లక్ష్మిపెళ్ళికి పప్పు అన్నం తినడానికి ఆనందంగా వచ్చారు. వాళ్ళకుకూడా ఉన్నదాంట్లో ఏ లోటు జరగనివ్వ

లేదు ధర్మయ్యా. ధర్మయ్య యిల్లు పెళ్ళిశోభతో కళకళ్ళాడు తూంది. వచ్చే జనం పోయేజనం తెరిపేలేదు. శాంతమ్మకు ఈ వారంరోజులనుంచీ ఎక్కడా తీరిక అనేది లేనేలేదు. ఉదయంనించి రవి ఎక్కిన సైకిలు దిగనేలేదు. తల్లికోర్కెతో రాముని ఆహ్వానించడానికి, రవికి యిష్టం లేకపోయినా, రెండుసార్లు జమిందారు యింటికి వెళ్ళాడు. ఉదయం వెళ్లి నప్పుడు రాము లేవలేదని తెలిసింది. రెండోసారి వెళ్ళినప్పుడు రాము కనిపించాడు.

"అమ్మ భోజనానికి రమ్మనమని చెప్పమంది" అని రవి చెప్పాడు. ఆలా చెప్పమనే శాంతమ్మ చెప్పింది.

"ఇప్పుడు రాలేను. రాత్రి పెళ్ళికి వస్తాను" అని రాము సమాధానం చెప్పాడు.

"సరే" రవి తిరిగి వెళ్లిపోయాడు. ఇప్పుడు రాలేని వాడు రాత్రి పెళ్ళికి రావడం ఎంత నిజమో; రవి ముందే అంచనా వేసుకున్నాడు.

రవి రావడం చూసిన శాంతమ్మ "రాము వస్తున్నాడా?" అని ఆతురతగా అడిగింది. పెళ్ళికూతురు దుస్తుల్లో ఉన్న లక్ష్మికూడా గుమ్మం ప్రక్కనుండి రవి సమాధానం కోసం చూస్తోంది.

"నీకు పిచ్చిగాని ఎందుకొస్తాడమ్మా", అని సమాధాన మిచ్చాడు రవి.

"మరొక్కసారి వెళితే" ఆశగా చూస్తూ అడిగింది.

"అవసరముంటే నువ్వెళ్లు" అని కోపంగా గుమ్మందిగి, ఇతరవాళ్ళను పిలవడానికి సైకిలెక్కి వెళ్ళిపోయాడు రవి.

రవి వెళ్ళినతర్వాత శాంతమ్మ గుమ్మంలో నిలబడ్డ లక్ష్మికేసి చూసింది. లక్ష్మి తలవంచుకొని ఏదో ఆలోచిస్తూ గదిలోకి వెళ్లిపోయింది.

రాము ఉదయంనించీ కార్యసాఫల్య విధానంకోసం చాలా ఆందోళనగా పరిపరి విధాల ఆలోచిస్తూ, హాలులోకి రావడం గదిలోకి వెళ్లి కూర్చోడం చేస్తున్నాడు. కాని విధానం మటుకు ఏమీ స్ఫురించలేదు. ప్రతినెలా పదైరూపాయలు జేబు డబ్బులుగా తండ్రినించి తీసుకుంటున్న రాముకు అయిదు వందల రూపాయలు ఒకేసారి సంపాదించడం చాలా కష్టంగానే కనిపించింది. పెట్టి తిరగవేస్తే పాతిక రూపాయలు కనిపించాయి.

ధర్మయ్య బాధలో, జమిందారు మాటల చాటునించి విన్న రాము, వచ్చే విధానం గురించి ఆలోచించకుండా ఆయన దుస్థితికి వగసి, అయిదువందలు యిస్తానని వాగ్దానం చేశాడు.

సులభంగా యిచ్చిన వాగ్దానం ఆచరణలోకి వచ్చేటప్పటికి ఎంత కష్టసాధ్యమో ఊహించాడు. అప్పుడే కన చీకటి పడుతోంది.

ఒకటి మూడు గంటల్లో లక్ష్మి మరొకళ్ల సొత్తు అయి కూర్చుంటుంది. రెండోది ఇష్టంలేని బాధాకరమైన ఈ పెళ్లికి తనే అయిదువందల రూపాయలు సంపాదించి తీసుకవెళ్లాలి.

తీసుకవెళ్ళకుండా ఉంటే పెళ్ళి ఆగిపోతుంది. ఆగిపోవడమే మంచిదేమో; స్వార్థపూరితమైన రాము మనస్సు ఈలాంటి దుష్టయోచనకూడా చేయకుండా ఉండలేక పోయింది. తన మనస్సు తలపెట్టిన ద్రోహానికి రాము చకితుడై పోయాడు. "ఎంత ద్రోహం" అని మెల్లగా గొణుక్కున్నాడు. ఏదో ఆలోచన కలిగింది. తిన్నగా మేడమెట్లు ఎక్కి తల్లి గదిలోకి వెళ్ళాడు రాము.

వక్కా ఆకు వేసుకుంటున్న పార్వతమ్మకు ఆ సమయంలో రాము రాక ఆశ్చర్యం కలిగించింది. "ఏం బాబూ" అని అడిగింది.

"అయిదువందలు కావాలి" అలా నిలబడే ఆత్రంగా అడిగాడు. ఈ మాటకు ఆకు వేసుకుంటూ ఆవలించిన నోటిని ఆలాగే వుంచి మెల్లగా లేచి "ఏమి టంటున్నావ్" అని అడిగింది.

"అయిదువందలు కావాలి; చాలా అవసరం" మళ్ళీ ఆలాగే నిలబడి అడిగాడు.

"ఎందుకూ?"

రాము ఏమీ సమాధానం చెప్పలేదు. తీవ్రమైన పట్టుదలతో సాధింపుకోసం ఆలాగే చూస్తున్నాడు. రాము

వైఖరి చూసి మొదట్లో ఆశ్చర్యపడిందల్లా, తరువాత భయపడింది. "నాన్నగార్ని పిలుస్తా" అంటూ పార్వతమ్మ వెలుపలకు వెళ్ళబోయింది.

తల్లి చేయిపట్టుకొని ఆపుచేశాడు. "ఈ సంగతి నాన్నగార్కి తెలీకూడదమ్మా! నువ్వే యివ్వాలి" అని ప్రాధేయతగా చూస్తూ అడిగాడు.

పార్వతమ్మకు రాము పరిస్థితి ఏమీ అర్థం కాలేదు. "అవసర మేమిటో చెప్పకూడదా?"

"లక్ష్మి పెళ్ళికి సాయంచేస్తానని మాట యిచ్చాను."

ఈమాట పార్వతమ్మకు కొంత అర్థమైంది. అయితే భర్తద్వారా ఒకసారి "రాము పాడవడానికి లక్ష్మి కారణం కావచ్చు" అని విన్నమాట కూడా జ్ఞాపకానికి వచ్చింది.

"నాదగ్గ రెక్కడుంది" అని సమాధానం చెప్పింది.

"వీల్లేదమ్మా" ఉద్వేగంతో తల్లి కాళ్ల దగ్గర చతికిల పడ్డాడు. "ఎలాగైనా చూడాలి. ఆ డబ్బు యివ్వకపోతే లక్ష్మి పెళ్లి ఆగిపోతుంది. లక్ష్మి పెళ్లి ఆగిపోతే ఆమె జీవితం నాశనమౌతుంది. ఆమె నాశనమైతే నేను బ్రతికుండి కూడా ఫలితంలేదు అమ్మా!" కళ్ళనీళ్ళతో తల్లి మొగం చూశాడు.

పార్వతమ్మ రాము అన్న ఆఖరిమాటకు విస్తుపోయింది. మెల్లగా రాముని లేవదీసింది. తలవెంట్రుకలు

సర్దుతూ "ఏమిటి ఇంత పిచ్చివాడవయ్యావు... సరే! నువ్వు నా గదిలోకివెళ్లు. నాన్నగారితో మాట్లాడి నేను పట్టు కొస్తాను" అంది.

"నాన్నగారితో చెబితే యిస్తారా?"

"నేను ప్రయత్నిస్తాగా" అని కాస్త ధైర్యం చెప్పింది.

భర్త ఆజ్ఞలు లేనిదే ఏపనీ చేయడానికి యిష్ట పడని పార్వతమ్మ మాట విని, రాము మేడదిగి తండ్రిద్వారా వచ్చే డబ్బు కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

పచ్చని పందిట్లో బంధుసమూహంలో, మంగళ వాయిద్యాల మధ్య లక్ష్మికి ప్రధానం జరిగింది. అల్లుడి కాళ్లు కడుగుతూన్న ధర్మయ్య దృష్టి అంతా రాముమీదనే ఉంది. ఒక గంటకల్లా అయిదువందల రూపాయలు మగపెళ్ళివారికి అందజేయాలి.

స్తంభం ప్రక్కగా కూర్చొని, ఈ ఆడంబరాలకు విరక్తిగా చూస్తూన్న రవి దగ్గరకు ధర్మయ్యవచ్చి మెల్లగా "ఇలారా" అని పిలచాడు.

రవి పందిరిదాటి ధర్మయ్య వెనకనే కాస్తదూరం. వెళ్ళాడు. "రాము వచ్చాడా?" మెల్లగా రహస్యంగా అడిగాడు.

"లేదే!" అటు యిటూ చూస్తూ రవి సమాధానం చెప్పాడు.

"ఏలాగ" అయోమయంగా చూస్తూ ఆత్రంగా అన్నాడు ధర్మయ్య. రవికి ఇదేమీ అర్థం కాలేదు. "ఏమిటి?" అని అడిగాడు.

"అయిదు వందలు."

"ఎవరు యిస్తారని చెప్పారు."

రవి వేసిన ఈ ప్రశ్నతో ధర్మయ్య తెల్లబోయాడు. ఈ రహస్యాన్ని రవికి చెబితే; కార్యం సానుకూలపడ్డం కష్టమనే భావంతో రవికి చెప్పలేదు. ఆందోళనతో కాస్సేపు రాము వస్తున్నాడేమోనని ఆశగా చూసి, గుమ్మంలోనించి చూస్తున్న శాంతమ్మవైపు గబగబా వెళ్ళాడు.

"ఇంకా రాలేదూ?" శాంతమ్మకూడా కంగారుగానే అడిగింది.

"లేదు."

"ఏం చేయడం?"

ధర్మయ్య మాట్లాడలేదు. మళ్ళీ శాంతమ్మ "రవిని పంపిద్దామా?" అని అడిగింది.

ధర్మయ్యకు యిష్టంలేదు. కాని తాను వెళ్ళడానికి వీల్లేదు. ఇంతలో ఎవరో "ధర్మయ్యగారూ!" అని పందిట్లో నించి పిలవడంవల్ల "సరే! తొందరగా పంపించు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అరుగు ప్రక్కగా నిలబడ్డ రవిని శాంతమ్మ పిలిచింది. "నువ్వేం కంగారుపడకుండా మెల్లగా అడుగు. రాము రాక పోయినా ఫరవాలేదు. డబ్బు తీసుకరా" అని చెప్పింది.

రవి ఏమీ మాట్లాడలేదు. కష్టంగా తల ఒకసారి పంకించి మెట్లు దిగాడు.

"ఇక ఎంతో వేళలేదు. తొందరగా రావాలి" అని మళ్ళీ హెచ్చరించింది.

లైటులేదని శంకించకుండా, అరుగు ప్రక్కన జేర వేసిన సైకిలు ఆ జనంలోనుంచే కోపంగా ఎక్కి వెళుతున్న రవిని చూసి శాంతమ్మకు ఎందుకో భయంకలిగింది.

రాము అరగంటవరకూ తన గదిలోఉండి తల్లి రాక కోసం ఎదురుచూశాడు. కాలుకాలిన పిల్లిలాగ ఆందోళనగా గదంతా కలయతిరుగుతున్నాడు.

"రామూ" జమిందారు పిలుపువిని రాము వెనక్కి తిరిగి చూశాడు.

"అయిదు వందలూ ఎందుకూ ?"

"అమ్మ చెప్పలేదూ ?"

"చెప్పినా ధర్మయ్యకు నేను ముందే యిచ్చానుగా."

"నేను మిగతా అయిదువందలూ యిస్తానని మాట ఇచ్చాను."

జమిందారు నవ్వాడు. ఈ సమయంలో రాము మనస్సు చురుగ్గా పనిచేస్తోంది. తండ్రిపట్ల ఉండే గౌరవంకూడా కొద్దిగా సడల నారంభించింది.

"ఇది నవ్వుకు వేళ కాదు. నా గౌరవాన్ని కాపాడా లంటే యివ్వండి."

"నాకు అగౌరవం కల్పించడానికి నువ్వు యిస్తు న్నావ్?"

"అదేమిటి?"

"నేను కాదన్నది నువ్వు యివ్వడంలో ఉద్దేశం?" దగ్గరగా వెళ్లాడు "రామూ!" తీవ్రంగా మొగంలోకి చూశాడు. "కష్టించి సంపాదించేవాడికి రూపాయి యొక్క విలువ తెలుస్తుంది ... అనుభవం లేనివాడివి హామీ యివ్వ డానికి నీకు అధికారం ఎవరిచ్చారు?" కాస్సేపు కోపంగా చూసి "అయిదువందలు కాదుకదా! అయిదు కానులు కూడా ఈలాంటి అనధికార హామీలు యిచ్చి 'నానుండి పొందలేవ్...'" అంటూ గుమ్మం దగ్గిరకు వెళ్లి తిరిగిచూసి "నీలాంటివాళ్ల చేతిలో నా ఆస్తిపాస్తులుంటే; ఎంతకాలం శాశ్వతంగా నిలవగలవో ఈ నీ హామీనిబట్టి అంచనా వేయవచ్చు" అంటూ గుమ్మందాటాడు.

"నాన్నగారూ" వెర్రెత్తినట్లు బిగ్గరగా రాము పిలచాడు. ఈ పిలుపు విని మరీ కోపంగా జమిందారు వెనక్కి తిరిగాడు.

"అయిదు వందలూ యివ్వాలి" అనే ధ్వనిలో అరచాడు.

"యివ్వను" బిగ్గరగా నిక్కచ్చిగా చెప్పాడు.

"నేను తీసుకుంటాను." ఒక తెగింపునకు వచ్చిన రాము గది గుమ్మం దాటబోయేడు. బలమైన జమిందారు రాము చేయిపట్టుకొని, గదిలోకి విసిరాడు. రాము గదిలోకి వెళ్లి కుర్చీతగిలి కింద పడిపోయాడు. జమిందారు బడాలున తలుపు వేశాడు.

సైకిలుమీద చమట్లు క్రక్కుకుంటూ వచ్చిన రవి గేటుదగ్గర కాపలాదారు ఆపుచేస్తున్నా వినక, కాంపౌండు లోకి వచ్చి సైకిలు క్రిందపడవేసి హాలులోకి వచ్చాడు.

జమిందారు అప్పుడే మేడమెట్లు ఎక్కుతున్నాడు.

"రామూ" అని రవి బిగ్గరగా పిలచాడు.

ఆ పిలుపువిన్న జమిందారు వెనక్కి తిరిగి చూశాడు.

రాము తన గదిలోనుంచి తలుపు తట్టుతూ "రవీ" అని సమాధానమిచ్చాడు.

జమిందార్ని గమనించకుండా రవి వచ్చి తలుపు తీశాడు. గదిలోకి వెళ్ళాడు.

రవిని చూసి రాము స్తంభించిపోయాడు. రవి ఆయాసంగా వగురుస్తున్నాడు. చమట్లు గ్రక్కుతున్నాడు.

"అయిదువందలు ఏవి?" చేయి ఎదుటకు చాపి అడిగాడు.

రాము తలవంచాడు.

"అక్కడ పెళ్లి ఆగిపోతుంది" బిగ్గరగా అరిచాడు.

"నాన్నగారు యివ్వలేదు" క్లుప్తంగా సమాధానం చెప్పాడు.

"తీసుకోవడం చేతగాకపోతే యిస్తానని మాట ఎందుకిచ్చావ్?"

"ఇద్దామనుకున్నాను."

"ఏదీ?"

"లేదు."

ఈ సమాధానానికి రవికి శరీరాన్ని మరిచేంత కోపం ముంచుకవచ్చింది. చాచి రాము దవడపై కొట్టాడు. అసలే బలహీనంగా ఉన్న రాము, దెబ్బకు తట్టుకోలేక, తూలి వాలి కుర్చీలో కూలబడిపోయాడు.

ఇక ధర్మయ్యగారి యింటిముందు పెళ్లి పందిట్లో సూత్రధారణచేసే ముందు తండ్రి ఆజ్ఞప్రకారం పెళ్ళికొడుకు లేచి నిలబడ్డాడు. చేతిలోఉన్న మంగళసూత్రాన్ని ఎదురుగా అవమానభారంతో నిలబడ్డ ధర్మయ్యపై విసరికొట్టాడు. పెళ్ళిపీటలమీాదనుంచి లేచి పెళ్ళికొడుకూ, వారి పరివారం అంతా వెళ్ళిపోయారు.

లక్ష్మిని పేరంటాండ్రు తిరిగి యింట్లోకి తీసుక వెళ్ళిపోయారు. వంచినతల ఎత్తకుండా ధర్మయ్యవచ్చి గదిలో

మంచంమీద కూర్చొని అరచేతిలో తలపెట్టుకొని కళ్ళనీళ్లు కారుస్తున్నాడు.

శాంతమ్మ ధర్మయ్య దగ్గరగా వచ్చి నిలబడింది. ఓదార్చగలశక్తి ఆమెలోకూడా లేదు. జరిగినదంతా ఒక పీడకలలాగ ఆమె భ్రమిస్తోంది.

"లక్ష్మి ఏం చేస్తోంది?" కారుతున్న కళ్లనీళ్ళతో తల పైకెత్తి శాంతమ్మకేసి చూస్తూ పలకరించాడు ధర్మయ్య.

శాంతమ్మ సమాధానం యివ్వకుండానే చూస్తోంది.

"అమ్మాయి గొంతుక కోశాను" అంటూ ఈసారి బిగ్గరగా వాపోయాడు.

శాంతమ్మ ధర్మయ్య దగ్గరగా కూర్చుంది. "అన్నయ్యా! ఇక జరిగినదానికేం చేస్తాం!" అంది. కాని ఊరుకో అని ఊరడించలేకపోయింది.

"ఏం చేస్తాను. ఏం చేయలేను...ఈ అవమానంతో బ్రతికేదానికన్నా-పిల్లా నేనూ ఏదన్నా విషం తిని చచ్చి పోతాం."

శాంతమ్మ భయపడింది. ఈలాంటి అపాయంలో ఏదన్నా ఉపాయంకోసం ఆమె ఆలోచిస్తోంది.

"శాంతమ్మా! ఎంతపని జరిగిందమ్మా! ఏం చేయను?" ధర్మయ్య దుఃఖపూరితంగా మళ్ళీ శాంతమ్మకేసి చూసి పలకరించాడు.

"ఒకపనిచేస్తే" శాంతమ్మ మెల్లగా అంది.

"ఏమిటది ?"

"ఈ శుభముహూర్తం దాటకుండా రవికిచ్చి పెళ్ళి చేస్తే"

"శాంతమ్మా" ఆ దుఃఖావేశంలో హఠాత్తుగా కలిగిన ఆనందంతో శాంతమ్మచేతులు పట్టుకొని "నా లక్ష్మి ప్రాణాన్ని దక్కించి నన్ను అవమానంనుండి కాపాడు తల్లీ" అని ప్రాధేయపడ్డాడు.

శాంతమ్మ లక్ష్మి దగ్గరకు వెళ్ళింది. ఆమె స్పృహ తప్పి మంచంమీద పడిఉంది. శాంతమ్మ నీళ్ళు మొహంపై జల్లింది. కాస్సేపటికి లక్ష్మి కళ్ళు తెరచింది.

"లక్ష్మి...నువ్వు నాన్న కోసమైనా యిష్టపడాలి" అంది శాంతమ్మ ఆత్రంగా.

"ఏమిటి ?" లక్ష్మి హీనంగా అడిగింది.

"రవిని పెళ్లి చేసుకోవాలి"

"మీ యిష్టం" అంటూ లక్ష్మి మళ్ళీ కళ్ళుమూసింది. శాంతమ్మ ధర్మయ్యదగ్గరకు వచ్చి, లక్ష్మి ఆమోదించినట్లుగా చెప్పింది. ధర్మయ్యకూడా పెద్ద అపాయాన్నుండి తట్టుకున్న వాడిలా పందిట్లోకి వచ్చాడు. చాలామంది వెళ్లిపోయినా భాజావాళ్లు, మరికొంత పాటక జనం ఉన్నారు. "మీరు ఎవ్వరూ ఎక్కడికీ వెళ్లొద్దు. నా లక్ష్మికి పెళ్ళిజరుగుతుంది" అని చెప్పాడు. అంతా ఆశ్చర్యంగా ధర్మయ్యకేసి చూశారు.

మల్లయ్య సైకిలు నడిపించుకొంటూ వచ్చాడు. ధర్మయ్య మల్లయ్య దగ్గరగా వచ్చి "రవి ఏడీ?" అని అడిగాడు.

"అయ్యగారు యీ సైకిలు మీ కిమ్మన్నారు..."

"రవి ఏడీ?" మళ్ళీ ధర్మయ్య ఒగ్గరగా అడిగాడు.

"పోలీసోరు జైలుకు తీసుకపోయారు" అని చెప్పాడు.

ధర్మయ్య స్పృహతప్పి అడుగు ప్రక్కగా పడి పోయాడు. శాంతమ్మ ఆత్రంగా వచ్చి "అన్నయ్యా" అని అరచింది.

ప్రక్కనున్నవాళ్ల సహాయంతో చేతులమీద ధర్మయ్యను తీసుకొని యింట్లోకి చేర్చింది.

# 24

రవి అరెస్టు చాలా ఆశ్చర్యంగా జరిగింది. రవి ఉద్రిక్తంగా రావడం చూసిన జమీందారు గది యివతల నుండి వాళ్ళ సంభాషణలు కొంతవరకూ విన్నాడు. వారిరువుర మధ్యకూ వెళితే; విషయం ఏ విధంగా అడ్డంగా తిరుగుతుంతో ఊహించాడు. పైగా వాళ్ళ ఉభయులు ఏమాతారో తెలుసుకున్న జమీందారు తిన్నగా ఫోనుదగ్గరకు వెళ్ళి, అపాయపరిస్థితి అనీ, ద్రోహులు దౌర్జన్యంగా యింట్లో ప్రవేశించారనీ, ఆందోళనకరంగా పోలీసు స్టేషనుకు ఫోను చేశాడు.

రాము కుర్చీలోపడిన చాలా సేపటివరకూ స్పృహ లోకి రాలేకపోయాడు. రవి కాస్సేపు నిశ్శబ్దంగా చూశాడు. రాము మళ్ళీ కదలలేదు. రవిలో కక్ష తిరుగుమొగం పట్ట లేదు. తిరిగి హాలులోకి వచ్చాడు. హాల్లో ఎవరూ లేరు. అటు యిటూ కాస్సేపు కర్తవ్యం గురించి ఆలోచిస్తూ పచారు చేశాడు. గడియారం గంటలు కొట్టడం ప్రారంభించింది. సరిగ్గా తొమ్మిదయింది. రవికి పెళ్ళి గుర్తుకు వచ్చింది. తిన్నగా కాంపౌండులోకి వచ్చి, క్రింద పడిన సైకిల్ తీశాడు. గేటు ముందు పోలీసులారీ వచ్చి ఆగింది.

కారు ధ్వని విన్న జమిందారు మిద్దె దిగి క్రిందకు వచ్చి, నేరస్తుడుగా రవిని చూపించాడు. దానికి సాక్ష్యంగా నిస్సత్తువగా కుర్చీలో పడిఉన్న రామును చూపించి అరెస్టు చేయించాడు.

పలుకుబడిలో ఉన్న గంగాధరం పలుకు, ప్రత్యక్ష సాక్ష్యంతో సహా పోలీసువారి దృష్టిలో విలువ పొందింది. రవిని సంకెళ్లు వేసి లారీ ఎక్కించిన తర్వాత ఉన్నతోద్యోగి జమిందారుకు వందనం అర్పించి లారీని నడిపించాడు.

జమిందారు సంతుష్టిగా నవ్వి మల్లయ్యను పిలచి, సైకిలుతోబాటు ఈ శుభవార్తను ధర్మయ్యకు అందజేయ మన్నట్లుగా చెప్పి రాము గదిలోకి వెళ్ళాడు.

అప్పుడే పార్వతమ్మ తీసుకవచ్చిన మంచినీళ్ళు తాగి రాము మామూలుగా కూర్చొనిఉన్నాడు.

"దెబ్బ తగిలిందా?" వచ్చిన జమిందారు సరళంగా ప్రశ్నించాడు.

రాము కుర్చీమీదనుంచి లేచి "లేదు" అంటూ వెళ్ళి మంచంమీద పడుకోబోతూ, మళ్ళీ ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా కూర్చొని "రవి ఏడి?" అని అడిగాడు.

"ఎందుకూ?" జమిందారు తిరిగి ప్రశ్నించాడు.

"అబ్బే!" అంటూ మంచంమీద పడుకొని, "క్షమాపణ కోరుకుందామని" అంటూ అటు తిరిగి పడుకున్నాడు.

ఈ వార్త విన్న వెంటనే క్రుంగిపోయి మంచం పట్టిన ధర్మయ్య మళ్ళీ లేవలేదు. ధర్మయ్యకు జ్వరతీవ్రతవల్ల మనస్సు స్థిమితంగా లేక, పెళ్ళిలో జరిగిన సంగతులు గురించే సర్వదా గొణుక్కుంటున్నాడు.

మూడవరోజున శాంతమ్మ కబురు విని వచ్చిన వైద్యుడు ధర్మయ్యను పరీక్ష చేసినమీదట, శాంతమ్మను ఆశ్చర్యంగా చూస్తూ "ఇంత ముంచుకు వచ్చేవరకూ ఏం చేశారు?" అని ప్రశ్నించాడు.

శాంతమ్మ ఏమి సమాధానం చెబుతుంది. కాస్సేపు అగమ్యంగా చూసి "జబ్బేమిటంటారూ?" అని ఆందోళనగా అడిగింది.

"సన్నిపాత జ్వరం."

శాంతమ్మ ఒక్కసారి కంపించింది. ఆ జ్వరం ఎంత భయంకరమైందో, భర్త బ్రతికుండగా ఆయన నోటినుండి చాలాసార్లు వింది.

"నేను కొన్ని మాత్రలు పంపిస్తాను. రెండు గంటల కోసారి అల్లపు రసం అనుపానంతో వేయండి. ఆపైన భగవంతుని దయ" అని ఆయుర్వేద వైద్యుడు తిరుగు మొగం పట్టాడు.

తండ్రి మంచం దగ్గరగా తల వంచుక కూర్చున్న లక్ష్మి కూడా ఈ మాటలు వింది. బరువుగా ఒక్కసారి నిట్టూర్చింది. ఈ మూణ్ణరోజులనుంచీ ఆమె పచ్చి మంచి నీళ్ళు కూడా నోట్లో పోసుకొని ఎరుగదు. శాంతమ్మ ఆమె నిరాహారదీక్షకు చాలా వ్యధ పడింది. రెండు మూడుసార్లు ఆమెను భోజనం చేయవలసినదిగా ప్రాధేయపడింది. కాని శాంతమ్మ మాటను లక్ష్మి ఏ విధంగానూ మన్నించ లేక పోయింది.

వైద్యుడు పంపించిన మందు ఆయన చెప్పినట్లుగానే ఉపయోగిస్తోంది. కాని ఏ విధమైన ఉపశాంతీ లేదు. ఈరోజు ఆ పరాకు మాటలు కూడా లేవు; గొంతులో గురక ప్రారంభించింది. ఈ లక్షణాలు గుర్తించిన శాంతమ్మ భయకంపితు రాలైంది. ఏమి చేయడానికీ ఆమె మనస్సు పాలుపోలేదు. ఈ సమయంలో మగబిడ్డ ఆధారంగావుంటే; అనేక విధాల

ఆమెకు ధైర్యంగా ఉండేది. రవిమీదకు ఆమె దృష్టిపోయింది. ఈ నాలుగురోజుల్లో రవిగురించి ఏ విశేషమైన సంగతులూ శాంతమ్మకు తెలియలేదు. ఈ విపరీత విపత్కర పరిస్థితుల్లో కొంపలో కదలకుండా కూర్చోడం ఏ విధంగానూ శాంతమ్మకు శాంతి నివ్వలేకపోయింది.

తండ్రికాళ్లదగ్గర్నే అహోరాత్రాలూ నిరాశాపూరితంగా, ఉదాసీనంగా కూర్చున లక్ష్మి దగ్గరకు శాంతమ్మ వచ్చింది. ధర్మయ్య గురక మరీ హెచ్చుగావుంది.

"లక్ష్మీ నేను వెంటనే వస్తాను. ఆ మందు వేస్తూవుండు" అంది. లక్ష్మి బలహీనంగా తలపంకించింది. కాని ఎక్కడ కని కూడా ఆమె అడగలేదు. సూర్యాస్తమాన సమయంలో శాంతమ్మ యిల్లు విడచింది.

హాలులో చుట్టకాలుస్తూ కూర్చున్న జమిందారు, అప్పుడే వెలిగిన లైట్ల వెలుగుల్లో తెల్లటి ముసుగుతో గుమ్మం ఎక్కుతున్న శాంతమ్మను చూశాడు. జమిందారు పలకరింపుకోసం శాంతమ్మ కాస్సేపు నిలబడి చూసింది. గుర్తించి కూడా జమిందారు పలుకరించలేదు. శాంతమ్మే ధైర్యంచేసుకొని హాలులోకి వెళ్ళింది.

"ఎందుకొచ్చారు ?"

ఇదివరలో రాము చిన్నతనాన, శాంతమ్మపై ఈ లాంటి ప్రశ్నే విసిరాడు. కాని అప్పుడు ఆ మాటలో ఇంత ఈర్ష్య, ఈలాంటి కఠినత ఆమెకు స్ఫురించలేదు.

"మా రవిని జైల్లో పెట్టించడానికి కారణం?"

"నేరం చేసినందువల్ల"

"ఏమిటా నేరం?"

"అది ప్రభుత్వానికి నివేదించవలసిన విషయం."

"తల్లినైన నేను వినకూడని పాప మేం చేశాను?" అంది శాంతమ్మ. ఆమె కంఠంలో అణచుకుంటోన్న ఆవేశం సూచనా ప్రాయంగా ధ్వనించింది.

జమిందారు నవ్వి "తండ్రి ఉంటే తప్పకుండా చెప్పే వాడినే, ఆడవాళ్ళు విని బాధపడ్డం తప్ప మీవల్ల ఏం కాదు" అన్నాడు. శాంతమ్మ కాస్సేపు నిశ్శబ్దంగా వుంది. తరువాత ఆ నిశ్శబ్దాన్ని చీల్చే బరువైన నిట్టూర్పు విడచింది.

"అపాయ పరిస్థితుల్లో మిమ్ములను ఒక కోరిక కోర డానికి వచ్చాను" అని మెల్లగా అంది.

"ఏమిటది?"

"లక్ష్మి పెళ్ళి ఆగిపోయింది."

ఈ సంగతి జమిందారుకు పెళ్ళినాటిరాత్రే తెలిసింది. ఆగిపోయిన కారణంకూడా తెలుసు. "ఎందు కాగింది?" అని ప్రశ్నిస్తే ఆ సమాధానం ఎంత సూటిగా - ఘాటుగా వస్తుందో గంగాధరానికి తెలుసు. అందుచేతనే ఆ మాటకు ఏ విధమైన సమాధానంగాని, సానుభూతిగాని తెలుపలేక పోయాడు.

"మా అన్నయ్యకు సంఘ"

"అలాగా" మెల్లగా అన్నాడు జమిందారు.

"లక్ష్మి పరిస్థితి కూడా ఏమీ బావుండలేదు"

"ఏమీ?"

జమిందారుకు ఈప్రశ్న వేయడానికి నోరేలావచ్చిందా అని శాంతమ్మ మనస్సు అనుకుంది. అయినా శాంతమ్మ స్వాంతాన్ని అదుపులోనే పెట్టుకొని "ఆ రోజునుంచి అన్నాహారాలు లేవు" అంది.

" సరే! నన్నిప్పుడేం చేయమన్నారు?" విసుగ్గా అడిగాడు.

"రవిని విడుదల చేయిస్తే..."

"వీలుకాని పని"

"మీరుతలుచుకుంటే..."

"నా వల్ల కాదు" విసురుగా కుర్చీమీదనుంచి లేచాడు జమిందారు. శాంతమ్మకేసి తీక్షణంగా చూశాడు. "తప్పునకు శిక్షలేకపోతే ఒప్పనేది ప్రపంచంలో ఏనాడో మాసిపోయేది ...శాంతమ్మగారూ! ఎంతమంది పైకి మీ అబ్బాయిని దార్జన్యంగా పంపిస్తారు?"

ఈ మాటతో శాంతమ్మలో శాంతం సన్నగిలింది. ఈ వాక్యంలో ఏలాంటి విషపూరిత అసత్యం నిండిఉందో గ్రహించింది. జమిందారు అంతటితో ఊరుకోలేదు. "ఎంత కాలం పరుల సొమ్ములతో జీవించాలని కోరతారు."

"ఆగండి!" శాంతమ్మ కంఠధ్వనిలో ఎంత శక్తి ఉందో ఏలాంటి తీక్ష్ణతఉందో జమిందారు యిప్పుడే గ్రహించాడు. దేదీప్యమానంగా ప్రజ్వరిల్లుతోన్న ఏదో కాంతి, ఆమె కళ్లల్లో, లైటు వెలుగులద్వారా ప్రస్ఫుటంగా ప్రతిబింబించడం చూడగలిగాడు.

జమిందారు మనస్సుపై, ఎవరో చరచినట్లుగా, విచిత్రానుభూతికూడా పొందాడు. విహ్వలుడుగా నిలబడి, విచిత్రంగా శాంతమ్మకేసి చూస్తున్నాడు.

"న్యాయంగా మాట్లాడ్డం మరచిపోతున్నారు ... ఎవరిపైకి ఎవరు దౌర్జన్యంగా పంపారు? ఎవరిసొమ్ము ఎవరు అక్రమంగా తిని జీవిస్తున్నారు..." ఈ మాటనేవరకూ ఆమె కంఠం బింకాన్ని వీడలేదు. కాని వెంటనే ఆమె కళ్లల్లో నీటిపొరలు అలుముకున్నాయి. కంఠం గద్గదికమైంది. ఉద్రిక్తంగా - హెచ్చుతగ్గుల స్థాయిలోవచ్చే స్వరంతో ఈలా అడిగింది "మీరే దౌర్జన్యంగా నా బిడ్డను జైలుకు పంపించారు. అన్యాయంగా అన్నయ్యకు డబ్బు ఆశపెట్టి, లేని కల్యాణాన్ని కల్పించి, డబ్బు యివ్వక దగాచేసి, ఆపిల్ల జీవితాన్ని ఎందుకూగాకుండా చేశారు...అన్నయ్య అవసాన కాలానికి దారి చూపించారు."

"శాంతమ్మా" ఇక నిగ్రహించుకోలేని కోపంతో బిగ్గరగా అరచాడు. హాలంతా ప్రతిధ్వనించింది. ప్రక్కగా ఉన్న గది తలుపుకూడా కాస్త కదిలినట్లుగా కనిపించింది.

స్తంభాలమాటున దాగిన నౌకర్లుకూడా ఒకసారి తల ఎదుటకు వంచి భయంగా చూశారు. పార్వతమ్మ మిద్దెమీదనే మెట్లు దగ్గరగావచ్చి నిలబడి ఆత్రంగా చూస్తోంది.

అయితే చెమ్మగిల్లిన కళ్ళతో చూస్తున్న శాంతమ్మను ఈ ధ్వని ఏ విధంగానూ భయకంపితం చేయలేదు.

"వెళ్ళిపొండి" ఆవేశంలో వచ్చిన ఆయాసంద్వారా, కంపించే వేలును గుమ్మంవైపు చూపుతూ మెల్లగానే అన్నాడు జమిందారు.

"వెళ్ళను."

"సరే!" ఏమాలోచించాడో, తల నొక్కసారి పంకించి, గిరుక్కున వెనక్కు తిరిగాడు జమిందారు. తొందరగా మేడమెట్లు ఎక్కుతున్నాడు.

ఈ పరిస్థితిలో శాంతమ్మకు ఏమిచేయాలో తోచలేదు. కాస్సేపు వెనక్కు తిరిగిన జమిందారుని చూస్తూ వుండిపోయింది. అలా నిలబడ్డంవల్ల వచ్చే ప్రతిఫలం ఏమీలేదని తెలుసుకుంది. సిగ్గుపడ్డం కూడా ఈ స్థితిలో ఏలాంటి కార్యభగ్నాన్ని కలిగిస్తుందో తెలుసుకుంది. తొందరగా జమిందారు ననుసరించే మేడమెట్లు ఎక్కింది.

పదిమెట్లు ఎక్కినతర్వాత, శాంతమ్మ వచ్చే అలికిడి విని జమిందారు ఆగి శాంతమ్మవైపు తిరిగాడు. క్రోధావేశాలతో నిండిన మొగంతో శాంతమ్మకేసి ఎర్రగా చూశాడు.

"మా రవిని రక్షించండి" అంది శాంతమ్మ.

"ఇప్పుడేం ప్రాణాపాయం లేదుగా."

"అబ్బాయికి లేదని నాకు తెలుసు, కాని వాడు లేక పోవడంవల్ల కొందరికి ప్రాణాపాయం కలిగే స్థితి వచ్చింది... వాణ్ని విడుదల చేయించండి."

జమిందారు ఉగ్రుడయ్యాడు. కళ్లు పెద్దవి చేశాడు. ఒకమెట్టు శాంతమ్మమీాద ఉరుకుతున్నంత వడిగా దిగాడు. కంఠాన్నికూడా హెచ్చుచేసి "వీలులేదని చెప్పాను...బిడ్డకు తగిన తల్లిలాగునే నీ చర్యకూడా నీచంగా కనిపిస్తోంది. దీనికికూడా శిక్ష అనుభవిస్తావ్" అంటూ మరోమెట్టు దిగి "ఛా!" అన్నాడు.

శాంతమ్మ కంగారుపడింది. జమిందారు మీాదకి వచ్చేంత దగ్గరగా వచ్చాడు. వెనక్కి అడుగువేయడంలో కాలు తేలిపోయింది. శాంతమ్మ మెట్లమీాదనుంచి దొర్లు కుంటూ వచ్చి చావిట్లో పడిపోయింది.

జమిందారు ఆ దృశ్యంచూసి ఎఱ్ఱబడిన మొగంతో భయంకరంగా నవ్వాడు. మేడమెట్లు పైకి వెళ్లి పార్వతమ్మను చూసి "బైటకు పంపించి గేటుతాళం వేయించు" అని చెప్పి లోపలు వెళ్ళిపోయాడు.

రాము ఎప్పుడు వచ్చి శాంతమ్మ దగ్గరగా కూర్చు న్నాడో, ఆత్రంగా దిగివచ్చిన పార్వతమ్మకు తెలీదు.

శాంతమ్మ క్రిందపడిన వెంటనే స్పృహ తప్పలేదు. కాని నుదుట చిన్నగాయం తగిలి రక్తం స్రవిస్తోంది. మెల్లగా లేచి కూర్చొని చైతన్య విహీనంగా మేడమెట్లకేసి చూస్తోంది.

జమిందారు కంఠధ్వనికి చల్లా చదురై మూలదాగిన నౌకర్లుకూడా శాంతమ్మ దగ్గరగావచ్చి నిలచారు.

"కాసిన్ని నీళ్లు గుడ్డా తీసుకరా" అని దాసీ సుబ్బులుతో చెప్పి క్రోధావేశాలతో నిండిన రాము మొగంకేసి చూస్తూ "పొరపాటు చేసింది" అని మెల్లగా అంది పార్వతమ్మ.

రాము పార్వతమ్మ మొగంకేసి తీక్షణంగా చూశాడు.

భర్తలోపాల్నికూడా మభ్యపెట్టి, మంచివాళ్లే నేరస్తులుగా చిత్రించడానికి సాహసించే పతిభక్తి, పవిత్రమైందిగా ఎవరైనా భావించినా పతివ్రత అనే పదాన్ని చౌర్యం చేయడానికిచేసే స్వార్థపూరిత కృషి తప్ప ఇందులో న్యాయార్జితం లేదని రాము అనుకున్నాడు. "మనిషి తత్వం తెలుసున్నప్పుడు కాస్త జాగ్రత్తగా మెలగాలి" శాంతమ్మ నుదుటను స్రవించబోతున్న రక్తాన్ని చూస్తూ పార్వతమ్మ అంది.

అగమ్యంగా శాంతమ్మ, పార్వతమ్మకేసి చూసింది. రాము బరువుగా నిట్టూర్చాడు. పార్వతమ్మ అటు చూసింది.

"మనిషిని మనిషిగానే చూసి మాట్లాడిందిగాని, మనుషుల్లో జంతువులుకూడా దాక్కొనుంటాయని ఈమెకు తెలీదు" అన్నాడు రాము.

"ఏమిటన్నావ్ ?" కాస్త ఎర్రగా రాముని చూస్తూ ప్రశ్నించింది పార్వతమ్మ.

రాము లేచి హాలులోనే ఓ ప్రక్కగా ఉన్న బీరువా తెరచి అయొడెన్ బాటిల్, దూది తీసుకవచ్చాడు.

సుబ్బులు గుడ్డా నీళ్లూ తీసుకవచ్చింది. ఆపత్తులో కూడా కొంత ఆచారానికి ప్రాధాన్యత యిస్తున్న పార్వతమ్మను చూసిన రాము "తప్పుకోమ్మా" అన్నాడు నమ్రతగా.

పార్వతమ్మ అలాగే చేసింది. రాము శాంతమ్మ నుదుటిపై రక్తాన్ని దూదితో తుడిచి, అయొడెన్ తోముంచిన దూది గాయంపై నుంచాడు.

ఆమె ఏ మాత్రం బాధపడినట్లుగా రాము గుర్తించలేక పోయాడు.

కాని పార్వతమ్మ అయొడెన్ ద్వారా కలిగేమంట ఆమె అనుభవించక పోయినా బాధగా కళ్లొకసారి చిట్లించింది.

సున్నితమైన స్త్రీ శరీరం సుఖంగా పెరిగేరోజుల్లో స్వల్పగాయాన్నే గాకుండా గాయపడినవాళ్ళ బాధను కూడా చూసిసహించలేదు. గంపంతచేసుక బాధపడ్డంకూడాసహజం. కాని కాలం కలిగించిన కష్టాల్లో, తిండిలేక శోషిల్లుతూన్నా, తూట్లుపడి శరీరాన్నుండి రక్తం స్రవిస్తున్నా ఆ స్త్రీమూర్తే నిర్లక్ష్యంగా నిస్సత్తువుగా నవ్వుతుంది.

ఇదే ఆలోచిస్తూ రాము దాసీయిచ్చిన గుడ్డతో మెల్లగా శాంతమ్మ తలకు కట్టుకట్టాడు.

రాము మల్లయ్యకేసి చూశాడు. "కాఫీ తీసుకరా" అన్నాడు.

మల్లయ్య పైకి వెళ్ళాడు.

పార్వతమ్మ నెమ్మదిగా లేచి పదిలంగా మేడమెట్లు ఎక్కబోతోంది.

వెనకనించి "అమ్మా" అని పిలచాడు రాము. పార్వతమ్మ అక్కడే నిలబడి రాముకేసి చూసింది.

"నేనుచేసిన తప్పునకు రవి నాకు శిక్ష యిచ్చాడు. దానిగురించి బాధ గలిగిన నాకు బాధ్యతుందిగాని, రవిని అరెస్టు చేయించడానికి నాన్నగారికేం అవసరం?" అని అడిగాడు.

"గట్టిగా అరవకు" అంటూ పార్వతమ్మ చెక్కిళ్ళు నొక్కుకొని, రాముదగ్గరగావచ్చి ఈలా అంది "అవసరా నవసరాలు నీకన్నా వారికే ఎక్కువ తెలుసు ... తప్పు చేసినవాళ్లు తప్పక శిక్ష అనుభవించాలనే సంగతి ఆయన కెప్పుడూ గుర్తు ఉంటుంది."

శాంతమ్మ ఇక కూర్చోలేక మెల్లగా లేచింది. రాము కూడా లేచాడు. పార్వతమ్మమాటకు నవ్వబోయాడు. కాని నవ్వు పెగల్లేదు. "గుర్తుంటే మంచిదే; అయితే నువ్వు

చెప్పినట్లు ఈ తప్పుకు కూడా శిక్ష ఉంటుందిగా ?" అని పార్వతమ్మకేసి చూశాడు...తాను విడిచిన సుభాషితం తన నోటికే తాళం వేస్తుందని ముందు ఆమె అనుకోలేకపోయింది.

మల్లయ్య తాళంచెవి తీసుకవచ్చి రాము చేతులో పెట్టాడు.

రాము కాస్త కుంటుతూ నడవబోతున్న శాంతమ్మ దగ్గరగా వచ్చి "నేను సాయముంటానమ్మా" అంటూ ప్రక్కగా నిలచి చేయి చాపబోయాడు.

"వద్దు బాబూ" గద్గదికంగా అని పట్టు బలవంతాన నిదానంగానే న డు స్తూ, కళ్ళు ఒక్కసారి తుడుచుకొని గుమ్మం దాటింది. రాము వెనకాలనే వెళ్ళాడు.

చూస్తున్న పార్వతమ్మకు అంత వెలుగులోనూ కళ్లు చీకట్లు కమ్మినట్లు అనిపించి వెంటనే వెనక్కు తిరిగి మేడమెట్లు ఎక్కింది.

---

# 25

శాంతమ్మను కారు వెనక సీటులో కూర్చోబెట్టి రామే డ్రైవ్ చేస్తూ మెల్లగా గేటు దాటాడు.

కారు మెల్లగా పోతోంది. శాంతమ్మ ఏమన్నా మాట్లాడుతుందేమో నని రాము ఊహించాడు. ఒకటి రెండు సార్లు వెనక్కి తిరిగికూడా చూశాడు. ముద్దగా ఒక మూల కూర్చున్న శాంతమ్మ, కిటికీనుంచి ఆలోచనా రహితంగా అంధకారంకేసి మాత్రం చూస్తోంది.

"అమ్మా" డ్రైవ్ చేస్తూనే రాము పలుకరించాడు. ఆ పదంలో ఉన్న మమత శాంతమ్మ దృష్టిని మార్చింది. రాముకేసి చూసింది.

"డాక్టర్ దగ్గరకు వెళదామా?"

"వద్దు"

"రేపటికి గాయం మోపుచేస్తుందేమో."

ఆ చీకట్లో శాంతమ్మ నవ్విందో, దుఃఖించిందో అతనికి తెలీదు. కాని బాధాపూరితమైన విచిత్ర ధ్వని వినిపించింది. ఒకసారి వెనక్కి తిరిగిచూసి, వెంటనే మళ్ళీ కారు నడిపించే బాధ్యతలో ఉండిపోయాడు.

"నా గాయం కోసం నే నాలోచించడల్లేదు ... కాని..." ఇక మరేమీ చెప్పలేకపోయింది శాంతమ్మ.

రాము కడమాట వినాలని శ్రద్ధగా చెవులు నిగిడ్చి, కారు నడిపిస్తున్నాడు. ఎంతసేపటికీ అంత్యపదం పూర్తి కాక పోవడంవల్ల "మరి ఎవరి గురించి" అని ప్రశ్నిస్తూనే, ధర్మయ్యగారి వీధివైపునకు కారుత్రిప్పాడు.

శాంతమ్మ సమాధానం యివ్వకముందే, ధర్మయ్య యింటిముందు కారు ఆగింది. రాము తెరచిన తలుపునుండి శాంతమ్మ కారు దిగింది. తలుపువేసి రాము కారుదగ్గరగానే నిలచిపోయాడు.

"నువ్వు వేసిన ప్రశ్నకు సమాధానం కావాలిగా, లోపలికి రా బాబూ!" అంటూ కాళ్ళు పట్టిపట్టి వేస్తూ మెట్లు యెక్కింది.

శాంతమ్మ గుమ్మందగ్గరకు వెళ్ళి చేరవేసిన తలుపు తెరచింది. ఆమె మనస్సు కల్పించిన అపాయానికి జంకుతూ లోపలకు చూసింది. ధర్మయ్య గదిలో దీపం మిలుకు మిలుకుమంటూ వుంది.

శాంతమ్మ వెనక్కి తిరిగి చూసింది.

రాము కదల్లేదు. గుమ్మంలో అడుగు పెట్టడానికి అతని మనస్సు వెనుకాడింది. నేరస్థుడుగా తలవంచుక నిలబడ్డాడు.

"ఇంటికి పాతవాడివేగా బాబూ! చుట్టంలా సంశ యిస్తావు దేనికీ? మీ మాష్టార్ని ఒకసారి చూసి వెళుదువు గాని రా" అంటూ శాంతమ్మ లోపలకు వెళ్లింది. రాము మెల్లగా కదలి మెట్లు యెక్కాడు. శాంతమ్మ ముందుగానే

ధర్మయ్య గదిలోకి వెళ్ళింది. తండ్రి మంచం దగ్గరగా క్రింద కూర్చొన్న లక్ష్మి మంచం పట్టెపై తల పెట్టుకొని కళ్ళు మూసుకొని ఉంది. అది నిద్రలో లేక స్మృతిమించిన మస్తిష్కానికి దురపిల్లిన అనంతరం శరీరాన్ని మరచిన తెలివిలేని పరిస్థితో ఎవరికి తెలుసు?

"లక్ష్మి" శాంతమ్మ దగ్గరగావచ్చి పలుకరించింది. లక్ష్మి బరువైన రెప్పలు ఎత్తి చూసింది. కాని శిరస్సును ఆ స్థానాన్నుండి కదల్చలేకపోయింది. కాని శాంతమ్మ తల కట్టుకేసి దృష్టినిలిపి కాస్సేపు చూసింది.

"రాము వచ్చాడు" అని మళ్ళీ శాంతమ్మ అంది. ఈ మాట విన్న లక్ష్మి కాస్త కళ్లు పెద్దవిచేసి గది గుమ్మం వైపు చూసింది. రాము కనిపించాడు. కాని వెంటనే కళ్లు మూసింది. మూసిన కళ్లనుండి కన్నీళ్ళు జారిపడ్డం శాంతమ్మ చూసింది. లక్ష్మి కళ్లు తుడుచుకొని అలాగే నిస్సత్తువగా పడివుంది.

రాము గుమ్మందగ్గరే ఉండి పరిస్థితులన్నీ తొందరగానే అవగాహన చేసుకున్నాడు. లక్ష్మి గుర్తుపట్టలేనంతగా మారి పోయింది. ధర్మయ్య కట్టెలా మంచాన్ని అంటుకొని ఎడ తెరిపి లేకుండా గురక పెడుతున్నాడు.

శాంతమ్మకూ జమిందారుకూ జరిగిన సంభాషణ ప్రక్కగదిలో ఉన్న రాము వినడం జరిగింది. అయితే కడుపు

తీపి కొద్దీ రవిని విడుదలచేయించే ఉద్దేశంతోనే ఆమె వచ్చిం దనే అనుకొన్నాడు గాని, ధర్మయ్య దుస్థితిగాని, లక్ష్మి పరిస్థితిగాని, ప్రస్తుతం చూస్తున్నంత గాఢంగా ముందు నిర్ణయించుకోలేక పోయాడు.

గుమ్మందగ్గరనే కాస్సేపు నిలబడి "లక్ష్మీ" అని పిలచాడు రుద్ధకంఠంతో రాము.

లక్ష్మి మెల్లగా తలెత్తింది. రాముకేసి తడిదేరిన అరమోడ్పు కళ్ళతో చూసింది. ఆ చూపులో ఏ కోరికా లేదు. ఈర్ష్యా ద్వేషాలు కూడా లేవు కాని భయావహమైన ఏదో శాంతి కనిపిస్తోంది.

"క్షమించు లక్ష్మీ" దగ్గరగా వచ్చి గద్గదికంగా అన్నాడు రాము.

ఇప్పుడే స్పృహలోకి వచ్చినట్లుగా లక్ష్మి కళ్లు కాస్త కదిలాయి. రాము కళ్లల్లో నీటి తెరలు మెరవడం కూడా గమనించింది. గాని ఏమీ మాట్లాడలేకపోయింది.

"ఊరుకో బాబూ" శాంతమ్మ ఊరడించబోయింది. రాము కళ్లు తుడుచుకొని, ధర్మయ్య మంచం ప్రక్కగా ఉన్న కుర్చీమీద కూర్చొని "నేను చాలాద్రోహం చేశానుకదూ?" బాధగా ఉద్వేగంతో అని తల క్రిందుగా వంచుకొని, చేతిలో ఉన్న జేబురుమాలు కళ్ళదగ్గరగా పెట్టుకొని అద్దుకున్నాడు.

అతని మనః పరిస్థితి ఏమీ బావుండలేనట్లుగా శాంతమ్మ గుర్తించింది. కాని బావుండాలని రాము కోరుకోడల్లేదని

మాత్రం ఆమెకు తెలీదు. లక్ష్మికి ఈలాంటి ఘోరం జరగ డానికీ, రవి జైలుకి పోవడానికి, ధర్మయ్య మంచం పట్టడానికి, కారణం తానుగానే గ్రహించుకున్న రాము, వాళ్లు పొందే క్షోభను పదిరెట్లుగా పొంది, అలాంటి వ్యధాపూరితమైన అగ్నిలో నిలచి నాశనం కావడమే మంచిదిగా భావిస్తున్నాడు.

శాంతమ్మ చావిట్లో దీపం వెలిగించడానికి అక్కడ నుంచి కదలింది.

"లక్ష్మి" మళ్ళీ పిలచాడు రాము.

లక్ష్మి చూసింది. ఇక అక్కడ ఉండగల ఓపిక ఆమెలో లేదు. లేచి నిలబడింది. రాము ఆలాగే లక్ష్మికేసి చూస్తున్నాడు. లక్ష్మి శుష్కవదనంలో, ప్రశాంతమైన ఏదో కాంతి రాముకి కనిపించింది. గంభీరత్వం వహించిన ఆమె నేత్రాల్లో లోతును గుర్తించడానికి యత్నిస్తున్నాడు.

కాని ఏమీ మాట్లాడలేదు. మంచంమీద మగతలో ఉన్న ధర్మయ్యకేసి చూస్తోంది.

రాము యిప్పుడు ధర్మయ్యను చూశాడు. అర్ధచూపు పడింది. గురక ఎడతెరిపి లేకుండా సన్నగా ధ్వనిస్తోంది. ఇది ఏలాంటి సమయమో ఎక్కువగా అనుభవంలేని రామునకు-వచ్చే అపాయాన్ని, జరగబోయే అనుభవాన్ని యథా తథంగా గ్రహించలేకపోయాడు. మళ్ళీ తిరిగి యిటుచూశాడు. లక్ష్మి ఎప్పుడు వెళ్లిందో అక్కడ లేదు.

రాము చావిట్లోకి వచ్చాడు. లక్ష్మి గోడదగ్గరగా నిలబడింది. ఆమె మొగంపై చీకటి వెలుగులు, చావిట్లో గాలికి ఊగే హరికేన్ లాంతరనుండి ప్రసరిస్తున్నాయి.

"నీకు చేసిన ఈ పొరపాటునకు, నువ్వు ఏలాంటి శిక్ష యిచ్చినా అనుభవించడానికి సిద్ధంగా ఉన్నాను లక్ష్మీ"

రాము మాటలు విని లక్ష్మి చూసింది. దుఃఖంతో కలిసిపోయి హృదయాన్ని కదలించే బాధామిళితమైన హాసాన్ని విడచి, అక్కడ నిలబడలేక వేరే గదిలోకి వెళ్ళి పోయింది.

ఇంతగా ప్రాధేయపడుతూ అడిగిన అతని మాటలకు తిరిగి లక్ష్మినుండి తీవ్రావేదనతో దూషణతో నాలుగు మాటలు వస్తే, రాము హృదయం కాస్త శాంతి పొందే దేమో; కాని కనీసం ఏలాంటి మాట కూడా ఆమెనుండి రాకపోవడంవల్ల సంక్షోభపూరితమైన రాము హృదయం మరీ మథనపడ సాగింది.

"ఏమన్నావ్ బాబూ" లక్ష్మి వెళ్ళిన గదిలోనుంచే శాంతమ్మ వచ్చి రాముని చూస్తూ ఈ ప్రశ్న వేసింది.

రాము ఒకసారి శాంతమ్మ కేసి చూశాడు. తన దౌర్బల్యపూరిత హృదయఘోషను, ఏ భాషలో ఆమెకు చెప్పగలడు? తలవంచుకొని సమాధానాన్ని కూడా విస్మరించాడు.

"మాట యిచ్చి తప్పడంవల్ల మాకు వచ్చిన కష్టాలు చూసి కూడా, వాగ్దానాలివ్వడం తప్పనే సంగతి యింకా గ్రహించలేదూ?" శాంతమ్మ అంది.

మృదువుగా అన్న ఈ భాషణ ద్వారా ఏలాంటి ప్రతీకార వ్యంగ్య శరాఘాతం అతని హృదయంలో తాకిందో; అతని మొగం చూసిన శాంతమ్మ వెంటనే గ్రహించింది. శాంతమ్మ దగ్గరగా వచ్చింది. "బాధపడకు బాబూ! నీ కాళ్ళ మీద నువ్వు నిలబడగల శక్తి లేనప్పుడు వాగ్దానాలివ్వడం మంచిది కాదనే సంగతి నువ్వింకా గ్రహించలేకుంటే; నా కాశ్చర్యంగానే వుంది. అందుకే అలా అన్నాను" అంది.

"తప్పు చేశానన్నానుగా ... దానికి శిక్షగా నా ప్రాణాన్ని తీసుకోమన్నా తీసుకుంటా" వణుకుతూవచ్చిన ఈ మాటలకు శాంతమ్మ భయాశ్చర్యాలతో చూసింది. రాము నిజంగా ప్రతిజ్ఞపాలించే పట్టుదలతో ఉన్నట్లుగానే అతని మొగం స్ఫురింపచేస్తుంది. శాంతమ్మ అతని కళ్లనుండి కారే కంటినీటిని తుడుస్తూ "ఛా! అదేంపని బాబూ!" అని అడిగింది.

"నేను లక్ష్మిని హృదయపూర్వకంగా ప్రేమించాను కాని..." అంటూ మొగాన్ని రెండు చేతులతో కప్పుకొని, ప్రక్కగా ఉన్న చాపమీద చతికలబడి వెక్కి వెక్కి చంటి పిల్లవాడులా రాము ఏడుస్తున్నాడు.

శాంతమ్మ స్తంభించిపోయి అలాగే చూస్తోంది. రాము కారే కళ్లనీళ్లను తుడుచుకుని శాంతమ్మకేసి చూసి "నాకు తెలీకుండా లక్ష్మి పెళ్లి నిర్ణయించారు... ఈలాంటి పని చేస్తున్నప్పుడు లక్ష్మి ఎందుకు చెప్పకూడదు" అని అడిగాడు.

శాంతమ్మ మరీ ఆశ్చర్యపడింది. రాము దగ్గరగా కూర్చొని "ఎవరు ఎవరితో చెప్పాలి?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు రాము సమాధాన మివ్వలేదు. నిజమే! ఎవరికి ఎవరు చెప్పాలి? అని మళ్లీ తనలో అనుకున్నాడు.

"లక్ష్మి ఆడపిల్ల అన్న సంగతి నువ్వు మరచి మాట్లాడుతున్నావ్ బాబూ! ఈ విషయంలో నువ్వే మీ నాన్నగారితో చెప్పడానికి జంకినప్పుడు లక్ష్మి ఏ విధంగా వాళ్ళ నాన్నతో చెప్పగలుగుతుంది... కాని నిన్ను ప్రేమించినంతగా లక్ష్మి ప్రపంచంలో మరెవర్నన్నా ప్రేమించి ఉంటే, వాళ్ళు లక్ష్మి గురించి ప్రాణాలిచ్చి నిలబడ్డానికైనా సిద్ధపడతారు. కాని నువ్వు తండ్రిచాటు బిడ్డడవు. ఆ సంగతి లక్ష్మి కన్నా నువ్వే ముందు తెలుసుకోవలసింది. అయితే ప్రేమనే అజ్ఞానంలో ఆలోచనకు నువ్వు తావివ్వలేదు. లక్ష్మి అయినా, అస్వతంత్రులను ప్రేమించిన అనేకమంది ఆడవాళ్ళు పంకిలులయ్యారనే సంగతి కూడా తెలుసుకోలేకపోయింది. ఇంతకూ నీ కేదన్నా శిక్ష యివ్వాలనే అధికారం నువ్వే నాకిచ్చిఉంటే; ఆ శిక్ష చాలా భయంకరమైందిగా ఉంటుంది" అని అంతవరకూ చెప్పి శాంతమ్మ మెల్లగా లేచింది.

గుడ్లు వప్పచెప్పి చూస్తున్న రాము శాంతమ్మలో దాగిన విమర్శనా శక్తికి విస్తుపోయాడు. ఈ లోపం ఎవరిదో ఆమె తియ్యని మాటల్లో దాగివుంది. నిలబడిన శాంతమ్మ కళ్ళల్లోకి తల ఎత్తి చూశాడు. ఉన్మాదప్రారితమైన ఆవేశంలో అతని హృదయం కదలిపోయింది. అతని వదనంలో సంతోషం సంతాపం కూడా సందిగ్ధావస్థలో సమరం చేస్తు న్నాయి. "నువ్వు యివ్వబోయే శిక్ష నాకు తెలుసు... ఈ పాప పరిహారార్థం నీ పాదాల సాక్షిగా లక్ష్మిని నేను పెళ్ళి చేసుకుంటానమ్మా" అంటూ శాంతమ్మ రెండుకాళ్లూ పట్టుకొని, కన్నీటితో ఆమె పాదాలను తడిపాడు. శాంతమ్మ ఆనందంగా నిట్టూర్చి తలవంచి రాము శిరస్సును,సంతోషంగా స్పృశించింది. గదిలో నిలచిన లక్ష్మి బరువుగా "అబ్బా!" అంది.

విసురుగావచ్చినగాలి, తెరచిన తలుపులను దబాలున నెట్టింది. కిటికీలన్నీ కొట్టుకోడం ప్రారంభించాయి. చావిట్లో లాంతరు అటుయిటు తీవ్రంగా కదిలిపోతోంది. ధర్మయ్య గదిలోనుంచి ఏదో భీకరమైన ధ్వని వినిపించింది.

లక్ష్మి హృదయం భీతావహంతో నిండిపోయింది. తడ బడే కాళ్లతో తొందరగా తండ్రి ఉన్న గదిలోకి వెళ్లింది.

మెరుపులాగ వెళ్ళిన లక్ష్మి శాంతమ్మ రాము చూశారు.

"నాన్నా" అంటూ గదిలోనించి బిగ్గరగా అరచింది లక్ష్మి. శాంతమ్మ ధర్మయ్య గదిలోకి వెళ్లింది. ధర్మయ్యను చూసింది. ఒక్కసారి "అన్నయ్యా!" అంటూ అరచి ధర్మయ్య కాళ్ళమీద పడిపోయింది.

రాము మంచందగ్గర నివ్వెరబడి కొయ్యబారిన ధర్మయ్య శరీరాన్ని చూస్తూ నిలబడిపోయాడు.

గాలి తీవ్రతవల్ల గదిలో దీపకళికకూడా ఆరిపోయింది.

# 26

ఏ నిస్వార్థజీవి ఆశీస్సుల ఫలితంగా - ఆకర్షణాయుత బోధనలతో - విద్యావేత్తలుగామారి, మానవుల్లో కొందరు ఉన్నత ఉద్యోగాలు పొందే యోగ్యత సంపాదిస్తున్నారో- విజ్ఞులుగా - విమర్శకులుగా తయారవుతున్నారో; ఆలోచిస్తే ఓనమఃలు టద్దించిన ప్రాథమిక ఉపాధ్యాయుడు గుర్తుకొస్తాడు. తన విద్యాభవనం వివిధ కుంచులతో వింతవింత రంగులతో చిత్రించినా పునాదిమాత్రం అదేనని ఎవరూ విస్మరించలేరు- అయితే వాళ్ళు మారినా వారితోబాటు లోకం కొంత మారినా ఆ గురుదేవుని స్థితి మారదు.

పిల్లలు వస్తూనే ఉంటారు. విద్యాభిక్ష సందుకొని, వినోదంగా నవ్వుతూ వెళ్తూనే ఉంటారు. కాని ఉన్నత స్థితికి వచ్చిన ఒక్క విద్యార్థికూడా పాతబడ్డ ఉపాధ్యాయుని జీవితాన్ని పర్యావలోకనం చేయడానికి యిష్టపడడేమో; బహుశా ఆ సమస్య పెద్దదిగా అతని దృష్టిలో ఉండదేమో. కాని దేశానికీ, జాతికీ, విద్యాదాతనైనా ఆ పేద అధ్యాపకుడు భూతకాలంయొక్క వైభవాన్ని చూసుక ముకిసి పోతాడు. వర్తమానానికి విచారిస్తాడు. భవిష్యత్తు శాశ్వతగా ఉండాలని భావిస్తాడు. ఆశ నెరవేరకుండానే లేమికి కుటుంబాన్ని అంకితంచేసి, కన్నబిడ్డల భవిష్యత్తుని కన్న దేశానికే విడచిపెట్టి కారే కంటిసిటితో కళ్లు మూస్తాడు.

ధర్మయ్య జీవితం కూడా సహజానికి భిన్నం గాకుండా అలాగే సమాప్తి అయింది.

ధర్మయ్య పెద్దకార్యం కూడా అయిపోయింది. మరి నాలుగురోజులకు, కోర్టులో బోనులో నిలబడ్డ రవిని హంతకుడుగా, దోపిడీదారునిగా, నిరూపించడానికి, జమిందారు తరఫు ప్లీడరు చాలా కృషి చేశాడు.

రవికి ప్లీడరు లేడు. కాదని నిరూపించడానికి తగిన సాక్ష్యంకూడా లేదు. అగమ్యంగా చూస్తూ ఆలోచనా రహితంగా, కొన్నింటికి "ఊఁ" కొడుతూ, "నిజంకాని వాటికి నిర్లిప్తుడుగా ఊరుకుంటూ చంచలదృష్టితో కోర్టంతా కలయ చూస్తున్నాడు.

కావలసినవాళ్లు ఎవరూ రాకపోవడం రవికి చాలా బాధగానే తోచింది. కనీసం ధర్మయ్యకూడా రాలేదంటే కారణం ఏమిటో అతనికి అంతుపట్టలేదు.

"నీకు సాక్షులెవరైనా ఉన్నారా?" న్యాయాధిపతి ఉన్నత స్థానంలో కూర్చొని దయాపూరితంగా అడిగాడు రవిని.

రవి మాట్లాడలేదు. ఎదురుగా నిలబడ్డ వకీలు ప్రక్కగా కూర్చున్న జమిందారు కేసి చూశాడు. రవి మొగం క్రోధంతో మలినమైంది.

"ఏం మాట్లాడవు" ఈసారి వకీలే గద్దించి అడిగాడు.

"ఎవ్వరూ లేరు" బాధగా బిగ్గరగా సమాధాన మిచ్చాడు రవి.

"ఉన్నాను" అంతకన్నా బిగ్గరగా ఆ జన సమూహంలోనుంచి ఒక కంఠం వినిపించింది. అంతా అటు చూశారు.

రాము బోను దగ్గరగా వచ్చి నిలబడ్డాడు. అంతా ఆశ్చర్యంగా చూశారు. దెబ్బతిన్న వ్యక్తే ముద్దాయితరఫున సాక్ష్యం చెప్పడానికి వస్తే ఆశ్చర్యపడకుండా ఎవరుండగలరు?

రాము బోను ఎక్కినతర్వాత, జరిగిన విషయాన్ని జంకులేకుండా పూర్తిగా న్యాయాధిపతికి తెలియచేశాడు.

"కేసు విచిత్రంగానే ఉంది. కాని అనుకున్నంత విపత్తులో కూడిన విశేషం లేకపోవడమే ఆశ్చర్యం" అని

మెల్లగా గొణుక్కుని "నేరారోపణ నిరాధారమైంది" అని చెప్పి కేసుకొట్టివేసి, లేచాడు న్యాయాధిపతి. ఈ అపజయంతో గంగాధరం తల క్రిందకు వంచుకపోయింది. క్రోధంగా రాముకేసి చూశాడు.

రాము తంత్రీదృష్టినుండి తప్పుకొని హాలు వెలుపలకు వచ్చి నిలబడ్డాడు. జమిందారు కూడా అక్కడికే వచ్చాడు. క్రింకే పొద్దు చాయలను, చూస్తూ నిలబడ్డాడు. వాళ్లిద్దరి కెదురుగా కారు వచ్చి ఆగింది. తీర్పువిన్న డ్రైవరికి కూడా - వాడిపోయిన జమిందారు మొగం చూస్తే; జాలివేసి నట్లనిపించింది.

"గుండెల్లో గుర్తుంటుంది" కంపితంగా - బరువుగా - ప్రక్కనుంచి దూసుకుంటూ వచ్చిన, ధ్వనికి జమిందారు వెనక్కి తిరిగి చూశాడు. పోలీసు ప్రక్కగా ఉన్న రవి అప్పుడే చాలా దూరం వెళ్లిపోయాడు.

"కారు ఎక్కు" రామును చూస్తు గంగాధరం ఆజ్ఞాపించాడు. రాము కారు ఎక్కి ఒక మూలగా ఒదిగి కూర్చున్నాడు. జమీందారు కారు ఎక్కి తీవ్రంగా ధ్వనించే టట్లు తలుపు దభాలున వేశాడు.

కారు మెల్లగా కదిలింది.

"నీ ఉద్దేశం?" కటువుగా - హఠాత్తుగా జమిందారు ఈ ప్రశ్న వేయడం, రాముకి భయమే కలిగించింది. కాని సమాధాన మివ్వలేదు.

తండ్రి యింటిదగ్గర చెప్పినదానికి విరుద్ధంగా, ప్రవర్తించిన రాము, ఎందుకలా చేశానో, అని ఆలోచిస్తున్నాడు. ఒక నిర్దోషిని నిందతునిగా చిత్రించి, శాశ్వతంగా బంధించ ప్రయత్నిస్తుంటే హృదయమున్న ఏ మానవుడూ చూస్తూ ఊరుకోలేడేమోనని అనుభవంమీద గ్రహించాడు రాము. అయితే మభ్యపడిన ఏకోదరత్వం ద్వారా ఉప్పొంగిన హృదయావేదనే అలా చేయించిందనే సంగతి అతనికి తెలీదు.

"శాంతమ్మ ఏమన్నా చెప్పిందా?"

ఏదో అనురు అంతరాన మెదలడంవల్ల జమిందారు మెల్లగా అడిగాడు.

"లేదు" అని రాము సమాధానమిచ్చాడు.

"మరెందుకలా చెప్పావ్" అంటూ బిగ్గరగా అరచాడు. డ్రైవరు ఒక్కసారి ఉలిక్కిపడి, వెనక్కి తిరిగి చూసి మళ్లా సరుదుక కూచుని కారు నడిపిస్తున్నాడు.

"జరిగింది చెప్పకపోతే నిజమేలా తెలుస్తుంది?"

"ఈ నిజం చెప్పడానికే కోర్టుకి వచ్చావా?"

"అబద్ధంకోసం మీరు కోర్టుకు రమ్మని చెప్పినా - రవికి జరిగే అఘాయిత్యానికి నిజం చెప్పక తప్పలేదు." అని మెల్లగా తండ్రికేసి చూస్తూ "అయినా రవిపై కేసు మోపు చేస్తే మీకు వచ్చే ఫలితం?" అని అడిగాడు.

"నోర్మూయ్" అంటూ ఒక్కసారి శరీరాన్నంతా కదల్చి రాముని ఉరిమి చూశాడు. రాము మాట్లాడలేదు.

కారు జమిందారు భవంతి చేరుకుంది. కనుచీకట్లో వీధి వెంబడి తలవంచుకొని విసురుగా వస్తున్న రవిని చూసిన వాళ్ళల్లో కొందరు ఆశ్చర్యపడ్డారు, మరికొందరు విచారంగా తలపంకించారు.

తనకు అయాచితంగా లభించిన స్వల్పకాల జైలు జీవితమే పరిచయస్తుల భయాశ్చర్యాలకు కారణమని ఊహించుకుంటూ ధర్మయ్యయింటిగుమ్మం ఎక్కాడు రవి.

చావిట్లో ఎవరూ ఉన్నట్లు కనిపించలేదు. దీపం వెలుగుతోంది ఓరగా వేసిన తలుపు రేకును తోసుకొని లోపలకు వెళ్లాడు. ధర్మయ్యఉండేగది గొళ్లెం వేసిఉంది.

"బావా!" గద్గదికంగా కంఠం వినిపించింది. వెనక్కి తిరిగి చూశాడు. లక్ష్మి అవతల గదితలుపు ప్రక్కగా కూర్చుని కళ్ళనీళ్ళు కారుస్తోంది.

దొడ్డిలోనుంచి బిందెతో నీళ్లు తీసుకవచ్చిన శాంతమ్మ రవినిచూసి స్తంభీభూతురాలైంది.

"అమ్మా" అంటూ ఆసక్తిగా రవి పిలచాడు.

"బాబూ" అంటూ అశ్రునయనాలతో. బిందె ప్రక్కగా దింపి రవి దగ్గరగా వచ్చింది.

తైలధారగా కారుతున్న లక్ష్మి కంటినీటిని రవి మళ్లీ చూశాడు. అనుమానం కలిగింది. శాంతమ్మకేసి విమర్శనగా చూశాడు.

"అన్నయ్య యిక లేడు" రోదన స్వరంతో శాంతమ్మ అంది.

"ఆ!" భయంగా ఒక్కసారి అరచాడు రవి.

"ఫలితంలేని పెళ్ళి అన్నయ్య ప్రాణాలనే బలిగా తీసుకుంది." కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ శాంతమ్మ అంది.

రవి నట్టింట చతికిలబడ్డాడు. అతని కళ్ళల్లో నీళ్ళు క్రమ్ముకున్నాయి. ధర్మయ్య అంటే; రవికున్న ప్రేమాభిమానాలు రవి అంతరాత్మకే తెలుసు.

శ్వాసను గట్టిగా పీలుస్తూ, కారే కంటినీటిని చేత్తో విసురుగా తుడుచుకొన్నాడు.

అతని కళ్లల్లో రక్తనాళాలు ఒక్కసారే ఉబికాయి. జమిందారు విగ్రహం అతని మనోగగనంలో వికార స్వరూపాలతో విభ్రమణమవాతూవుంది.

రవిరాకచూసిన మరిద్దరు పలకరింపుకోసం, ధర్మయ్య యింటి చావిడిలోకి వచ్చారు. రవి వాళ్ళకేసి చూశాడు. కాని రవిని చూసినవాళ్ళు పలకరించగల ధైర్యాన్ని పొందలేకపోయారు.

"మాష్టారూ!" ఒక్కసారి ఆవేదనగా తనలో తనే గొణుక్కున్నాడు.

"ఊరుకో బాబూ! ఏంజేస్తాం" వచ్చిన వారిలో ఒకతను వెనకనించి అన్నాడు.

"ఇంతకూ జమిందారే తన కడుపున పెట్టుకొన్నాడు. లేకపోతే నిక్షేపంలాంటి సంసారం చూస్తుండగా ఈలా అయిపోవడమేమిటీ? అని రెండో ఆసామీ సానుభూతిగా పలికాడు."

రవి దిగ్గున పైకి లేచాడు. గుమ్మంవైపు తిరిగాడు. శాంతమ్మ భయంగా చూసింది. దగ్గరగా వచ్చింది.

"మళ్ళీ ఎక్కడికీ" అని ఆతురతగా అడిగింది.

"వీలుంటే, వచ్చినచోటికే వెళ్ళాల్సివుంటుంది"

"అంటే!" అగమ్యంగా చూస్తూ శాంతమ్మ ప్రశ్నించింది.

"జైలుకే" కటువుగా పైకిచూస్తూ అన్నాడు.

"రవీ" అని శాంతమ్మ రవి చేతులు పట్టుకుంది. కళ్ళల్లో తళుక్కున మెరుస్తున్న కన్నీటి ధారలతోనే తల్లి కేసి చూసి, "అమ్మా! మాష్టారు ఋణాన్ని మనం తీర్చుకోకుం డానే ఆయన మరణించారు...ఆ మరణానికి కారణం మనం ఎవ్వరం మర్చిపోలేం...ఈలాంటి ఘోరమైన శిక్షను అనుభ వించడానికి అతను చేసిన నేరం ఏమీలేదు. నేరం లేకుండా శిక్షించిన ఆ నేరస్తుడికి, నిజం తెలుసుకొని, నేరం ఉందని తెలిసికూడా...ప్రతిఫలాన్ని అందజేయకపోవడం మంచిది కాదమ్మా" అని ప్రాధేయతగా తల్లిని చూస్తూ చేతులు ఆమెనుండి తప్పించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు రవి.

"రవి పట్టుదలంటే మాటల్తో పనికాదు" అన్నాడు ప్రక్కనున్న పెద్దమనిషి.

"ఈదెబ్బతో జమిందారు పస తేలిపోతుందిలే" అని తృప్తిగా నవ్వాడు రెండో అతను. "మీరు బైటకువెళ్ళండి"

శాంతమ్మ బిగ్గరగా అంది. వచ్చిన పెద్దలిద్దరూ మొదట్లో ఆశ్చర్యంగాచూసి, గుమ్మందగ్గరగా వెళ్లి నిలబడ్డారు.

మళ్ళీ శాంతమ్మ ఉద్రిక్త శాంత సమ్మిళిత స్వరంతో ఈలా అంది.

"వెళ్లండి బాబూ! మీ మాటలు ఈ సమయంలో ఉపకారానికన్నా అపకారం ఎక్కువచేస్తాయనేది మీరు మర్చిపోయారు. మీకున్న అభిమానానికి నమస్కారాలు పెడతాను వెళ్లండి."

ఆశ్చర్యంగా చూస్తూనే ఆ పెద్దలిద్దరూ గుమ్మందిగి వెళ్లిపోయారు. వాళ్లు వెళ్లిన వెంటనే వీధితలుపు గడియ వేసింది శాంతమ్మ.

"స్నానానికిలే" రవిదగ్గరగా వచ్చి అడిగింది.

"అక్కర్లేదు"

"నీకేం కావలసింది నాకు తెలుసు"

"ఏమిటమ్మా అది" బాధగా చూస్తూ అడిగాడు రవి.

"నువ్వు గంగాధరంగార్ని ఏం చేద్దామనుకుంటున్నావో కాస్త చెప్పు"

శాంతమ్మకేసి రవి చూశాడు. అతని కళ్ళల్లో కక్ష ప్రతిబింబిస్తోంది. క్రోధంగా ఈలా అన్నాడు "ఎందువల్ల మాష్టారికీ మరణం కారణమయిందో, ఆ మరణానికి కారణం ఎవ్వరో - వారికి అలాంటి శిక్ష యిస్తేనేగాని..."

ఇక మాట్లాడలేక, పళ్లు ఒకసారి కొరుక్కున్నాడు.

"తరువాత" శాంతమ్మ అడిగింది. కాని రవి సమాధానమివ్వలేదు. మళ్లీ శాంతమ్మ "అంతకన్నా ముందు మరోపని చేస్తే బావుంటుం దేమో." అంది మెల్లగా—

"ఏమిటది" రవి ఆత్రంగా అడిగాడు.

"ఆ శిక్ష ముందు నాకే యిస్తే"

"అమ్మా" రవి బిగ్గరగా బాధగా అరచాడు.

"ఏం?"

రవి మాట్లాడలేదు. పిచ్చిగా అటూయిటూ పచారు చేస్తున్నాడు.

దుఃఖపూరితవదనంలో భయాన్నికూడా భద్రపరచుకుంటూ, మూలకూర్చునున్న లక్ష్మి బిక్కుబిక్కుమంటూ రవిని చూస్తోంది.

"రాక్షసులంటే, ఎవరు బాబూ?"

శాంతమ్మ మాట విని రవి వెనక్కి తిరిగి చూశాడు. "మానవనాశనాన్ని కోరే గంగాధరంలాంటి వాళ్లు" అని చెప్పి మళ్లీ బింకంగా అడుగులు వేసుకుంటూ తిరుగుతున్నాడు.

"మరి నువ్వు చేయబోయే పని?" మళ్ళీ శాంతమ్మ అడిగింది.

"అలాంటివాళ్ళను నాశనం చేయడమే" తిరిగి చూడకుండా తలవంచి అడుగులు వేసుకుంటూనే రవి సమాధానమిచ్చాడు.

"దానిపేరేమిటి?" ఈసారి శాంతమ్మ తీక్షణంగా అడిగింది. ఆ ధ్వనికి రవి నిలచిపోయాడు. విసుగ్గా తల్లి కేసి

చూశాడు. "అమ్మా! నన్నట్టే వాగించకు; నీళ్ళు తోడతా నన్నావు కదూ? ఊఁ! కానియ్యి?" అంటూ లక్ష్మి ఉన్న గదివేపునకు వెళ్లాడు.

లక్ష్మి మొగంలో భయం తొలగిపోయింది. శాంతమ్మ దొడ్డివైపునకు వెళ్లింది.

రవి భోజనం చేస్తున్నవైఖరి లక్ష్మికి మరీ అగమ్యంగా తోచింది.

తీక్షణంగా యింటికప్పుకేసి చూస్తున్న రవి నోట్లో, చేయివేస్తున్న ముద్దలు పడుతున్నాయి. పడిన ఆహారాన్ని పళ్లు నములుతున్నాయి అంతే, పదార్థాన్నిగాని రుచినిగాని అతను పరిశీలించే స్థితిలోలేడు. అసంపూర్తి భోజనంతో హఠాత్తుగా పైకి లేచాడు.

వంటయింట్లోంచి మజ్జిగ తీసుకవచ్చిన శాంతమ్మ, గిన్నెకేసి ఆశ్చర్యంగా చూస్తూ "అన్నమంతా అలాగునే వుందేం?" అని అడిగింది.

"ఆకలికావడల్లేదమ్మా." అన్నాడు అదో విధంగా బాధపడుతూ రవి. పీట దగ్గరగా నిలిచిన రవి దగ్గరకు శాంతమ్మ వచ్చింది.

"ఎందుక్కావడల్లేదు?" అని మళ్ళీ అడిగింది.

"ఏమో—" పైకి చూస్తూ సమాధాన మిచ్చాడు.

"దీనికన్నా జైల్లో భోజనమే బాగుందా?"

"ఔను! నా కదే రుచిగావుంది" అని చెప్పి క్రిందకి గ్లాసు తీసుకొని దొడ్డివైపునకు వెళ్ళాడు రవి.

రవి చావిట్లో వేసిన మంచంమీద పడుకున్నాడు. అతనికి నిద్దరపట్టలేదు. ఒకసారి లేచి కూర్చున్నాడు. శాంతమ్మ మెల్లగా తన గదిలోనుంచి వచ్చింది "మళ్ళీ లేచావేం?" అని అడిగింది.

"అబ్బే! ఊరికే-" అంటూ తిరిగి పడుకున్నాడు రవి.

రవి గురించి శాంతమ్మకు బాగా తెలుసు. తలపెట్టిన పని జరిగించేవరకూ అతను నిద్దరపోడు. అయితే ఆపని ద్వారా జరిగే శేషాన్ని మానసికంగా దృశ్యరూపంలో చూసినప్పుడల్లా శాంతమ్మ భయకంపిత మౌతోంది.

అరగంట గడచిన తర్వాత శాంతమ్మ మళ్ళీ చావిట్లోకి వచ్చింది. తల్లి వస్తూన్న అలికిడివిన్న రవి చూస్తూన్న రెండు కళ్ళూ మూసి, గాఢనిద్దట్లో మునిగిపోయినట్లుగా మొగం పెట్టాడు. శాంతమ్మ పరిశీలించినమీదట, ఆందోళనా రహితంగా ఒక నిట్టూర్పువిడచి, ఇష్ట దేవుణ్ణి మనసులో ధ్యానించుకొని, తన గదిలోకి వెళ్ళిపోయింది.

అదురుగా శాంతమ్మకు కునుకుపట్టింది. వీధిలో భయంకరంగా అరుస్తున్న కుక్కల అరుపులు విని త్రుళ్ళిపడి లేచింది. చావిట్లోకి వచ్చింది. రవి మంచంపైన లేడు.

"లక్ష్మీ" బిగ్గరగా ఆందోళనగా శాంతమ్మ పిలచింది.

నిద్దట్లో ఉన్న లక్ష్మి ఉలిక్కిపడిలేచి, శాంతమ్మ దగ్గరగా వచ్చింది.

"రవి ఏడీ?" శాంతమ్మ ఆత్రుతగా అడిగింది. లక్ష్మికి మాత్రం ఏం తెలుసు? వెర్రిగా మంచం కేసి చూసింది.

"అనుకున్న పని చేస్తాడేమో?" కంపించి పోతూ భయంగా చూసి "లక్ష్మీ! వెళదాం పద" అంటూ లక్ష్మి చేయి పట్టుకొని గుమ్మందగ్గరగా వచ్చింది.

"అమ్మా! ఇక్కడే ఉన్నా-" అనే రవి కంఠం విని ఇద్దరూ ఆగిపోయారు. ధర్మయ్యగదిలోనుంచి రవి వచ్చాడు.

శాంతమ్మా లక్ష్మి ఆశ్చర్యంగా, చీకటిగా ఉన్న గది కేసి ఒకసారి, రవిమొగం కేసి ఒకసారి చూశారు.

తన పెట్టెనుంచి తీసిన సైజారు మొలలో జొనుపుకున్న సంగతి తల్లికి తెలీకూడదనే భావంతో అర్థహీనంగా, భయంగా చూస్తూ నవ్వాడు.

ఆ దుష్ట యత్నం శాంతమ్మ మనస్సు గుర్తించలేక పోయింది.

"గదిలోకి ఎందుకు వెళ్ళావ్?" అని అడిగింది.

"ఎందుకు వెళ్ళకూడదోనని వెళ్ళాను" అంటూ వెళ్ళి రవి మంచంమీద కూర్చొని తల్లి కేసి చూస్తూ "మనస్సేమీ బాగా లేదమ్మా! ఆయన నివాసంతో పవిత్రమై ప్రశాంతంగా ఉన్న ఆ గదిలో కూర్చుంటే, శాంతన్నా కలుగుతుందని కాస్సేపు కూర్చున్నాను" అని సమాధానం చెప్పాడు.

ఈ మాటతో శాంతమ్మకు కళ్ళనీళ్లు తిరిగాయి. లక్ష్మితో తిరిగి తన గదిలోకి వెళ్ళింది. అప్పటికే అర్ధరాత్రి

అయింది. ఇక రవి తన ప్రయత్నం విరమించుకున్నట్లుగా శాంతమ్మ నిర్ణయించుకొని నిద్దరపోతుందని రవి అనుకున్నాడు. మంచంకూడా శబ్దించకుండా రవి మెల్లగా లేచాడు. శాంతమ్మ, లక్ష్మి పడుకున్న గది గుమ్మందగ్గరగా కాస్సేపు నిలచాడు. బాగా నిద్దట్లో ఉన్నట్లుగా గుర్తించాడు. వీథి తలుపుదగ్గరకు వెళ్లి గడియమీద చేయి వేశాడు.

"నా మాట విను రవీ! వద్దు" అనే శాంతమ్మ మాటలు వినిపించి రవి స్తంభీభూతుడై పోయాడు. తేరుకుని కాస్సేపటికి మెల్లగా మళ్లీ తల్లి ఉన్న గదిదగ్గరకు వచ్చి తేరిచూశాడు. కాని అవి పలవరింతలుగా గుర్తించి దీర్ఘ శ్వాసవిడచి, మెల్లగా వీధిగడియతీసి బైటకు బయలుదేరాడు.

రవి జమీందారు ప్రహారీ గేటుదగ్గర నిలచాడు. కాపలాదారు గాఢ నిద్దట్లో ఉండటం గమనించి, మెల్లగా గేటుపైకి యెక్కి ప్రహారీలోపలకు దుమికాడు.

భవంతి వీధిద్వారం గట్టిగా బిగించి వుంది. ప్రక్క కిటికీనించి పరిశీలిస్తే, రాము ఒక గదిలో పడుకొని నిద్దర పోతూ కనిపించాడు. తన విడుదలకు కారణమైన రాముని మనస్సులో అభినందించుకున్నాడు.

పై భాగానికి పోవడానికి మరోదారిలేక స్తంభాల ఆధారంగా ప్రాకి, రెండో అంతస్తు అంచుని అందుకుని కార్య దీక్షలో కష్టాన్ని కూడా లెక్కచేయకుండా అంచుపై నిలచాడు.

గంగాధరం గది తిన్నగా వెళ్లి లోపలకు చూశాడు. గంగాధరం ఒక మంచంపై పడుకుని చిన్నగా గుర్రు పెడుతున్నాడు.

ప్రక్కగా ఉన్న మరో మంచంపై భార్య పార్వతమ్మ పడుకొనివుంది. ఏ కారణంగానో ఆమె అంత నిద్దట్లో ఉన్నట్లు రవికి స్ఫురించలేదు. ఆమె మెళుకువగా ఉన్నంత మాత్రాన్న తన దీక్ష నెరవేరదనే నమ్మకం రవికి లేదు.

అద్దాలతో అమర్చిన కిటికీని రవి తన్నాడు.

"గళ్ళు" మనే శబ్దంతో రెండు అద్దాలు బద్దలై ప్రోగులుగా కూలిపోయాయి. తృళ్ళిపడి ముందుగా పార్వతమ్మ లేచి రవిని చూసి కెవ్వున అరచింది.

జమిందారు లేచాడు. రవి లోపలకు దుమికాడు. పార్వతమ్మ పరుగున క్రిందిభాగానికి వెళ్ళిపోయింది. పోలీసు స్టేషనుకు ఫోను చేసింది. తరువాత తలుపులన్నీ తెరచింది. జమీందారు ధైర్యంగానే తలగడదగ్గరగా దేకుతూ "నువ్వా" అని పరామర్శ చేస్తూ తలగడలోనికి చేయి వెళ్ళనిచ్చాడు.

రవి హఠాత్తుగా గంగాధరంమీాద కురికి కైజారుతీసి గుండెల్లో పొడిచాడు. అపాయ పరిస్థితిలో కూడా జమీాందారు బలంకొద్దీ కాళ్ళతో రవిని తన్నాడు.

ఎడమచేత్తో కైజారు బాధగాపట్టుకొని, కుడిచేత్తో తలక్రింద పిస్టలుతీసి రవిని చూస్తూ "నాచావుకి ముందే—

నీచావు. నేను చూస్తాను'' అంటూ రవిపై ఫిష్టలు గురి చూపాడు.

శాంతమ్మ అప్పుడే వచ్చింది. ఆమె రాక రవిని ఆశ్చర్యపరిచింది. అంత అపాయ పరిస్థితిలో కూడా బిడ్డ కోసం, తల్లి హృదయం చేయగల త్యాగాన్ని గుర్తించిన రవి, ఆత్రంగా ''అమ్మా! నువ్వు అడ్డుగా రాకు'' అని పెద్దగా అరిచాడు.

శాంతమ్మ వచ్చిన జాడ, చావు బ్రతుకుల మధ్య పెనుగులాడుతున్న జమిందారు గుర్తించాడు. వెంటనే ఫిష్టలు మీాట నొక్కాడు.

''ఢాం'' అనే ధ్వనికి ముందే శాంతమ్మ రవిని ప్రక్కకు నెట్టింది. తన బిడ్డకు ప్రాణదానం చేసింది. కాని ఫిష్టలు గుండు మాత్రం శాంతమ్మ నుదుట పై భాగాన్నుంచి దూసుకు పోయింది. పేల్చిన వెంటనే నేల కొరిగాడు జమీాందారు. శాంతమ్మ రవి చేతుల్లోకి వాలిపోయింది.

ఇదంతా అతి శీఘ్రంగా క్షణాలమీాద జరిగిపోయింది. ఈ భయంకరమైన ఫిష్టల్ ధ్వని విన్న దాస దాసీ జనమంతా పైకి వచ్చారు. రాము పార్వతమ్మ కూడా వచ్చి, ఈ దృశ్యం చూసి నిశ్చేష్టులైపోయారు.

పార్వతమ్మ భర్త దగ్గరగా వెళ్లి, గుండెలనుండి స్రవించే రక్తాన్ని చూసి, ''కెవ్వు''మని అరచి కూలబడి పోయింది.

ఆ అరుపులో దాగిన అపాయాన్ని గుర్తించిన రాము ఆవేశంతో తొందరగా వెళ్ళి జమిందారు చేతుల్లో ఉన్న ఫిష్టలు లాగి, కక్షగా చూస్తూ రవిపై గురిపెట్టాడు.

క్షణంలో ఏం జరిగేదో; ఏమో! శాంతమ్మతో వచ్చి చాటున ఉన్న లక్ష్మి, రాము ప్రక్కగా వచ్చి, మారణాయుధాన్ని ధైర్యంగా చేత్తో పట్టుకుంది. రాము ఆశ్చర్యంగా ఆమె కేసి చూశాడు. ఆమె కళ్ళల్లో మెరిసే భావాల్ని అర్థం చేసుకున్నాడు. రాము చేతిలోని ఫిష్టలు అప్రయత్నంగానే లక్ష్మి చేతిలోకి వెళ్ళిపోయింది.

మరణయాతన పడుతున్న జమిందారుని చూసిన రాము, దుఃఖంతో కళ్ళు రెండూ మూసుకొని "నాన్నా" అంటూ శోకపూరిత కంఠంతో పిలిచి కాళ్ళదగ్గరగా చతికిలపడ్డాడు.

శాంతమ్మ చిట్లిన తలనుండి చిమ్మే రక్తాన్ని తుడుచుకోటానికి, ఏవిధమైన ప్రయత్నమూ చేయలేదు. రవి చేతుల నుండి మెల్లగా కదిలి చలించిన దృష్టితో, ఉన్మాదినిలా, జమిందారు కేసి చూస్తూ దగ్గరగా వచ్చింది.

జమిందారు ప్రాణం ఇంకా పోలేదనే విషయం అతని తీవ్రతర ఉచ్ఛ్వాస నిస్వాసాలు గమనిస్తోన్న అక్కడివారంతా గ్రహించగలిగారు.

శాంతమ్మ ముందుకు వంగింది. జాలిగా అతని కేసి చూసింది. ప్రశాంతంగా, ప్రస్ఫుటంగా ఇలా అంది "నాబిడ్డ

చేసిన పనికి నేను చాలా బాధపడుతున్నాను... కాని, ఏం చేయను-'' ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

దారం తెగి జారే ముత్యాల్లా, ఆమె కన్నీటిబిందువులు జమిందారు శరీరంపై జలజలా రాలాయి.

జమిందారు మాత్రం "ఊం!" అని మూలిగిన ధ్వని అందరూ స్పష్టంగా వినగలిగారు. కాని ఆ మూలుగు మరణ వేదనాభరితమైందో, లేక శాంతమ్మ బాష్ప స్పర్శ ద్వారా కలిగిన ప్రశాంతానుభూతో ఆ దుస్సమయంలో ఎవరూ తెలుసుకోడానికి ప్రయత్నించ లేదు.

"చూడండి" ఈ మాట కూడా శాంతమ్మే అంది.

జమిందారు ఆమెకేసి చూశాడు.

"ఇప్పటికైనా మీరు నిజాన్ని చెబితే, మీ ఆత్మకు శాంతి కలుగుతుందేమో;... అని మృదువుగా మెల్లగా సలహా రూపంలో అర్థించింది. జమిందారు కళ్లు ఒకసారి మరీ పెద్దవిచేసి శాంతమ్మకేసి చూశాడు. ఆ చూపులో ఆశ్చర్యమున్నా శాంతమ్మ గమనించ లేదు. ఆమె తలబాధ వల్ల నిశ్శబ్దంగా కాస్సేపు కళ్లు మూసుకుంది.

తీవ్రతరమైన మరణ బాధను పళ్లమధ్యనే అణుచుకోడానికి ప్రయత్నిస్తూ, కంపిత కంఠస్వరంతో– "ఈ సంగతి ఇంతవరకూ, రహస్యంగా వుంచగలిగారా...–!" అని వెంటనే "అబ్బా" అంటూ బాధగా గుండెల్లో, గుచ్చుకున్న బాకును పట్టుకున్నాడు జమిందారు.

ఎవరూ సమాధానం చెప్పలేదు. అంతా నిశ్శబ్దంగా జమిందారు కేసి దృష్టి ప్రసారించి చూస్తున్నారు.

"రామూ!–" అని జమిందారు పిలిచాడు. ఆ పిలుపు బాధవల్ల కాబోలు భయంకరంగా ప్రతిధ్వనించింది. రాము ఆత్రంగా తండ్రి ముఖంలోకి చూశాడు.

"శాంతమ్మ నిన్ను కన్నతల్లి. నువ్వు నా దత్తుడవు" ఈ మాటలు బహు నెమ్మదిగా తగ్గు స్థాయిలో అని, కక్షగా పళ్లు కొరుకుతూ "రవీ" అని బిగ్గరగా అరుస్తూనే హృదయంలోనుంచి కైజారును లాక్కొని, చింతలేనివాడిలా ప్రశాంతంగా కళ్లుమూసి ప్రాణం విడిచాడు జమిందారు.

రాము స్థితి ఇప్పుడు మరీ భయాశ్చర్య సమ్మిళితమై పోయింది. బరువుగా జమిందారు శరీరాన్ని పెనవేసుకున్న రాము హృదయం–శరీరంతో బాటు కాస్త పైకి లేచింది. తడియారని కళ్లతోనే దృష్టి మరలించి శాంతమ్మ కేసి చూశాడు. అతనిలో అంతర్గతంగా అణిగిమణిగి ఉన్న మాతృ మమకారం ఆవేదనతో తలెత్తింది. లేచాడు. హఠాత్తుగా "అమ్మా" అని బిగ్గరగా పిలిచి, చంటిపిల్లవాడిలా ఆమె చేతుల్లో వాలిపోయాడు. అంత బాధలోనూ శాంతమ్మ మనసారా "రామూ" అని తీయగా పిలచి, తనివితీరని ఆనందంతో, ఆప్యాయంగా అతని శిరస్సు స్పృశించింది.

అప్పుడే వచ్చిన పోలీసువారు, రవి దగ్గరగా వెళ్లి అరదండాలు పైకి తీశారు. రవి నేరస్తుడను తనే అనే భావంతో ధైర్యంగా చేతులు సర్కిల్ ముందుకు చాచాడు.

రాము ఆశ్చర్యంగా చూశాడు. ''రవీ'' అంటూ దగ్గిరిగా వెళ్లాడు.

అతి సన్నిహిత బంధుత్వం-అప్పుడే గుర్తించిన ఏకోదరత్వం - ఇద్దర్లోనూ తీవ్రంగా పరిభ్రమించి మూగగా పరితపించేటట్లు చేసింది.

తలవంచుకున్న రవిని, ఆదరణగా దగ్గిరిగా తీసుకున్న రాము విషాదపూరిత కంఠస్వరంతో ''క్షమించని నేరం చేశావు... దాని కారణం మనం ఎవరమో; అర్థం చేసుకోగల అవకాశాన్నివ్వని పరిస్థితులే అనుకుంటాను ... నిజం తెలుసుకొని, దగ్గిరిగా తీసుకోవాలని ఆశించే సమయంలో, నాకు నువ్వు దూరమౌతున్నావ్... కాని...'' అంటూ వుండగానే అతని కళ్లు చెమ్మగిల్లాయి.

రవి, రాము చేయి మెల్లగా నొక్కుతూ ''అన్నయ్యా! నా గురించి నాకెప్పుడూ భయంలేదు...కాని నా అన్నవాళ్ల బాధను చూసి, ఆ బాధకు కారణమైన వ్యక్తులను చూసి, నాలో ఆవేశం, భయాల్నీ, బాధ్యతల్నీ, ఆలోచల్నికూడా పూర్తిగా మింగేసింది. అయితే, ఇప్పటికీ నేను నేరం చేశాననే నమ్మకం నాకు కలగడంలేదు. తప్పెవరిదో భవిష్యత్తే చెబుతుంది...'' అంతవరకూ, ధైర్యంగా, బింకంగా చెప్పిన రవి, దూరంలో ఉన్న లక్ష్మికేసి చూశాడు. మళ్లీ మెల్లగా రాముతో ఇలా అన్నాడు ''వెళ్లే ముందు ఒకటి నిన్ను కోరాలనుకుంటున్నా.''

రాము ప్రశ్నార్థకంగా రవి కేసి చూశాడు. చెప్పమనే ప్రోత్సాహంకూడా ఆ చూపులోనే వుంది. ప్రక్కకు చూశాడు. పోలీసువారి మొగాలన్నీ ఆలశ్యానికి ఆగ్రహాన్ని వెళ్లడి చేయడానికి సిద్ధమౌతున్నట్లు రవి గమనించాడు. తిరిగి రామును చూశాడు.

"లక్ష్మి నాకు వదిన కావాలని కోరుతున్నాను... అమ్మను జాగ్రత్తగా చూస్తూవుండు...అంతే" అంటూ రవి ఒకడుగు ముందు కేసి, తరవాత అందర్నీ ఒకసారి చూసి, తల వంచుక ముందుకు వెళ్లిపోయాడు.

వీరుడులా, నిర్భయంగా వెళుతున్న రవిని చూసిన శాంతమ్మ ఆవేదనగా ఆఖరిసారిగా "రవీ" అని బిగ్గరగా అరిచి క్రింద పడిపోయింది.

*　　*　　*　　*　　*

రవి కోరిక ప్రకారమే లక్ష్మి, రాముకి అర్థాంగి అయింది. కాని భూదేవిలాంటి శాంతమ్మకు మాత్రం ఆ నాటి నుంచీ నోట మాట లేదు. మారణయంత్రంతో ఆమె శిరస్సు చిట్లిపోయింది.

రాము తల్లి మాటను వినాలని చాలా ఆశించాడు. పెద్ద పెద్ద ఇంగ్లీషు డాక్టర్లనూ, ఆయుర్వేద వైద్యులను కూడా

రప్పించి వ్యాధి నివారణకు ఎంత ధనాన్నయినా ధారపోస్తా నన్నాడు. "ఆమె మెదడులోని నరాలు గతులు తప్పాయి. బాగుచేతకు వీలులేదు" అని ఇంగ్లీషు డాక్టర్లు చెప్పి సాగి పోయారు. వెళుతూ వెళుతూ అనుభవమున్న ఆయుర్వేద వైద్యుడు మాత్రం వెనక్కి తిరిగి, రాముకేసి తీక్షణంగా చూస్తూ—

"చిన్నకొడుకు శోకతోనే పోయిన ఆమె వాక్కు, అతని రాకతోనే తప్పక తిరిగి రావాలి, అది న్యాయం. మీ అన్నదమ్ములిద్దరూ నిష్కల్మష హృదయాలతో చేయీ చేయీ కలుపుకొని చిరునవ్వులతో ఆమె కేసి చూసినప్పుడే; అమ్మ అమృత వాక్కు మీరు స్పష్టంగా వినగలుగుతారు" అని గంభీర కంఠస్వరంతో పలికి, శాసించే ప్రవక్తలా, రాముని మళ్లీ ఒకసారి తీవ్రంగా చూసి వెళ్లిపోయాడు.

ఐ పో యిం ది.